నేషనల్ బుక్ ట్రస్టు ప్రచురణ

# పోతన

నిడుదవోలు వేంకటరావు



భారత ప్రభుత్వ
సమాచార, రేడియో మంత్రిత్వశాఖ
ప్రచురణ విభాగము

# ము న్ను డి

తెలుగు భాషలో పోతన జీవితమునుగూర్చి, యాతని భక్తి మహాత్మ్యమును గూర్చి, భాగవతమును గూర్చి యీవఱ కెన్నియో వ్యాసములు, గ్రంథములు వెలువడినవి. కాని వానిలో, విషయములను సంగ్రహించి వివాదములను వీడి, ఉత్తమ సాహితీ విమర్శన పథకము ననుసరించి, ఏకాకారముగానున్న గ్రంథము అంతగా కానరాకున్నవి.

"కావ్యవిమర్శనాత్మక కవి జీవిత రచనము" అను సూత్రము ననుసరించి, నేడు 'పోతన' గ్రంథము సమకూర్చుట జరిగినది.

ఇది యొక్క తెలుగు భాషలోనే కాక భారతీయ భాషలలో ముఖ్యములైన తొమ్మిది భాషలలోను, ఇంగ్లీషు భాషలోను కూడ ప్రకటితమగును. అందువలన నాంధ్రేతర భాషాసాహితీ వేత్తలకు నిది యెంతయును పాదేయమగును. ఇట్లితర భాషాంతరీకరణ గౌరవమునకు పాత్రమైన 'పోతన' గ్రంథమును రచించుటకు నాకు నవకాశము నొసగిన "నేషనల్ బుక్ ట్రస్టు, ఇండియా" వారికి నాకృతజ్ఞతను తెలుపుచున్నాను.

గ్రంథకర్త.

# విషయ సూచనము

- శ్రీః -

# పోతన

# భాగవతము

# భావగతము

అయిన

భవరోగార్తులు నిర్లేపత్వము

భాషా జ్ఞానార్థులు భాషాజ్ఞానము

సుకవిపుంగవు లానందము

భాగవతులు దృఢ భక్తిని

ముముక్షువులు మోక్షమును బొందెదరు

బొందెతో కైవల్యముఁ జెందెదరు

"క॥ నీపాద కమలసేవయు
నీపాదార్చకులతోడి నెయ్యంబు నితాం
తాపార భూతదయయును
తాపసమందార! నాకు దయసేయఁగదే!"

—భాగవతము

# 1. అ వ తా రి క

ఆధ్యాత్మిక విద్యా సంపన్నమైన యాద్య భారతీయ వాఙ్మయమును, అష్టాదశ పురాణములలో నొకటియై, ఆద్యంతము భగవద్భక్తి తత్త్వ ప్రతిపాదకమై, భక్తిరస సిద్ధాంతమున కాలంబమై, ప్రామాణికమైనది శ్రీమహాభాగవతము సంస్కృతమున శ్రీ వేద వ్యాసమహర్షి ప్రణీతమై, ఆ మహర్షి తనయుడగు శుకమహర్షిచే పఠితమైన యాభాగవతమును తెనుగుభాషలో [1] రచించిన మహాకవి బమ్మెర పోతన పోతన రచిత భాగవత మాంధ్ర వాఙ్మయ ప్రపంచమున నవతరించి నేటికైదు శతాబ్దులు — అనగా నైదు వందల సంవత్సరములైనది ఆనాటినుండి నేటివరకు ప్రసిద్ధి గన్న గ్రంథములలో నాంధ్ర ప్రజానీకమున ఆబాల గోపాలమును అత్యధికముగ నాకర్షించినది పోతన భాగవతమే! పండితులు—పామరులు, బాలురు—వృద్ధులు, స్త్రీలు—పురుషులు, వారు వీరు అన నేల ? సమస్తాంధ్ర మహాజన హృదయములను జూరగొనినది భాగవతమే! పల్లెలలో నేమి, పట్టణములలో నేమి, భాగవతమునందలి పద్యములు ప్రజలకు కంఠస్థములు పద్యములే కాదు, ప్రహ్లాదచరిత్ర, గజేంద్ర మోక్షము, రుక్మిణీ కల్యాణము మొదలగు ఘట్టము లన్నియు కంఠస్థములే ఈ యిరువదియవ శతాబ్దిని గూడ, తెల్లవారు జామున గజేంద్ర మోక్షణము పద్యములను నిత్యము పఠించువారున్నారు

భాగవతమున భీష్మస్తవము, అక్రూర దండకము, గోపికా గీతలు, భ్రమర గీతలు నేటికిని పారాయణము చేయువారున్నారు

ఈనాడే కాదు క్రైస్తవ శకము పదునారవ శతాబ్దిని విజయనగర సామ్రాజ్యాధీశులైన కర్ణాట రాజులు తెలుగు భాగవత ఘట్టములను పఠించువారని వారి దినచర్యను దెలుపు 'రాయ వాచకము' అను గ్రంథమునుండి తెలియుచున్నది

"విద్యానగరమందు వీరనృసింహ రాయలవారు బ్రాహ్మీ ముహూర్తాన లేచి,ఆరాధ్యుల నామా వళులున్నూ, అధ్యాత్మ సంకీర్తనలున్నూ, పాండవ గీతలు, భ్రమర గీతలు, గజేంద్ర మోక్షం, భారత సావిత్రి, గంగావతరణమున్ను భారతం, భాగవతం, ముచికుంద స్తుతి, అక్రూర స్తుతియునూ

పఠించి విని"

---

[1] ఆంధ్ర భాష — తెలుగు భాష ఒక దానికొకటి పర్యాయ పదములు. 'తెలుగు' అను పదము కేవలము భాషాపరముగను, 'ఆంధ్రము' అను పదము, కేవలము దేశపరముగను వాడుకలో నున్నది

పైని యుదాహరించినవన్నియును సంస్కృతములు కావు. ఆరాధ్యుల నామావళులనఁగా సహస్ర గణ మాలిక. ఇది కన్నడమున తెనుఁగున గాని సంస్కృతమున లేదు. అధ్యాత్మ సంకీర్తనలనఁగా, తాళ్లపాక అన్నమయ్యగారి సంకీర్తనలు. ఇవి తెలుఁగుననే యున్నవి. కాబట్టి, భ్రమర గీతలు, గజేంద్ర మోక్షము మొదలగునవి, పోతన భాగవతమునుండియే యని మనకు స్పష్టమగుచున్నది.

ఇట్లు, సార్వజనీనత్వము, సార్వకాలికత్వము, సార్వదేశికత్వము, సంపూర్ణముగ మూర్తీభవించిన తెలుఁగు కృతి పోతన భాగవతము.

౧

తెలుఁగు భాషలో భాగవతమునకింత యత్యధిక వ్యాప్తి గల్గుటకు పోతన యప్రతిమాన భక్తి విశేషమును, అనితరసాధ్యకవితామహత్త్వమును కారణములు. భక్తిలో బుట్టి, భక్తిలో పెరిగి, భక్తిరస సిద్ధుఁడైన మహనీయుఁడు కావుననే పోతన భక్తి విషయులగు భాగవత పాత్రలతోఁ దాదాత్మ్యమును పొందినాఁడు. భక్త్యనుభూతిని హృదయముల యందు ముద్రించినాఁడు. ఇట్టి భక్తి రసానుభవావిష్కరణమునకు సంస్కృతరస మాధురీ ధురీణంబగు నాంధ్ర భాష పోతనకు వశ్యమైనది. చదువుటకు మొదలిడిన తోడనే, శ్రవణ మనోహరములై, సమవిభక్తములైన, యనుప్రాస పద విన్యాసములును, కోమల శయ్యా సౌభాగ్యమును, భక్తి మాధుర్య ప్రసారిత భావ సంపదయు ప్రతి పాఠకుని హృదయమును పారవశ్యము నొందించును. ఒకే గ్రంథమున కథా సూత్రమున నిమిడి యుండియు, ప్రతి పద్యమును నొక ముక్తకము వలె, ప్రత్యేక ప్రత్యేకముగ, పఠనీయముగ నుండునట్లు రచింపఁగల యతి లోకోత్తర కవితా శక్తి పోతన కున్నట్లు మరి యే తెలుఁగు కవికి లేదు. ఇట్టి ప్రత్యేకత చేతనే పోతన భాగవతమున పద్యములలో నొకటియైన ప్రతి యాంధ్రుని నాలుకపై నాట్యమాడుచునే యుండును.

తెలుఁగున స్పష్టముగనుచ్చారణ యలవడని జానపదుఁడు గూడ, పోతన భాగవత పద్యములను తనకు సహజమగు నస్పష్టోచ్చారణతోనైన జదువుచు నానందించుచున్నచో, పోతనభాగవతమునకు నాంధ్ర ప్రజా హృదయసీమ నెట్టి శాశ్వత స్థానమున్నదో ప్రాజ్ఞులు గ్రహింపఁగలరు.

దీనికి దృష్టాంతముగా నీ క్రింది యుదంతమును వినుఁడు —

పల్లెల యందు భాగవతము పురాణముఁజెప్పుదురు. ఒకనాఁడు పౌరాణికుఁడు (పురాణము చెప్పెడి బ్రాహ్మణుఁడు) రాలేదు. అంత నొక జానపదుఁడు భాగవతము దీసి యష్టమ స్కంధమున గజేంద్రమోక్ష ఘట్ట ప్రారంభమున నున్న యీ క్రింది పద్యము తన కలవడిన భాషలో నిట్లు చదివెను —

"మానవాధీ సరమణుగు నాలిక వాడు" ఇది—"మానవాధీశ్వర మనువు నాలవ వాడు" అను పోతన పద్యమునకు పామర భాషలో రూపాంతరము అప్పుడు అర్థము మారినది

మనువు నాలవ వాడు — నాల్గవ మనువు అని పోతన యర్థము

మణుగు బరువుగల నాలిక కలిగిన వాడు, అని పామర భాషలో నర్థము అప్పుడచ్చటున్న మరి యొక పల్లెవాడు లేచి —

"ఇనుము యిదర్భ దేశమున యీరుడు కుండిన కుండు" అని భాగవతమునందే రుక్మిణీ కల్యాణమునందలి పద్యము చదివెను ఇది మొదటి దానికి ప్రత్యుత్తరము "మణుగునాలుక యిదర్భ దేశమున యీరుడైన కుండినకు ఉండును" అని అర్థము కాని పోతన పద్యమిది —

"వినుము విదర్భ దేశమున వీరుడు కుండినకుండు" విదర్భ దేశములో వీరుడు—కుండిన కుండు — అనునొక రాజుండెను, అని దాని యర్థము కుండిన అనువానికుండును అని పామరార్థము ఇట్లర్థము తెలియక పోయినను భాగవతము చదువుదురన్నచో దాని మాహాత్మ్య మెట్టిదియో గ్రహింపనగును

భాగవత రచనా ప్రారంభ కాలమునుండియే పోతన భక్తి మాహాత్మ్యములు లోకమందు వ్యాపించినవి వానిని ప్రజాసామాన్యములో కర్ణాకర్ణిగా జెప్పుకొనుచుండిరి అవి కొంత కాలమునకు గ్రంథస్థములైనవి ఐహికేచ్ఛా విముఖుడయ్యును పోతన, సంసారము చేయుచు, "సర్వం విష్ణుమయం జగత్" అను సూక్తి ననుసరించి, నిర్లిప్తుడై, పరమేశ్వర భక్తి భావనతో జీవితము గడపెడివాడు దరిద్రావస్థలోనున్నను ధారుణీపతులను తృణీకరించి, ధనాశాపాశము నామూలముగా విదారించినాడు స్థిరమును, శ్రేష్ఠమును నగు భక్తి తత్పరత చేత జీవితకాలములో భగవత్ సాక్షాత్కారమును బొందిన పోతనను దైవముగా ప్రజలారాధించిరి ఆతని భాగవతము భగవద్దత్తమైన మహాప్రసాదముగా భావించిరి

తెనుగు భాగవతము యొక్క మహిమ యద్వితీయమైనది పాషాణ హృదయమునైన నందలి పద్యములు ద్రవింపజేయును పచ్చి కసాయి వానినైన, పరమ భక్తాగ్రేసరునిగా నొనరించును. బాలునైనను మహాపండితునిగా దిద్ది తీర్పగలుగును ఇక భక్తాగ్రగణ్యుని కది పారాయణమై విలసిల్లుననుటలో సందేహమేమున్నది ?

పోతన భాగవత ప్రశస్తి మన యాంధ్రము దాటి మహారాష్ట్ర దేశమున మన్నన గన్నది శ్రీ శివాజీ మహారాజునకు గురువులైన సమర్థ రామదాస స్వామి వారు, తమ "దాస బోధ" గ్రంథమున పోతన భక్తి ప్రవత్తిని ప్రశంసించియున్నారు

అఖిల సంగీత ప్రపంచమునకు సర్వస్వరూపుఁడై, నాదబ్రహ్మయై, నారదాపరావతారమగు త్యాగరాజు పోతన భాగవతమును ప్రతి దినమును పారాయణము చేసెడివాఁడు. ఈ విషయ మొక్కటియు తెలుగు భాగవత దివ్యత్వమును తేటపరచును.[1]

తమిళ నవయుగ ప్రవక్త భారతి "సిల కవియరశర్" (కొందఱు కవిరాజులు) అను వ్యాసమున పోతన మహాకవిని ప్రశంసించెను.

హరికథా పితామహుఁడై, సంగీత సాహిత్యనిధియై చతుర్భాషా పండితుఁడై, 'ఆట పాట మాటల మేటి' యైన అజ్జాడాదిభట్ల నారాయణదాసునకు నైదవ యేట భాగవతము తోడనే యక్షరాభ్యాసమైనది. భాగవత భక్తి రసాస్వాదన చేత నాతని రచనలు హరికథా రూపమున నాంధ్ర సాహితిని రంజింపఁజేసినవి. ఆంధ్ర భాగవతావతరణ కాలమునుండియు కవులు పోతనను స్మరించుచునే యున్నారు.

ఆధ్యాత్మిక భక్తి భావనతో గాకున్నను, ఆంధ్ర భాషా సారస్వత చారిత్రక పరిణామ దృష్టితో నైన నేఁడు సాహితీ విమర్శకులు, చారిత్రకులు, కవులు, గాయకులు, సహృదయులును, పోతనకు భక్త్యంజలులు సమర్పించుచునే యున్నారు.

ఆంధ్ర సాహిత్యమును తన యమృత వాణితో రస స్నిగ్ధముగనొనర్చిన భక్తిరస ప్రవక్త పోతన జీవితము నిక చదువుదము.

౨

మంత్ర ద్రష్టలగు మహర్షుల వలె మహాకవులు దేశ కాల జాత్యాదులచే విభాజ్యులు కారు. అమృతములు, నఖిలలోక కల్యాణాత్మకములు నగు వారి రచనలు నట్టివే. ఆంధ్ర వాఙ్మయమున పోతన అట్టి మహా ఋషి; మహా కవి. ఆతని భాగవత పురాణమును అట్టి యజరామరకృతి.

ప్రణవము నందలి మూఁడు మాత్రల వలె, యందుండి యావిర్భవించిన యాంధ్ర వాఙ్మయ జగత్తునకు రామాయణ భారత భాగవతములు మూఁడును మూల స్తంభాయ మానములు. మన ప్రాచీన సంస్కృత సంప్రదాయము ననుసరించి, రామాయణము కావ్యము; భారతము ఇతిహాసము; భాగవతము పురాణము. కాని తెలుఁగున నీమూఁడింటికి "పురాణములు" అనియే వాడుక గలదు.

ఆంధ్రుల భక్తిమయ జీవిత రంగమున పోతన యవతరించునాటికి భారత రామాయణములు రెండును తెనుఁగులోనికి సమాధితములైనవి. భారతము "నన్నయ, తిక్కన, ఎఱ్ఱన" అను

[1] త్యాగరాజస్వామి పారాయణ చేసిన భాగవతము, నేటికిని చెక్కు చెదరకుండ, తాళపత్ర రూపమున, తిరువయ్యూరిలో త్యాగరాజ స్వామి గృహమున భద్ర పరుపఁబడియున్నది.

కవిత్రయము వారి చేతను, రామాయణము భాస్కరాదుల చేతను రచితములైనవి. వీనిలో నాద్య మగు భారత మఖిలాంధ్ర వాఙ్మయ సౌధమునకుఁ బునాదియై కవితా గౌరవముచేత, ప్రామాణి కత్వము చేత సకలాంధ్ర కవులకు నుపజీవ్యమై విరాజిల్లినది. భారతము రచించిన కవులలో నన్నయ శబ్దశాసనుఁడు; తిక్కన కవిబ్రహ్మ; ఎఱ్ఱన ప్రబంధ పరమేశ్వరుఁడు. ముగ్గురు ఋషి కల్పులు, తపస్సంపన్నులు. కావుననే, తెనుఁగున రామాయణ రచనలో కవితా రామణీయకమున్నను భారతమే కవితాప్రపంచమున నగ్రస్థాన మధిష్ఠించినది. పురాణ రచనమునకు కేవలము ప్రతిభా సంపదయే కాక, ఆత్మ శుద్ధి, తపస్సిద్ధియు కూడ నత్యావశ్యకములు.

భాగవత పురాణము పై రెండింటి కన్న ప్రత్యేక విశిష్టత గలది. కొందరు భగవత్తత్త్వార్థ ప్రతిపాదనమున, భగవద్గీతకు పిమ్మట భాగవతమునే పరిగణింతురు. వేఱొక కొందరు భగవద్భక్తి ప్రతిపాదనమున భాగవతమునే ప్రధాన గ్రంథముగా, ప్రామాణికముగఁ గైకొందురు.

భగవత్తత్త్వమును భక్తి తత్త్వముతో సమ్మేళనము చేసి, వ్యాసమహర్షి ప్రణీత శుకయోగి పఠిత మహాభాగవతము నాంధ్రవాఙ్మయమునకుఁ బ్రసాదించుటకు నాంధ్రుల బహుజన్మ కృత పుణ్య పరిపాక వశమున బమ్మెర పోతన పదునైదవ శతాబ్ది నవతరించెను.

భాగవతాంధ్రీకరణము కొఱకు పోతన, పోతన కొఱకు భాగవతాంధ్రీకరణమును, క్రైస్తవ శకము పదునైదవ శతాబ్దివఱకు వేచి యున్నట్లుగా భాగవతావతారిక నుండి యీ క్రింది పద్యము వలన గ్రహింప వచ్చును.

మ. ఒనరన్నన్నయ తిక్కనాది కవులియ్యుర్విం బురాణావళుల్
తెనుఁగుంజేసియు మత్పురాకృతశుభాధిక్యంబు దానెట్టిదో
తెనుఁగుం జేయరు మున్ను భాగవతమున్ దీనిం దెలింగించి నే
జననంబున్ సఫలంబుఁ జేసెద పునర్జన్మంబు లేకుండగన్.
(1—21)

పోతన, భారత రామాయణములను పురాణములుగనే పరిగణించినను, జన్మ రాహిత్యము, భగ వద్భక్తి తత్త్వ ప్రధానమగు భాగవతము వలననే కలుగునని పై పద్యమున స్పష్టపరచినాఁడు. దీనికి కారణము 'నానారసాభ్యుదయోల్లాసి' యైన భారతముకన్నను, రసోల్లసితమైన రామాయణము కన్నను, భక్తిరసము ప్రధానముగా నందు ప్రపంచిత మగుటయే యని పోతన యాశయము.

కర్మ జ్ఞాన భక్తి మార్గములలో భక్తి మార్గమందర కందుబాటులోనుండు రాజ మార్గము. అది సర్వ జన సుగమము. కర్మ జ్ఞానములు మనుజునకు సహజములు గావు; కొన్ని పట్టుల సాధ్య

ములును గావు కాని భక్తి మార్గ మట్టిది గాదు అది సహజము, స్వతస్సిద్ధము బ్రహ్మజ్ఞానము చేత పదునాల్గు జన్మములకైన పొందరాని కైవల్యమును ఫలాపేక్ష లేని నిశ్చల భక్తిచె నొక్క జన్మ చేతనే సులభముగ పొందవచ్చును

అట్టి భక్తి ప్రతి పాదకమగు భాగవత గ్రంథమును తెలుఁగు జెసినందువలన, జన్మ రాహిత్యము పోతనకేకాదు, సర్వాంధ్ర జనులకుఁగలిగినది ఈ పద్యమున నింకొక విశేషము గలదు పునర్జన్మము లేకుండుట తనకే కాదు, తాను రచించిన భాగవతాంధ్రీకరణమునకుఁగూడనని యర్థము అంధ్రీకరణమునకు బునర్జన్మ యనఁగా వేఱొక కవి భాగవతానువాదమును పోతన కన్న రసవత్తరముగా వెలయించుట పోతన కాలము నాటినుండి నేఁటివరకు, భాగవతమున పోతన రచింపక వదలి పెట్టిన భాగవతాంధ్రీకరణములే యున్నవి కాని పోతనకృతమని చెప్పఁదగిన భాగములకు పోటీయై నిలిచి వేరుగానున్న భాషాంతరములు లేవు ఇక ముందు నుండవేమో? పోతన రచనతో తులతూఁగు రచనను చేయఁగల మహాకవి తెలుఁగున "నభూతో న భవిష్యతి"

విష్ణుభక్తి మార్గమును తొలుత నాంధ్ర వాఙ్మయ ప్రపంచమున భాగవత మూలమున పోతన సుప్రతిష్ఠితము గావించెను కాని యది సామాన్య కార్యముగాదు అతి లోకోత్తర కృషి. భాగవత మాహాత్మ్యమును దెలుపుచు పోతనయే యిట్లు వ్రాసి యున్నాఁడు

ఆ వె భాగవతముఁ దెలిసి పలుకుట చిత్రంబు
శూలికైన తమ్మి చూలికైన
విబుధ జనులవలన విన్నంత కన్నంత
తెలియ వచ్చినంత తేట పఱతు

సాటి లేని వినయముతో "తేట పఱతునని" లేఁబలుకు మొలకలతోఁ దెలియజేసియు, నా వెనుకనే, భక్తి సంస్కృతి చేత, భాగవతమొక మహావృక్షముగా నెట్లు పరిణమింపఁ జేసినదియు నీ క్రింది విధముగా వ్యక్త పఱచియున్నాఁడు

ఉ. లలితస్కంధముఁ, గృష్ణమూలము, శుకాలాపాభిరామంబు, మం
జులతాశోభితమున్, సువర్ణ సుమనస్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వల వృత్తంబు మహాఫలంబు విమలవ్యాసాలవాలంబు నై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరు వుర్విన్ సద్ద్విజ శ్రేయమై

సారస్వత దృష్ట్యా నన్నయ వాల్మీకి, తిక్కన వ్యాసుఁడు, పోతన శుక యోగి ఈ తెలుఁగు శుకయోగి యాంధ్ర భాషయందే కాక, భారతీయ భాషలన్నింటియందున్న భాగవతములకన్న మిన్నగ రచించెనో లేదో చూచెదము గాక !

## 2. భారత దేశీయ భాషలు - తెలుఁగు భాగవతము

భారత దేశమున దేశ భాషలలో సంస్కృత మహా భాగవతమును మూలాను సారముగ, వ్యాఖ్యాన రూపకముగ భగవద్భక్తి రసోద్దీపకముగ సంపూర్ణముగ ననువదించిన యశస్సు తెలుఁగువారిది. ఆంధ్ర రాష్ట్రేతర భాషా వాఙ్మయముల చరిత్రలను పరిశీలించిన, భాగవతమునకు, దేశ భాషలలో ప్రత్యేక గౌరవ విశిష్టత, కావ్యసిద్ధి, సాహితీ ప్రశస్తి సంపాదించినది తెలుఁగు భాష యొక్కటియే. దీనికి . "మూలకారణంబెవ్వఁడు?" [1] అని పరిశోధించిన మనకుఁగన్పట్టు మహావ్యక్తి బమ్మెర పోతనయే. ఈ విషయమాంధ్ర వాఙ్మయ చరిత్రలో సువర్ణాక్షరములతో లిఖింపఁదగినది.

తొలుత దాక్షిణాత్య భాషలలో భాగవతానువాదములను గూర్చి పరిశీలింతము.

### తమిళము :

ద్రావిడ భాషలలో ప్రాచీనమగు తమిళమున భాగవతానువాదము, పదునారవ శతాబ్దినుండి ప్రారంభమైనది. మధురకవి వరదరాజ అయ్యంగారు, విశిష్టాద్వైత సంప్రదాయానుసారముగ దీనికి తమిళానువాదము గావించిరి. మూలమునందలి విషయములు చాలవరకు లోపించినవి. క్రీ.శ. 1700 ప్రాంతమున "అరియప్ప పులవర్" అను నాతఁడు భాగవతము పంద్రెండు స్కంధములను తమిళములో వ్రాసెను. కాని యిది సంగ్రహ రచన. క్రీ.శ. 19 వ శతాబ్దిలో "కలంగుడి నటేశ శాస్త్రియు" తమిళమున ననువదించెను.

తమిళ సారస్వతమున కంబమహాకవి రచిత రామాయణమునకుఁగల వ్యాప్తి, ఆదరణ భారత భాగవతముల కెంత మాత్రమును లేవు.

### కన్నడము :

కన్నడ భాషలో చాటు విఠలనాథుఁడను కవి భాగవతమును క్రీ.శ. 1530 ప్రాంతమున భామినీషట్పదీ వృత్తములతో రచించెను. ఆయనువాదమున కవియే తాను భాగవతార్థమును

---

1 ఈ వాక్యము పోతనదే.

ఉ. ఎవ్వనిచే జనించు జగ మెవ్వని లోపల నుండు లీనమై
యెవ్వనియందు డిందు పరమేశ్వరుఁ డెవ్వఁడు 'మూల కారణం
బెవ్వఁడు ---

సంగ్రహించితినని వ్రాసి యుండుటచే నిది భాగవతమునకు సంపూర్ణానువాదము కాదు. కన్నడ భాషలో, జైన, శైవ వాఙ్మయములు ప్రధాన స్థానమాక్రమించినవి. భారత భాగవతములకంత ప్రచారము లేదు. విఠలనాథునిది విశిష్టాద్వైత సంప్రదాయము ననుసరించినది. కుమార వ్యాసుని భారతమున కున్నంత వ్యాప్తియు దీనికి లేదు.

## మలయాళము :

మలయాళ భాషలో "ఎజుతచ్చన్" పేర భాషా భాగవతము గలదు. అందు మొదటినుండి తొమ్మిది స్కంధములొకరి రచనముగను, తక్కినవి "పురయన్నూర్ నంబూద్రిపాదు" విచేతను, 'ప్రస్న సేరినంబి'యనువాని చేతను భాషాంతరీకరింపఁబడినవి. ఈ "ఎజుతచ్చన్" [1] భాగవత రచనను గూర్చి భేదాభిప్రాయములు గలవు. అతఁడు దానిని వృద్ధాప్యమున రచించెననియు, తిరిగి దానిని సంస్కరించుటకాతని కవకాశము కలుగ లేదనియు నందుచే నాయన శిష్యులలో నొకరు దానిని సంస్కరించి, ఆయా భాగములను "ఎజుతచ్చన్" పేరనే రచించిరనియు విమర్శకాభిప్రాయము. కాని ఎజుతచ్చన్ అధ్యాత్మరామాయణమునకు వచ్చిన వ్యాప్తిలో కొంత యయిన నాతని భాగవతమునకు రాలేదు.

ఆంధ్ర భాగవత విమర్శకులలో బహుభాషా విశారదులును, ప్రసిద్ధ విమర్శకులు అగు సరస్వతీ పుత్ర పుట్టపర్తి నారాయణాచార్యులవారొక్కరు మాత్రమే "ఎజుతచ్చన్" దశమస్కంధ రచనను గూర్చి తెలిపిరి. పోతన రచనను, ఎజుతచ్చన్ రచనను బరిశీలించి, రెండు పట్టుల, నెట్లు ఎజుతచ్చను భాగవత రచనలో కొన్ని మెరుగులు జూపినదియు వివరించి యున్నారు. "ఎజుతచ్చను వ్రాసిన భాగవతమునకు, వర్ణనా నైపుణ్యమునను, కథాను విధానమునను పోతనతో పోటీ లేదు" అని వారి యభిప్రాయమును దెలిపి యున్నారు. [2]

## మహారాష్ట్ర భాష :

మహారాష్ట్ర భాషయందు, మహా భక్తుఁడగు ఏకనాథుఁడు భాగవతమును క్రీ. శ. 1580 ప్రాంతమున రచించెను. ఇతనిది పద్య కృతి. ఇది మహా రాష్ట్ర దేశమున ప్రసిద్ధినంది నది. పండరి పురమున విఠోబా మందిరమున దీనినుండి కొన్ని భాగములను సంకీర్తనలుగా పాడు

---

1 *Ezuttaccan and His Age:* **Late Dr. C. A. Menon, B.A., Ph.D.**
**A note on Bhagavatam and its Authorship, Pp 181-183 published by the University of Madras.**

2 ఆంధ్ర మహాభాగవతోపన్యాసములు — పోతన కవిత్వము. పుటలు 149, 154, 155

దురట[1]! కాని యిది సంస్కృత భాగవతమునకు పూర్ణానువాదముగాదు. "ఏకనాథుఁడు తన భాగవతమునందు బ్రహ్మాండముగ పెంచి వ్రాసినది కృష్ణోద్ధవసంవాదమునే! తక్కిన కథా భాగమునంతయుఁ జాలటూకీగా వెళ్లగొట్టినాడు" అని విమర్శకాభిప్రాయము.[2] మహారాష్ట్ర భాగవతమున భాగవత ధర్మము "ఆనంద వన భువనము" అని నిర్వచింపఁబడినది.

## గుజరాతీ భాష :

ఈ భాషలో భాగవత సంపూర్ణానువాదము వెలువడలేదు. భలణుఁడు (1434—1514) అను నాతఁడును, ప్రేమానందుఁడు (1636—1734) ను, సంస్కృత భాగవతమున దశమస్కంధము మాత్రమే గుజరాతీ భాషలోని కనువదించిరి. నకరుఁడు (1500—1575) విష్ణుదాసు (1564—1632) అనువారు భాగవతమునందలి యుపాఖ్యానములను గుజరాతీ భాషలోనికనువదించిరి.

రత్నేశ్వరుఁడు (1650—1720) అను కవి భాగవతమునసువదించెను గాని యది చాల సంగ్రహ రచన.

## ఒరియా భాష లేక ఓఢ్ర భాష :

ఒరియా భాషలో 'జగన్నాథ దాసు' అనునతఁడు, సంస్కృత భాషలోని భాగవతము పండ్రెండు స్కంధములననువదించియున్నాఁడు. ఇది యోఢ్ర దేశమున ప్రచుర ప్రచారము గలది. జగన్నాథ దాసు భక్తుఁడు, కవి, సంస్కృత భాషావేత్త. అతఁడు పోతనకన్న కొంచెము వెనుక వాఁడు. జగన్నాథ దాసు రచన సమగ్రమే యయినను నది భక్తిరస విస్తరణయందు, తెలుఁగు భాగవతముతో సరిరాదు. మరియు నందు వంగ వైష్ణవ సంప్రదాయములు కాననగుచున్నవని తెలియుచున్నది.

ఇక నౌత్తరాదిక భాషలలో భాగవతానువాదములను బరిశీలింతము —

## బంగాళీ భాష :

'మాలా ధరదాసు' అను బంగాళా భాషా విద్వాంసుఁడు భాగవతము నాభాషలోనికి, పదునారవ శతాబ్దిని రచించి యున్నాఁడు. కాని చైతన్య మతమునకు జన్మస్థానమైన యా దేశమున నీ యనువాదమునకు ప్రాముఖ్యము లేదు.

---

[1] *The Religious Quest of India* **J. N. Farquhar M. A. Pp 300**

[2] ఆంధ్ర మహాభాగవతోపన్యాసములు — పోతన కవిత్వము. పుట 149

## అస్సాము భాష :

ఈ భాషలో భాగవతము ననువాదమును పొందినది. శంకర దేవుడను మహాకవి దీనిని అస్సాము భాషలో పద్యకృతిగా రచించెను. ఈతడు క్రీ.శ. 1449 లో బుట్టి క్రీ.శ. 1568 లో మరణించెను. ఈతని జీవిత కాలము 119 సంవత్సరములు ! ఈతడు గాక, మరి తొమ్మండుగురు భాగవతములోని వివిధ స్కంధముల నస్సాము భాషలోని కనువదించిరి.

## పంజాబీ భాష :

ఈ భాషయందు క్రీ.శ. 1600—1800 ప్రాంతముల మధ్య భాగవతమనువాదితమైనట్లు తెలియుచున్నది. దీని ప్రశంసయే గాని, వివరము లావాఙ్మయ చరిత్రలయందు లేకుండుటచే నా భాషయందు భాగవతమునకు ప్రసిద్ధి లేదని గ్రహింప వచ్చును.

## హిందీ భాష :

నేటి భారత జాతీయ భాషయగు హిందీ భాషయందు భాగవతమునకు సముచిత స్థానము గలదు. హిందీ సాహిత్యమున, రామ భక్తి సాహిత్యము, కృష్ణ భక్తి సాహిత్యము అని రెండు విభాగములు గలవు. మొదటిదానికి ప్రధాన గ్రంథము లోకోత్తరమగు తులసీదాస మహాశయుని రామ మానస చరితము; రెండవ దానికి ప్రధానమైనది సూరదాసు రచిత "సూర్ సాగరు" అను కృతి.

"సూర్‌సాగర్" అనుకృతి లక్ష పాతికవేల పదములు గల మహా గ్రంథము. కాని యిప్పుడందు లభించు పదముల సంఖ్య పది వేలకు మించి యుండదు. సంస్కృత భాగవతము వలె నిందును ద్వాదశస్కంధములు గలవు. కావున నిది యా భాగవతమునకు ననువాదమని కొందరు భ్రమపడ వచ్చును. కాని యిది సరి కాదు. "సూర్‌సాగర్" గ్రంథమున గల వివరముల నీ క్రింద నిచ్చెదను.

| | | |
|---|---|---|
| 1. | ప్రథమస్కంధము | ఇష్ట దేవతా స్తుతి |
| 2. | ద్వితీయమునుండి అష్టమము వరకు | విష్ణువు యొక్క అవతారములు ఇతర పౌరాణిక కథలు |
| 9. | నవమస్కంధము | శ్రీరామావతార కథ |
| 10. | దశమస్కంధము | పూర్వార్థము శ్రీ కృష్ణుని బాల లీలలు; ఉత్తరార్థము శ్రీ కృష్ణుని మధురా నగర గమనము. తరువాత సంఘటనలు. |

"సూర్‌సాగర్" నందు పై విధముగా విషయ విభాగమున్నను, అందు దశమస్కంధమున ప్రాధాన్యము. సూరదాసు వల్లభ సంప్రదాయమునకుఁ జెందినవాఁడు. ఆ సంప్రదాయము

ముఖ్యాంశమగు శ్రీకృష్ణలీలాగానము చేయుటయే యతని లక్ష్యము. ఈ లక్ష్యసిద్ధికై సూరదాసు, తనకు వలసిన ఘట్టములను (ముఖ్యముగా శ్రీకృష్ణ కథా సందర్భమున) విస్తరించి రచియించి, తక్కిన వానిని సంక్షేపముగఁ జెప్పియున్నాఁడు. కాబట్టి మూల భాగవతమునందలి భావముల నాతఁడు యథాతథముగా పాఠక లోకమునకందింపవలసిన యావశ్యకత లేదు. అది యతని యాశయమును కాదు. ఇక దశమస్కంధమున, శ్రీకృష్ణుని బాల్య లీలలను వర్ణించుటయందేమి, యశోదానందుల వాత్సల్యమును చిత్రించుటయందేమి సూరదాసునకు సాటిగా నిల్వఁగల కవి లేఁడని కంఠోక్తిగఁ జెప్పవచ్చును. ఇక 'సూర్ సాగర్' నందలి భ్రమర గీతలకు , పోతన భాగవతమునకు పోలికయే లేదు. తెలుఁగు భాగవతమునందలి గోపికల వలె, సూరదాసు గోపికలు, ఉద్ధవుని మాటలకుఁ దృప్తి పడక, ఉద్ధవుని వ్యంగ్యోక్తులతో నెత్తి పొడుచుచుఁ దమ విరహావేదనా తీవ్రతను బ్రకటింతురు. ఉద్ధవుఁడు ప్రతిపాదించిన నిర్గుణ భక్తి వాదము ఖండించి సగుణ భక్తిని — అందును కృష్ణ భక్తిని సమర్థింతురు.[1]

దీనిని బట్టి హిందీభాష యందలి 'సూర్‌సాగర్'భాగవత కథతో సంబంధించినదేయయ్యు, నది వేరొక మార్గమున నడచినదనుట స్పష్టము. పోతన, సూరదాసు—వీరిరువురి దృక్పథములు వేరు.

పోతన మూలానుగుణముగ, వ్యాఖ్యానముల ననుసరించి క్రమబద్ధముగ భాగవతము రచియించి యున్నాఁడు. కావున నందు కథలన్నింటికి సమాన ప్రాధాన్యము కలదు. కాని సూరదాసు లక్ష్యము, వల్లభాచార్య సంప్రదాయము ననుసరించి దశమస్కంధమున గల శ్రీకృష్ణలీలా వైభవమును పెంపొందించుటయే. కావున నందు దశమస్కంధమునకే ప్రాధాన్యము గలిగి, తక్కిన వానికి లేక పోయినది.

భక్తి భావనయందు నిరువురి పద్ధతులు వేరు. సూరదాసునిది మధుర భక్తి — పుష్టి మార్గము. పోతనది రామకృష్ణ భేదముగాని, శివకేశవ భేదము గాని లేని యద్వైత భక్తి. ఇక రచనా విధానమును బరిశీలించిన సూరదాసునిది ద్విపద కవిత్వము ; పోతనది పద్య కవిత్వము. భావనా పద్ధతులయందు తులసీదాసునకుఁ బోతనకు సామ్యము మెండు. ఇరువురి భక్తి పద్ధతులు సమానము. ఇష్టదైవము సమానము. కాని వస్తు సామ్యము లేదు. ఒకరిది రామాయణము — వేరొకరిది భాగవతము.

క్రీ.శ. 18 వ శతాబ్దిని "సదాసుఖ లాల్" అనునతఁడు భాగవతము నామూలాగ్రముగ హిందీలో గద్యానువాదము గావించెను. అతని సమకాలికుఁడు లల్లూజీలాల్ దశమస్కంధమొక్కటియే గద్యముగా రచించెను. కృష్ణ లీలలను గ్రహించి వ్రాసిన కృతులు హిందీలో చాల గలవు.[2]

---

[1] హిందీ సాహిత్యము — శ్రీ అయాచితుల హనుమచ్ఛాస్త్రిగారు. పుటలు 245—247.

[2] శ్రీ. సి. కామాక్షీరావుగారి వ్యాసము.

భక్తి సిద్ధాంతమునకు మూలమగు భాగవతమును వ్యాస మహర్షి రచనను టూకా తప్పక యనువదించి, వ్యాఖ్యాతృ భావము నవగతము చేసికొని, భాగవతార్థమును, భక్తి తత్త్వమును దేశభాషలో సమగ్రముగను సంపూర్ణముగను భారతీయుల కందఱ జేసిన పరమ గౌరవము బమ్మెర పోతనది, తెలుఁగువారిది

కేవలము భాగవతాంధ్రీకరణము మాత్రమేయనె గాక, భాగవత ప్రతిపాదితమైన శ్రీ కృష్ణ భక్తిని భారత వర్షమున చిరస్థాయిగనొనర్చిన కీర్తి పోతనదే. శ్రీ కృష్ణ భక్తి ప్రధానమైన మతము వంగ దేశమున, నుత్తర హిందూస్థానమున పోతన భాగవత రచనముఁదరువాతనే ప్రారంభమైనది ఆ ప్రదేశముల శ్రీ కృష్ణ భక్తి, భాగవతమున ప్రతిపాదితమైన భక్తికన్న భిన్నము అవి రెండు సంప్రదాయములు రెండును మధుర భక్తి సంబంధులె ఒకటి వంగ దేశమున చైతన్యుడు ప్రవర్తిల్లఁజేసిన రాధా వల్లభ మతము, రెండవది వల్లభాచార్యులు ప్రచారమునకుఁదెచ్చిన శుద్ధాద్వైతము, లేక పుష్టి మార్గ మతము. ఈ మత ప్రవక్తలిర్వురకు శృంగార రసాధినేత యగు శ్రీ కృష్ణ పరమాత్మయే యారాధ్యుఁడు భాగవతమున లేకున్నను, రాధా తత్త్వమును, రాధా దేవిని బ్రహ్మ కైవర్త పురాణాదులందుండి సంగ్రహించి యీ మత ప్రవక్త లిర్వురును నీ సంప్రదాయములు నెలకొల్పిరి కాని శ్రీ కృష్ణ చరిత్ర, శ్రీ కృష్ణుని లీలా విలాసములు సమగ్రముగా గల గ్రంథ మొక్క భాగవతమునందు దశమస్కంధమే కావున, నది వారికత్యంత ప్రామాణిక గ్రంథమైనది సంస్కృత మూలమున 90 యధ్యాయములలో 1600 గ్రంథ పరిమిత గల దశమస్కంధమును తెనుఁగున పోతన, పూర్వోత్తర భాగములతో 3100 గద్యపద్యములతో రచించెను అనఁగా తెలుఁగు భాగవతమున దశమస్కంధము మూఁడవ పాలన్న మాట పై యిర్వురిలో చైతన్యుడు 1485 నుండి 1533 వరకును, వల్లభాచార్యులు క్రీ శ 1479—1531 వరకును జీవించి యుండుట చేత వారిర్వురును పోతనకుఁదరువాతి వారు వారిలో చైతన్యుఁడు వంగదేశీయుఁడైనను ఆంధ్ర దేశమున పర్యటించిన వాఁడు [1] అతఁడు పోతన భాగవతము నెఱిఁగిన వాఁడు ఇక వల్లభాచార్యులు తెలుఁగు బ్రాహ్మణుఁడే వల్లభాచార్యులు పుష్టి మార్గమును స్థాపించిన వెనుక, తెలుఁగు వారు గుజరాతు రాజస్థాను ప్రాంతములలో 'తెలాంగులు' అను పేర నెలకొన్నారు వారు పోతన భాగవతమే నేటికిని పఠించుచురట ! ఉత్తర హిందూస్థానమున, వల్లభ మతము గోకుల బృందా వనము స్థానముగా నభివృద్ధి జెందిన పిమ్మట, హిందీ సాహిత్యమంతయు శ్రీకృష్ణ భక్తి సాహిత్యమైనది కావున భారతీయ సాహిత్యమునకు శ్రీ కృష్ణ భక్తిని, మధుర భక్తి సాహిత్యమును ప్రసాదించినది పోతనయే. ఇది భారతీయ సాహిత్యచరిత్రలో బహుధా ప్రశంసింప దగిన విషయము ఆంధ్ర కవుల యుత్కృష్టత కొక మహోజ్జ్వలమగు నుదాహరణము దీనినిబట్టి యేయే భాషలో భాగవతానువాదమునకు, పోతనవంటి సమర్థుఁడగు మహాకవి జన్మింప లేదని చెప్ప వలసి యున్నది

---

[1] మంగళగిరి క్షేత్రమున పానకాల నృసింహ స్వామి యాలయమున చైతన్య స్వామి పాదము లిప్పటికిగలవు

# పోతన - తులసీదాసు

దక్షిణ భారతమున నాంధ్ర దేశీయుఁడైన పోతనతో, నుత్తర హిందూస్థానమ్మున నార్యావర్తమున సరి పోల్చఁదగిన భక్తిమత ప్రసక్త మహాకవి తులసీదాసు. ఇరువురును శివ కేశవ భేదము పాటింపని వారు. ఇరువురును రామ భక్తులు. ఇరువురును సగుణ నిర్గుణ భక్తి తత్త్వమును ప్రపంచించినవారు. ఇరువురు కారణ జన్ములు. భక్తి సిద్ధాంతమునకు ప్రధానాధారమగు భాగవతమును పోతన యాంధ్రావళికందించి, 'తెలుఁగు శుకయోగి' కాగా, తులసీదాసు తులలేని వెలలేని రామాయణ కావ్యకథను 'రామ మానస చరితము' అను పేర నతిలోకోత్తరముగ నవధీ భాష యందు రచించి, 'వాల్మీకి' యవతారమయ్యెను.

రామాయణమునకు సాహిత్యమున ఆదిమ కావ్యమని ప్రసిద్ధిగలదు. అట్టి కావ్యము భక్తి రసముతో సమ్మేళనము చెందిన రచన గలదియైన, యది యైహికాముష్మిక సుఖసాధనమని సంసార తరణోపాయమని పోతనకభిప్రాయము గలిగి, రామాయణము నాంధ్రీకరించుటకు తలంపు గొని యుండును. కాని భాస్కరాదుల యాంధ్రీకరణముండుటచే మిన్నకుండెను. దాని యందు భక్తి గుణము లోపించుట చేతనే, 'భాస్కరుఁడు బదిరెను గాని రామాయణము బండ్లెక్కింపవా' అని యూతఁడు తన యాశయము వ్యక్తపరచెను. భక్తి రసోల్బణమున దాని నతి విస్తృతముగా నొనరించెదనని పోతన వాక్యమున కర్థము.

రామాయణమునకు పోతనదీక్షకనువు కాదగిన భక్తి గుణముతో గూడ 'రామ చరిత మానసమును' రచించి తులసీదాసు (1532—1623) హిందీ సాహిత్యమునకేగాక, భారతీయ వాఙ్మయ సౌధమునకు సువర్ణామృత కలశముగా నర్పించెను.

పోతన తులసీదాసు లిరువురు రామ కృష్ణ భక్తి సాహిత్యములకు భారత వర్షమున తీర్థభూతులు.

# 3. పోతన యవతరణ

## పోతన జన్మస్థలము — నివాసము

పోతన ఇంటి పేరు బమ్మెర వారు. ఈ బమ్మెర యనునది గ్రామ నామము. ఈ గ్రామము నేటి ఆంధ్రధరలో, తెలంగాణా ప్రాంతమున, ప్రసిద్ధ నగరమగు "ఓరుగల్లు"నకు ఇరువదియారు మైళ్ళ దూరమున నున్నది. దీనికి రెండు మైళ్ళ దూరములో ప్రసిద్ధ వీరశైవ కవి సార్వభౌముడగు పాల్కురికి సోమనాథుని జన్మస్థానము 'పాలకురికి' లేక 'పాల్కుర్తి' యున్నది. శైవ,వైష్ణవ భక్తితత్త్వములను ప్రపంచించిన సోమన, పోతనలను మహాభక్తకవుల యిరువురి కునికిపట్లయిన యీ పవిత్ర క్షేత్రములాంధ్ర దేశమున కొక ప్రత్యేక విశిష్టత గల తీర్థ స్థలములుగా పరిగణింపబడియున్నవి.

పోతన తన స్వగ్రామమగు బమ్మెర యందే నివసించుచుండి, భాగవత రచనకై 'ఏకశిలా నగరము' అను ఓరుగల్లునకు వచ్చినట్లుగా భాగవతావతారికయందిట్లు గలదు —

"మదీయ పూర్వ జన్మ సహస్ర సంచిత తపః ఫలంబున శ్రీ మన్నారాయణ కథా ప్రపంచ విరచనాకుతూహలుండనై, యొక్క రాకానిశా కాలంబున సోమోపరాగంబు రాకంగని సజ్జనానుమతంబున నభ్రంకష శుభ్ర సముత్తుంగ భంగ యగు గంగకుంజని క్రుంకులిడి వెడలి మహనీయ మంజుల పులిన తలంబున మహేశ్వర ధ్యానంబు సేయుచుంగించిదున్మీలితలోచనుండనై యున్న యెడ" శ్రీ రామభద్రుండు దర్శనమిచ్చి భాగవతము తెనుగు సేయుమని యాజ్ఞాపించెను. "ఇట్లు భాసిల్లెడు శ్రీ మహా భాగవత పురాణ పారిజాత పాదప సమాశ్రయంబునను, హరి కరుణా విశేషంబునను గృతకృత్యంబు సిద్ధించెనని బుద్ధి నెఱింగి లేచి మరలి కొన్ని దినములకు **ఏకశిలానగరంబునకు** జనుదెంచి," యందు భాగవతము నాంధ్రీకరించెను.

పై యుదాహృతులని బట్టి పోతనభాగవతరచనము ఓరుగల్లు, లేక ఏకశిలానగరమునందే జరిగినట్లు స్పష్టము. ఓరుగల్లునకు ఏకశిలానగరమను పేరున్నట్లుగా పోతన సమకాలికులలో నొక్కడైన కొరవి గోపరాజు తన సింహాసన ద్వాత్రింశిక యందిట్లు స్పష్టపఱచియున్నాడు.

ఉ. ఆకడ నీతిశాస్త్రవిదుఁడై గురువీడ్కొని యేగె వేడ్కతో
నాకలి మూలశక్తి గనిగా నొనరించిన పైఁడి చట్టునా
నేకశిలాభిధానమున నెన్నిక కెక్కి ధరిత్రిలోననే
పోకలబోని యట్టి సిరి పుట్టిన యింటికి నోరుగంటికిన్

మరియు నా కవియే "కాకతి భూపాల రాజ్య లక్ష్మి పెంపొందెడు నప్పురంబు" అని చెప్పుట చేత, కాకతీయుల రాజధానియై నేటి తెలంగాణాయందున్న "ఒరంగల్లే" యని యవివాదములేని సిద్ధాంతముగా చెప్పవచ్చును.

పోతన తాను "గంగకు" వెడలినట్లు పైన వ్రాసియున్నాఁడు. ఈ గంగ, యుత్తర హిందూ స్థానమందలి గంగ కాదు. ఇది దక్షిణ గంగ — గోదావరి నది. "దక్షిణ గంగనాఁదద్దయు నొప్పిన గోదావరియను నగరాజి యొప్పైన" అని భారతమున భట్టారకుని వచనములో నున్నది. ఈ గోదావరికి గంగయని పేరుండెడిదనియు, నది త్ర్యంబకోద్భూతయనియు పై గోపరాజే యిట్లు వ్రాసి యున్నాఁడు —

క. ఆతఁడు త్ర్యంబకశిఖరో
ద్భూతను, విఖ్యాత, సకలపుణ్యద్రిలోకీ
మాత మహాపాతక సం
ఘాత వినాశామయాత గంగం గనియెన్.

త్ర్యంబక శిఖరోద్భూత యనగా నాసికాత్ర్యంబకమని యర్థము. ఇది గోదావరి పుట్టుక స్థానముగదా. కాగా, పోతన భాగవతమునచెప్పిన యేకశిలా నగరము, గంగ—రెండును తెలంగాణా ప్రాంతములోనివే గాని ఆంధ్ర దేశమున వేరొక ప్రాంతములోనివి కావు.

ఇక పోతన గోదావరి నదీ తీరమున నేస్థలమున ధ్యాన సమాధి నిష్ఠుఁడై యుండెనో, దానిఁ గూడ గనుగొనుటకు ప్రయత్నింతము. పోతన ఒరంగలునుండి తిన్నగా గంగకు వెడలుట చేత నది తప్పక నేటి భద్రాచల క్షేత్ర ప్రదేశమై యుండునని నా యూహ. అచ్చటనే గదా పోతనకు శ్రీరామ భద్రుఁడు ప్రత్యక్షమగుట! శ్రీ రామభక్తుఁడగు పోతన, రామాజ్ఞ ననుసరించి భాగవతము వ్రాయుటకు 'ఓరుగంటికి వచ్చెను' కాని పోతన ధ్యాన నిష్ఠనున్న స్థల మహిమ చూడుఁడు. పోతన వెనుక మరి రెండు శతాబ్దులకు, రామ భక్తాగ్రేసరుఁడైన కంచెర్ల గోపన్న(భద్రాచలరామదాసు) శ్రీ రామాలయము నచ్చట గట్టించెను. గోపన్న యాలయము గట్టుట కా ప్రత్యేక స్థలమే యేల నిర్దిష్టము గావలెను? అది పోతనకు రామభద్రుఁడు ప్రత్యక్షమైన చోటు! అది రామభద్రుని సంకల్పము. ఆంధ్రుల పూర్వపుణ్య పరిపాకము.

పోతన వ్యవసాయ వృత్తిచే జీవించినట్లుగా నాతఁడే స్పష్టముగాఁజెప్పుకొని యున్నాఁడు. కావున నేకశిలా నగరమునఁ గొంత కాలముండి యా వెనుక తన స్వగ్రామమగు బమ్మెరకు వచ్చి యుండెననియు, తన జీవితాంత మచ్చటనే గడపెననియు తలఁచుట సమంజసము. పరమ భక్తాగ్రేసరుఁడై వైరాగ్యపు వృత్తి గల పోతన పల్లెల యందు గల ప్రశాంత జీవనము నాశించును గాని, పట్టణ సౌఖ్యముల నాశించునా ?

పోతన వెనుక నాతని వంశీయులు బమ్మెర యందే నివసించుచున్నట్లును, పోతన నివాస చిహ్నము లీనాటికి నున్నట్లును క్రీ.శ. 1926 నాటి భాగవత ముద్రణ పీఠికయందీరీతిని వ్రాయబడినది.[1]

"ఓరుగల్లు చెంత బమ్మెర యను గ్రామము కలదు. ఆ గ్రామమందు కౌండిన్య గోత్రులగు నియోగుల కుటుంబమొకటి గలదు. వారు పోతనామాత్యుడు తమ వంశీయుడని చెప్పుచున్నారు. ఈ బమ్మెరలో "పోతరాజు" గడ్డయని నాలుగు రాళ్ల పాతిన యొక స్థలము గలదు. అది ప్రకృతము జీర్ణమై నామమాత్రావశిష్టముగా నున్న యొక రామాలయమున కెదురుగ గలదు. దానికి ముందుగ త్రోవ కడ్డముగ నొక శిల పడియున్నది. దానినే యచటి వారు బమ్మెర పోతరాజని వ్యవహరించుచున్నారు. నేటికి బమ్మెరలోనున్న కౌండిన్య గోత్రులా శిలను శుభావసరములలో బూజించుచు నది పోతన రూప విగ్రహమనియు, బోతరాజు గ్రామములోని భూములను దున్నెననియు చెప్పుచున్నారు. ఇవి యన్నియు సత్యేతరములనుటకంత సాహసముండదు. (పుట 54)"

పై యుదాహృతి పోతన నివాసము బమ్మెర యని నిర్వివాదముగా నిరూపించుచున్నది. మరియు భాగవతమున కొన్ని స్కంధములను పూరించిన కవులు బమ్మెర చుట్టుపట్లనున్న యూళ్లవారు. షష్ఠస్కంధము పూరించిన సింగన ఏర్పూరు నివాసి. ఏకాదశ ద్వాదశస్కంధ రచయిత నారయ వెలిగందల నివాసి. ఈ రెండును బమ్మెరకు దగ్గరి గ్రామములే! బమ్మెర పోతన పాదరజస్స్పర్శచే పవిత్రమైన క్షేత్రములే!

పోతన కడప మండలములోని "ఒంటి మెట్ట" గ్రామ నివాసి యని నలువదేండ్ల క్రిందట నొక వాదము పొడ సూపి నానా ముఖముల బ్రాకినది. సకలాంధ్ర మహాజనుల జిహ్వా రంగములయందు సంతతము నాట్యమాడుచున్న పోతనను "ఒరంగల్ వాడా? ఒంటిమెట్టవాడా?" అను సామాన్య చర్చలో నిముడ్చుటకు విమర్శకులు ప్రయత్నించిరి. ఈ చర్చవలన కాలము, కలము చాల వరకు వ్యర్థములైనవి. ఒక్కటి మాత్రము సార్థకమైనది. ఒంటిమెట్ట వాదులలో నుత్తమోత్తములును, మహా భక్తులును నగు 'వాసుదాసు' (వావిలికొలను సుబ్బారావుగారు) సేవా విశేషముచే, ఒంటిమెట్ట కోదండ రామాలయము జీర్ణావస్థనుండి యుద్ధరితమై, జీవ కళలతో విరాజిల్లుచున్నది.

## కాల నిర్ణయము

పోతన తాను రచించిన కృతులలో కడపటిది యగు భాగవతమున, తెలుగు కవులలో నన్నయ తిక్కనల నిరువురిని మాత్రమే పేర్కొనెను. కాని భారత కవిత్రయములో తృతీయుడగు నెఱ్ఱాప్రెగడ రచనల ననుకరించుట చేత, పోతన క్రీ.శ. 1350 కి తరువాతి వాడని చెప్పనగును.

---

1 పీఠికాకారులు — శతావధానులు శేషాద్రి రమణ కవులు.

శ్రీరామ భక్తుడగు పోతన భాస్కర రామాయణము నెఱిగి యున్నట్లుగా, నందలి యను సరణములే గాక, "భాస్కరుడు బదరెను గాని రామాయణమును ఎండ్లెక్కించవనా" అను పోతన ప్రతిజ్ఞ యుఁదెలుపుచున్నవి భాస్కర రామాయణము క్రీ శ 1370 ప్రాంతములం బూర్తియైనది కావున పోతన క్రీ శ 1400 ప్రాంతముల కీవలివాఁడని చెప్పనగును ఈ కాల ఏూలని జనన కాలమని యూహింపఁదగును

పోతన, శ్రీనాథ కవిసార్వభౌముని సమకాలీనుఁడని యైతిహ్యముల మూలముననే గాక, శ్రీనాథ మహా కవి సందర్శించిన రాచకొండ సంస్థానాధీశుఁడగు సర్వజ్ఞ సింగ భూపాలుని కాలము వలన గూడ దృఢపడుచున్నది పోతన భోగినీ దండకము నీసర్వజ్ఞ సింగభూపతికిఁగృతి నిచ్చెను ఈతఁడు క్రీ శ 1435 ప్రాంతమువాఁడు కావున పోతన క్రీ శ 1450 ప్రాంతముల జీవించి యుండుట సహేతుకమై యున్నది పోతన, తన ప్రాథమిక కృతి యగు వీరభద్ర విజయమున 'శృంగార కవినాథు'డని శ్రీనాథుని పేర్కొనుట చేత, వీరిరువురి సమకాలీనత్వము నిర్వివాదమైనదని చెప్పనొప్పును

భాగవతమున షష్ఠస్కంధమును, నేకాదశ ద్వాదశ స్కంధములు ప్రత్యేకముగ రచించిన హరి భట్టు క్రీ శ 1510 ప్రాంతమువాఁడు కాని హరిభట్టుకన్నను కొంచెము ముందుగా షష్ఠస్కంధమును, శృంగార షష్ఠమను పేర తెలుఁగు చేసిన వారు, నంది మల్లయ ఘంట సింగయ కవులు వీరిరువురు క్రీ శ 1480 ప్రాంతముల విజయనగర రాజ్యముఁ బరిపాలించిన సాళ్వనర సింగరాయని సేనాని యగు తుళువ నరసరాయని యాస్థాన కవులు కాబట్టి పోతన భాగవత రచనము క్రీ శ 1480 ప్రాంతములకు ముందే పూర్తియై యుండవలెను గదా! ఇఁక భాగవత రచన సంపూర్తియైన కాలముగూడ మనము సూక్ష్మముగ నిర్ణయింపవచ్చును

శ్రీనాథునికి పోతనకు సంబంధించిన కథలలో గజేంద్ర మోక్షములోని 'సిరికిం జెప్పడు" అన్న పద్యము ప్రసక్తమైనది అది భాగవతము అష్టమ స్కంధములో నున్నది అనఁగా క్రీ శ 1440 ప్రాంతములలో పోతన అష్టమ స్కంధము గూడ రచించెనని మనమూహింపవచ్చును ఏలననఁగా శ్రీనాథుని చరమ కాలము క్రీ శ 1450 ప్రాంతమని చారిత్రక విమర్శకుల నిర్ణయము భాగవత రచన క్రీ శ 1460—70 ప్రాంతములలో పూర్తియైనట్లు మనము నిర్ణయింపవచ్చును

క్రీ శ 1500 ప్రాంతమునకుఁ గొంచెము ముందుగా, లాక్షణికుఁడని ప్రసిద్ధి వడసిన వెల్లంకి తాతంభట్టు, తన కవి చింతామణియందు, ఛందో దర్పణమున పోతన నారాయణ శతకమును, భోగినీ దండకమును నుదాహరించి యున్నాఁడు తాతంభట్టు తన గ్రంథమున నుదహరించిన కవులలో క్రీ శ 1480 ప్రాంతముల సాళ్వ నరసింగరాయనికిఁ గృతి నిచ్చిన పిల్లలమఱ్ఱి పినవీరన కడపటి వాఁడు ఈ విషయము పోతన క్రీ శ 1480 కి ముందువాఁడని స్పష్టము చేయుచున్నది

గ్రంథస్థమైన ప్రమాణములను బట్టి పోతన క్రీ.శ. 1400—1470 ప్రాంతము వాఁడని నిర్ణయింప నగును.

## వంశాదికము

పోతన తన గద్య యందు "సహజ పాండిత్య పోతనామాత్య" అని వ్రాసికొని యుండుటచేత, నాతఁడు తెలుఁగు దేశమున మంత్రులు, మహా కవులు, మహా వీరులు జన్మించిన నియోగి శాఖకుఁ జెందినవాఁడు. ఈ వంశీయులాప స్తంబ సూత్రులు. కౌండిన్యసగోత్రులు. తన ప్రాథమిక కృతి యగు వీరభద్ర విజయమున వంశమును గూర్చిన వివరముల నాతఁడొసగి యున్నాఁడు. దాని నుండి యీ క్రింది వంశ వృక్షము నేర్పరుప వచ్చును.




పై వంశ వృక్షమునే సంగ్రహించి భాగవతములో నవతారికయందు (1—24) నొక సీస పద్యములోఁ జెప్పియున్నాఁడు.

పోతన తన తల్లి దండ్రులగు లక్కమ కేసనలను గూర్చి, తన యన్న తిప్పనగూర్చి పై రెండు గ్రంథములయందును వివరించి యున్నాఁడు. వానిలో నీ క్రింది విషయము ముఖ్యమైనది.

పోతన తండ్రి కేసన వీరభద్ర విజయమున (1—34) "శివతత్త్వసారథి కౌతుకోన్నతుఁడు" గా వర్ణితుఁడు మరియు భాగవతమున నాతఁడు "శైవ శాస్త్ర మతము గనియె" యని చెప్పఁబడియున్నది శైవ శాస్త్ర మతమనఁగా వీర శైవములో సవైదికమగు నారాధ్యసంప్రదాయము ఇది పోతనకు మూఁడు వందల యేండ్లకు ముందు మల్లికార్జున పండితారాధ్యులు తెలుఁగు దేశమున ప్రవర్తిల్లఁ జేసిరి వారి శిష్య పరంపరలో ఇవటూరి వారు చాల ప్రసిద్ధులు పోతన తండ్రి కాలము నాటి కావంశీయులలో ఇవటూరి సోమనాధయ్యగారను వ్యవహార నామముగల సోమశేఖరులను నొక యారాధ్య గురువర్యులుండిరి [1] వారే పోతనకుఁగూడ గురువులు. పోతన వీరభద్ర విజయము నీగురువు యొక్క ప్రేరణ చేతనే రచించెను తన తల్లిదండ్రులు 'శంకర పాదయుగాంభోజ పారీణు'లని ప్రత్యేకముగా పేర్కొని యుండుటచే బాల్యమునుండి పోతన వీరశైవాచార, లేక మాహేశ్వరాచార నిరతుఁడని మనము నిర్ణయింప వచ్చును

"నమాతుః పరదైవతం" (తల్లికన్న వేరు దైవంబు లేదు) అను సూక్తిని ప్రత్యక్షరము పోతన పాటించినాఁడు వీరభద్ర విజయ, భాగవతములలో నామె గుణగణము లిట్లు వర్ణితములైనవి

ఉ. పావని గంగ, భోగ శచి, భాగ్యపు గౌరి, గభీర భూమి, సం
భావన కుంతి, రూపగుణ భారతి, సంపద లక్ష్మి, దేవి సం
సేవిత సంజ్ఞ, నిశ్చల విశేష యరుంధతి యైన లక్ష్మి దాఁ
గేవల కన్యయే తలఁప గీర్తన సేయఁదగున్ ధరాస్థలిన్

వీరభద్ర విజయము (1—37)

క. గడవదు నిలయము వెలువడి
తడవదు పరపురుషు గుణముఁ దన పతినుడువుం
గడవదు వితరణ కరుణలు
విడువదు లక్కాంబ విబుధ వినరము వొగడన్
(లక్ష్మి శబ్ద భవము—లక్కమ)

[1] ఈ యివటూరి సోమ శేఖరులే వేమనకుఁ గూడ గురువు
వేమన తన పద్యములో గురువులనిట్లు పేర్కొనినాఁడు —

క. "భవదూరుఁడు శరభాంకుఁడు
శివశీలుఁడు వేయు గోటి సిద్ధేశ్వరుఁడున్
శివతత్త్వుఁడు, వటమూలుఁడు
శివమయ చిన్మయుఁడు సోమశేఖర గురుఁడున్"

ఉ. మానిను లీడుగారు బహుమాన నివారితదీనమానస
గ్లానికి, దాన ధర్మమతి గౌరవ మంజులతాగభీరతా
స్థానికి, ముద్దసానికి సదాశివ పాదయుగార్చనానుకం
పానయ వాగ్భవానికిని బమ్మెర కేసన లక్కసానికిన్.

భాగవతము (1—25, 26)

పై పద్యమున లక్కసాని యను చోట సాని పదము నేటివలె నీచార్థ బోధకముగాదు. 'సాని' శబ్దము 'స్వామిని' శబ్దభవము.

పోతన తన యన్న యగు తిప్పనను వీరభద్ర విజయమున నొక పద్యముచే బేర్కొన్నాఁడు —

శా. సారాచారుఁడు కాంతి వైభవ గతిన సంపూర్ణ చంద్రుండు, భూ
దారాహీంద్ర సమానదక్షుఁడు సదా ధర్మాకరుండర్థిమం
దారుండంచిత రూప రేఖలను కందర్పుండు భూయిష్ఠాయత
శ్రీరమ్యుండగు తిప్పనార్యుఁడు జనించెన్ వంశ వర్ధిష్ణుఁడై.

(1—34)

భాగవతమున 'నీశ్వరసేవాకాముఁడు' అని యీతఁడు వర్ణితుఁడైనాఁడు.

## బా ల్య ద శ

వీరభద్ర విజయమున తన విద్యా శిక్షణను గూర్చి పోతన యిట్లు చెప్పియున్నాఁడు —

"ఏను జన్మించి పోతన నామధేయుండనై పరఁగి జనక శిక్షిత విహితాక్షరాభ్యాసుండనై వీరభద్ర ప్రసాదలబ్ధ కవితాతిశయంబున . . . . మత్సమర్పితంబగు వీరభద్ర విజయాంచిత కథా ప్రారంభ ప్రసంగంబెట్టిదనిన"

(1—40, 45)

పై దానిని బట్టి పోతన తండ్రికడనే యక్షరాభ్యాసాదికము గావించి విద్య నేర్చెనని, కవిత్వము బాల్యముననే వీరభద్రుని కృపచేత లభించినదని స్పష్టమగుచున్నది.

ఇంకను నా గ్రంథమందే, తన గురువగు నివటూరి సోమశేఖరారాధ్యులును నిట్లుచెప్పిరని కలదు —

ఆ.వె. పిన్నవాఁడవనియుఁ బెక్కు సత్కృతులను
వినని వాఁడవనియు వెరపు మాను

మత్ప్రసాద దివ్య మహిమచే నెంతైన
కవిత చెప్పు లావు గలదు నీకు (1—21)
అదియునుం గాక నీకు వీరభద్రేశ్వర ప్రసాదంబు గలదు''

గురువగు సోమశేఖరుఁడే, యిట్లు పోతన చాల చిన్నవాఁడనియు, గ్రంథావలోకన మేమాత్రమును చేయలేదనియుఁజెప్పి, తన ప్రసాద మహిమచే నాతనికి కవిత చెప్ప శక్తి యలవడునని యాశీర్వదించుటవలన, పోతన 'చిన్నారి, పొన్నారి చిఱుత కూఁకటి నాఁడు' గాని యంతకు కొంచెము వెనుక గాని వీరభద్ర విజయము రచించెనని మనమూహింప వచ్చును దీనిని బట్టి బాల్యమునుండి పోతన భక్తిపరుఁడనియు, నాతనికి కవిత పూర్వ జన్మ సుకృతమువలన నప్రయత్నముగా, పుట్టుకతోడనే వచ్చినదనియు, నీశ్వర ప్రసాదము, గురుకరుణ వీనిచే దోహదమై, పెంపొందినదనియు నిస్సందేహముగాఁజెప్పవచ్చును

పోతనకు 'సహజ పాండిత్య' అను బిరుదమున్నట్లుగ భాగవత గద్యమూలమునఁ దెలియుచున్నది ఇదియును, నీశ్వరుని కరుణ వలన గలిగినదని యందే చెప్పియున్నాఁడు ''ఇది పరమేశ్వర కరుణా కలిత కవితావిచిత్ర కేసన మంత్రి పుత్ర, సహజ పాండిత్య, పోతనామాత్య ప్రణీతంబైన భాగవతంబు'' మరియు భాగవత మహాగ్రంథము తానై పలికియు దానిని పలికించిన విభుఁడు రామభద్రుఁడని యీ క్రింది పద్యమున స్పష్టముగాఁదెలిపియున్నాఁడు

క. పలికెడిది భాగవతమఁట!
పలికించు విభుండు రామభద్రుండఁట! నేఁ
బలికిన భవహర మగునఁట!
పలికెద వేఱొండు గాథ పలుకఁగ నేలా!

(1—18)

''సర్వం విష్ణుమయం జగత్'' అను వాక్య భావము సంపూర్ణాకృతిని దాల్చినది పోతన స్వరూపము. అది యాపాద మస్తకము భక్తి రసప్రపూర్ణము అయినను నాతఁడు భగవద్భక్తిని వ్యాప్తము చేయుటకు, గురువుల నాశ్రయింపక, స్వయముగాఁ గష్టించి గ్రంథములు చదివి, వేద వేదాంత పురాణేతిహాస కావ్యనాటకాలంకారాది సమస్త సాహితీ జ్ఞానమును, పాండిత్యమును భగవత్కృపచేఁ బడసెననుట నిశ్చయము మరియు తెలుఁగు భాషలో తనకు ముందు వెలసిన ''కవిత్రయము'' అనఁగా నన్నయ తిక్కన ఎఱ్ఱనల రచితమైన భారతమును, ఎఱ్ఱన నాచన సోమనల హరివంశోత్తర హరివంశ కృతులను, భాస్కర రామాయణమును తలస్పర్శముగాఁ జదివి, యాంధ్ర కవితా సంప్రదాయమున జ్ఞానము సంపాదించినట్లు భాగవత రచనమే సాక్ష్యమిచ్చుచున్నది తక్కిన ప్రాచీన కవుల కంటె పోతనయందొక విశేషమున్నది ఆతఁడు ప్రప్రథమమున వీరశైవాచార నిరతుఁ

డని తెలిపి యుంటిని. కాబట్టి పోతనకు వీరశైవ వాఙ్మయ సృష్టికర్తయగు పాల్కురికి సోమనాథుని రచనలను చదువ నవకాశము లభించినది. కేవలము మత దృష్టి చేతనే గాక బసవ పురాణ, పండితారాధ్య చరిత్రల యందలి, లోకోత్తరమైన కావ్యకళా విశిష్టత చేతను, సోమన గ్రంథములు పోతననాకర్షించినవి. అందు ముఖ్యముగా సోమన గ్రంథముల యందలి యనుప్రాస విన్యాసమును, జాను తెనుగు శైలి పోతన భాగవత రచనా సంప్రదాయ సిద్ధికి నాలంబనములైనవి. తెలుగు వారికి తొలి విజ్ఞాన సర్వస్వమై, పాండిత్య శౌండీర్యమునకు పరమావధియైన పండితారాధ్య చరిత్రమును పారాయణము చేసిన పోతన సహజ పాండిత్యుడగుటలో చిత్రమేమున్నది?

ఇంతకు భక్తి యోగ పరినిష్ఠితుల కసాధ్యమైన కార్యమేమి గలదు? అది శివ భక్తి కానిండు, విష్ణు భక్తి కానిండు, ఏదియైన సాధ్యమే! అందును, శివ భక్తి యోగమును, విష్ణు భక్తి యోగమును సంపుటీకరించి, భాగవత రచనా సమాధి స్థితిని సంపూర్ణముగ నందిన పోతనకు సమస్త విజ్ఞానమును కరతలామలకమగుటలో నాశ్చర్యమేమున్నది? ఆధ్యాత్మిక తత్త్వప్రవణమగు భారతీయ కవితా సంప్రదాయముననుసరించియే యున్నది.

## దేశకాల మత పరిస్థితులు.

పోతన భాగవతము విష్ణు భక్తి భరితమని యందరెఱింగినది. ఆతడు శైవుడనియు నంద ఱకు దెలిసినదియే. ఆతడు శైవకృతిని రచించుటయు ప్రసిద్ధమె. ఆ మహనీయుడు వీరమాహేశ్వరాచారము ననుసరించి విష్ణు భక్తి ప్రతిపాదించి, యద్వైతసిద్ధి నందుట మాత్రమిదానింత నాంధ్ర సాహితీ విమర్శకులకు క్లిష్ట సమస్యగా బరిణమించినది. ముఖ్యముగా వీరశైవ మత సంప్రదాయములను గూర్చియు ప్రాచీనాంధ్ర సాహితీ క్రమ పరిణామమును గూర్చియు, నిశ్చితాభిప్రాయములు గలుగక పోవుటచేత నీ సందర్భమున కొంత వివరణ మావశ్యక మగుచున్నది.

నేటి సాహితీ లోకమున వీరశైవ మతమును గూర్చియు, నా వాఙ్మయమునకు సంబంధించిన శివకవులు అను వారి గ్రంథములను గూర్చియు వ్రాసినవిమర్శనములను పరిశీలించిన నందుముఖ్యముగ నొకటి ప్రతి పుటయందు ప్రత్యక్షమగుచున్నది. అది

"వీర శైవులకు విష్ణుద్వేషము విహితము, వైష్ణవ మత నిరసనము ప్రధానము" అనునది.

ఈ అభిప్రాయమును కేవలము సాహితీ విమర్శనయందు పేరెక్కిన కతిపయ సాహిత్యులు ప్రచారము చేయుటచేత నపరిశీలితముగ, నంధపరంపరాన్యాయమున, వారి ననుసరించి మరి కొందరు వాఙ్మయ విమర్శనముల దానిని ప్రవేశ పెట్టుచున్నారు. కాని యిట్టి వ్రాతలు వీరశైవ మత సంప్రదాయమునకు మూలభూతములగు గ్రంథములను చక్కగా చదివి యవగాహనము చేసికొని యర్థము గ్రహించి వ్రాసినవి కావని యీ క్రింది విషయములను బట్టి నిరూపింపవచ్చును

వీరశైవులు విష్ణుపారమ్యము నంగీకరింపరే గాని విష్ణువు నెంత మాత్రమును ద్వేషింపరు. పైగా వారు విష్ణువును వీరశైవాగ్రగణ్యునిగాఁ బరిగణింతురు. వీర శైవులకు విహితమైన దీక్షా విధానములో వ్రతపూజా సమయమున నొనర్చు దేవతాహ్వానములలో విష్ణువు నాహ్వానించుట గలదు.

"శ్లో. దుర్వాస కశ్యప విరించి మృకండుపుత్ర
దేవేంద్ర బాణ హరి కృష్ణదధీచి రామ
శ్రీ వామదేవ కవి కుంభజ గౌతమాదీన్
పుణ్యానిమాన్ పరమ పాటవతాన్ స్మరామి" [1]

మరియు విష్ణువు శివభక్తులలో ప్రధానుఁడు. విష్ణువు ప్రతి నిత్యము వేయి కమలములచే శివు నర్చించుచు, నొకనాఁడొక కమలము తక్కువయ్యెన తత్క్షణము తన నేత్ర కమలము నర్పించి యా సంఖ్య పూర్తి చేసి, పూజ నెరవేర్చెను. శివుఁడందులకు మెచ్చి యాతనికి చక్రము నిచ్చెను. నాటి నుండియే విష్ణువు కమలాక్షుఁడయ్యెనని శివ పురాణములు ఘోషించుచున్నవి.

శివపూజ యందు వీరశైవులొనర్చు నీ ప్రార్థన శ్లోకమున శ్రీ హరియగు విష్ణువే గాక, యాతని యవతార మూర్తులగు శ్రీరామ కృష్ణులును స్మరింపఁబడుచున్నారు.

వీర శైవులు విష్ణు ద్వేషులు కారనుటకింత కంటె ప్రమాణములక్కర లేదు. అయినను నిది పూజా ప్రక్రియలోనే యున్నది గాని సాహిత్యమున నున్నదా యని కొందరకు సందేహము కలుగ వచ్చును. వారి సందేహనివృత్తికై వీరశైవ వాఙ్మయమునుండి ప్రమాణములను జూపుచున్నాము.

ఆరాధ్య సంప్రదాయ ప్రవక్తలగు మల్లికార్జున పండితారాధ్యుల శివతత్త్వసారమున,

"విష్ణువరేణ్యా! గోవింద ప్రియభావుక" అని శివ సంబోధనలు గలవు.

శివ పారమ్యవాదియు, శివకవియునగు నన్నెచోడమహాకవి కుమారసంభవమున విష్ణు నేత్రార్చన కథను సూచించునొక పద్యమును, (హరి వికచామలాంబుజ సహస్రము బూన్చి (1—3) విష్ణువు పరమేశ్వరుని వామాంగమునందు జన్మించెనని మరియొక పద్యమును జెప్పి విష్ణుఁగమలాధి ధివు సంస్తుతిఁ దేల్చినాఁడు.

శివ కవులందరకన్న మూర్తీభవించిన వీరశైవము గదా, పాల్కురికి సోమనాథుఁడు! ఆతఁడే బసవ పురాణమున తన తలిదండ్రులు — విష్ణు రామదేవుఁడు, శ్రియాదేవి యని చెప్పియున్నాఁడు.

[1] ఈ శ్లోకము వీరశైవ దీక్షా విధానము నిర్వచించు 'చిన్మయ దీక్ష' అను గ్రంథమున నున్నది.

ద్వి॥ భ్రాజిష్ణువగు విష్ణురామదేవుండు
తేజిష్ణువగు శ్రియాదేవి యమ్మయును
గారవింపఁగ నొప్పు గాదిలి సుతుఁడ

పండితారాధ్య చరిత్రలో

ద్వి॥ మును బసవ పురాణమున నెన్నఁబడిన
పెనుపారు భక్తుల పెంపుడు కొడుక''

అని పై విషయమును స్థిరీకరించి యున్నాఁడు —

విష్ణుద్వేషమే విహితమైన శైవుఁడే యైన యెడల, ఆ మత ప్రచారము నొనరించిన వారిలో ప్రథమ గణ్యుఁడగు పాల్కురికి సోమనాథుఁడే యిట్లు చెప్పు కొనునా? వీరశైవుల కెంత మాత్రము విష్ణుద్వేషము లేదని సారాంశము

బసవ పురాణమున వర్ణితులైన శివ భక్తులలో, సిద్ధరామయ్య, ఏకాంత రామయ్య అను విష్ణు నామాంకితులు గలరు రామ లింగేశ్వరుఁడు నందు గలఁడు ఇది గాక యథావాక్కుల అన్నమయ్య యను శైవ కవి విష్ణు భక్త ప్రశస్తిని తన సర్వేశ్వర శతకమున వర్ణించియే యున్నాఁడు ఇట్లు వీరశైవ మత ప్రవర్తకుల గ్రంథముల యందే విష్ణుద్వేషము లేదని స్పష్టముగా తెలియుచుండుట చేత , విష్ణుద్వేషము వీర శైవులకు విహితమను మాట విధ్వస్తమైనది గదా! పోతనమహాకవి పైని వివరించిన తత్త్వముగల శైవుఁడుగావుననే వీరభద్ర విజయమను కేవల వీరశైవ గ్రంథము రచించి, నారాయణ శతకమును వ్రాసి, తుదకు విష్ణు భక్తికి మూలకందమని చెప్పదగిన మహా భాగవతమును ప్రారంభించుచు —

చేతులారంగ శివుని పూజింపఁడేని
నోరు నొవ్వంగ హరికీర్తినుడువఁడేని
దయయు సత్యంబు లోనుగాఁదలఁపఁడేని
కలుగనేటికి తల్లుల కడుపు చేటు''[1] (1—14)

అని తన భక్తి పథమును ప్రకటించి యున్నాఁడు

[1] ''చేతులారంగ శివ పూజ సేయఁడేని'' అను నాకుఁ గఁరస్థమైన పాఠము పూర్వ ముద్రణములందిట్లే గలదు ఇది యెప్పుడు మారినదో? కలయో? వైష్ణవ మాయయో? ఇతర సంకల్పార్థమో ?

సాహిత్యమున శైవ వైష్ణవ మత భేదములు నిరూపించునపుడు నేటివిమర్శకులకు వైష్ణవ మనఁగా శ్రీ రామానుజులు ప్రతిపాదించిన విశిష్టాద్వైతమతమని యొక యభిప్రాయము గలదు. కాని యది యెంత మాత్రము సమంజసము కాదు; సహేతుకమును కాదు. చారిత్రక విరుద్ధముకూడ. విశిష్టాద్వైత మతము ప్రతిపాదించిన రామానుజాచార్యులు క్రీ.శ. 1017 నుండి 1137 వరకు జీవించెను. కావున వారు క్రీ.శ.1050 ప్రాంతముల విలసిల్లిన నన్నయభట్టారకుని సమకాలీనులు. మరియు వారి మత ప్రచారము, తమిళ దేశమున, తమిళ భాషలో జరిగినది. కాబట్టి నన్నయ కాలమునకు గొంచెము తరువాతనైన నది తెలుఁగు దేశమున వ్యాపించుట కవకాశము లేక పోయినది. ఇక నన్నయ వెనుక వాఙ్మయమున నవతరించినది శివకవి యుగము. బసవేశ్వరుఁడు ప్రవర్తిల్లఁజేసిన వీరశైవ జంగమ సంప్రదాయమును, పండితారాధ్యుఁడు ప్రవర్తిలఁజేసిన సవైదికారాధ్య వీర శైవ సంప్రదాయమును, పాల్కురికి సోమనాథుని రచనల వలన కర్ణాటాంధ్ర దేశములందెల్ల వ్యాపించినవి. అన్యమత ధర్మ సంప్రదాయబద్ధమై సంస్కృతానువాదమగు భారత రచన కొన సాగుటకు నావకాశములేక పోయినది. శివ కవులు భాషలో, భావములలో, రచనలలో దేశి సంప్రదాయములు పాటించి, సమకాలీనులగు భక్తులను లోకోత్తరులుగా నొనర్చి, వీర శైవ మతమును దేశభాషయే యాలంబనముగా ప్రచారము చేయుట చేత,రెండు శతాబ్దుల వరకు, అనఁగా 13 వ శతాబ్ది వరకు తెలుఁగు వాఙ్మయ స్వరూపమంతయు వీరశైవమే యైనది. భారత కృతిపతి యగు తూర్పుచాళుక్యరాజు పార్వతీపతి పదాబ్జాసక్తుడు. తరువాత నేలిన రాజులు, కాకతీయులు, వారి వెనుక వచ్చిన రెడ్డిరాజులు శైవులు, అందు చేత శైవ మతమే తెలుఁగు దేశమున వర్ధిల్లినది.

రామానుజసిద్ధాంతమును తెలుఁగుదేశమునకుఁదెచ్చిన మహనీయుఁడు కృష్ణమాచార్యుఁడు. ఈతఁడు సింహాచల క్షేత్రవాసి. కాకతీయులలో కడపటివాఁడైన ద్వితీయ ప్రతాపరుద్రుని కాలమునందు విలసిల్లిన వాఁడు. ఈతఁడు శఠగోపమౌని ద్రవిడ వేదమును వచన సంకీర్తన రూపమున ప్రవర్తిల్లఁజేసి విశిష్టాద్వైతమత సిద్ధాంతమునకుఁ బ్రథమ ప్రవర్తకుఁడయ్యెను. కాని యాతఁడోరుగంటియందొక్క స్థలమున మహిమలనేఁ జూపెను గాని మత ప్రచారము చేయలేదు. ఆ వెనుక పరాశరభట్టను వైష్ణవాచార్యులు కోరుకొండ ముమ్మడినాయకునకు వైష్ణవ దీక్ష నిచ్చినను, వారు మత ప్రచారము చేయలేదు. అహోబలమున హొతకమూరి భాగవతులు విశిష్టాద్వైత మతావలంబకులైనను వారు భాగవత సేవయే తప్ప వేరు మార్గము ద్రొక్క లేదు. శ్రీ తిరుపతి క్షేత్రమున . అన్నమాచార్యులవారి. సంకీర్తనలా క్షేత్రము ..దాఁటి పైకి రాలేదు.

పై విషయములను బట్టి విశిష్టాద్వైత మత ప్రచారము తెనుఁగు దేశమున క్రీ.శ. పదునారవ శతాబ్ది వరకు వేరూన లేదు. సాహిత్యమున నా మత ప్రభావము కానరాదు. అంతకు ముందు వెలసినది పౌరాణికమై త్రిమూర్త్యాత్మకమగు విష్ణు భక్తియే.

అసలు విశిష్టాద్వైత మతమే వాఙ్మయమున ప్రచారము గానప్పుడు, పదునాల్గవ శతాబ్దిలో బుట్టిన రంగనాథ రామాయణాది గ్రంథములు వైష్ణవ మత ప్రచారమునకు రచింపఁబడినవని చెప్పు సాహితీ విమర్శకుల మాటలప్రామాణికములే యని చెప్పక తప్పదు. ఇక రామానుజాచార్య ప్రతిపాదిత వైష్ణవ సిద్ధాంతము విజయనగర రాజుల కాలమున, అందును తుళువ వంశీయుఁ డగు నరసింగరాయల కాలమున ప్రబలముగా ప్రచారములోనికి వచ్చినది. రాజాశ్రితమగు మతమగుట చేత రాజకీయముగా, సాంఘిక వ్యవస్థ యందు ప్రాబల్యము గడించినది.

## తెలుఁగు సాహిత్యము - మత సామరస్యము

విశిష్టాద్వైత మతము ప్రచారములోనికి రాక పూర్వము నాలుగు శతాబ్దములనుండి మన తెలుఁగు వాఙ్మయమున మత సామరస్యమే గాని, మత వైషమ్యమెంత మాత్రమును గాన రాదు.

నన్నయ యుగము వెనుక నరఁగా క్రీ.శ. 1100 ప్రాంతమునుండి శివకవి యుగ మారంభ మైనది. వీర శైవమును ప్రతిపాదించిన శివకవుల కృతులనుండి, శైవమున విష్ణుద్వేషమే లేదని ముందు సోపపత్తికముగా నిరూపించి యుంటిని.

శివకవి యుగము తరువాత తిక్కన యుగము ప్రారంభమైనది. తిక్కన మహాకవియేగాక మత ప్రవర్తకుఁడగుట చేత, "మహేశ్వరాంఘ్రికమలధ్యానైకశీలుఁడను" అని తాను చెప్పుకొన్నను మత సామరస్యము కొఱకు హరిహరతత్త్వము ప్రతిపాదించినాఁడు. ఆయిన నాతని భారతమున శివోత్కర్షను, లింగ పూజా విధానము మొదలైన వానిని స్పష్టముగా ప్రతిపాదించి యున్నాఁడు. తిక్కనను ప్రధానముగా శివ భక్తుని గానే కేతన వర్ణించి యున్నాఁడు. తిక్కన యుత్తర రామాయణమును, కృష్ణకథా విలసితమగు భారతమును రచించి యున్నాఁడు. హరిహరాద్వైతమును ప్రతిపాదించినాఁడు. తిక్కనకుఁ గృతినిచ్చిన కేతన శివ భక్తుఁడు. "వృషపాదద్వయిగా నికేతనుఁడు". కవిత్రయములోఁ గడపటివాఁడగు నెఱ్ఱన శంభుదాసుఁడు అయినను గోవింద పదారవింద భజనానందుఁడు. విష్ణుని యవతారములలో నృసింహావతార కథను, శ్రీ కృష్ణావతార చరిత్రను సంపూర్ణముగ నిరూపించు హరివంశమును రచియించి యున్నాఁడు. నాచన సోమన హరిహరాద్వైతమును దృష్టాంత పూర్వకముగ నుత్తర హరివంశమున వివరించి యున్నాఁడు. శ్రీనాథ మహాకవి, శివ కథారచన కౌతూహలియయ్యు "చెన్న కేశవ పాద సేవారతుండ" ననిచెప్పి పల్నాటి వీర చరిత్ర రచియించియున్నాఁడు.

కొఱవి గోపరాజు హరిహరాద్వైతమునే ప్రతిపాదించినాఁడు. పోతనకు కొంచెము ముందు వాఁడగు మడికి సింగనయు, వైష్ణవ భక్తిపరుఁడయ్యు, శివ నుతిని గావించినాఁడు. పోతన సమకాలికుఁడగు ననంతుఁడు, నల్లాన్ చక్రవర్తుల గోవింద చక్రవర్తుల శిష్యుఁడయ్యును, భోజరాజీయమున శివస్తుతిఁగావించి యున్నాఁడు.

పై చర్చను బట్టి, వీరశైవమున విష్ణుప్రసక్తి యున్నదనియు, వైష్ణవమున శివప్రసక్తి లేదనియు, నట్లు లేకపోయినను తెలుగుసాహిత్యమున కవులు సామరస్య భావమున కృతులు రచించిరనియు విశదమగుచున్నది.

శైవుడగు పోతనయు, 'నారాయణకథా ప్రపంచ కుతూహలుండై', మహేశ్వరధ్యానము చేయుచు, శ్రీరామచంద్రుని ప్రత్యక్షముచేసికొని, శ్రీ కృష్ణ స్తుతితో ప్రారంభించి, భాగవతమును శ్రీ రాముని కంకితము గావించి," తాను, పరమేశ్వర కరుణాకలితకవితా వైచిత్రిచే నామహాగ్రంథమున నద్వైత భక్తి తత్త్వము ప్రతిష్ఠించెను.

భారతమున తిక్కన ప్రతిపాదించిన హరిహరాద్వైతము భాగవతమున రామకృష్ణాద్వైతమైనది.

అట్టి భక్తి తత్త్వముతో పోతన మహా కవీంద్రుడు వ్రాసిన కృతులు నాలుగు.

1. వీరభద్ర విజయము.
2. నారాయణ శతకము.
3. భోగినీ దండకము.
4. శ్రీ భాగవతము — ఎనిమిది స్కంధములు.

వానినిగూర్చి యిక ముందు వివరింతును.

# 4. పోతన కృతులు

## వీరభద్ర విజయము

శ్రీనాథయుగమున వెలసిన వీరశైవ కథా ప్రధానములగు ప్రత్యేకకృతులలో పోతన వీరభద్ర విజయము ప్రాథమికమైనది. పోతన వంశవృత్తాంతమును వివరించునపుడు, వీరభద్రవిజయము పోతన బాల్యకాలకృతియని నిరూపించితిని. కథావస్తు విషయముననేగాక భాషావ్యాకరణఛ్ఛందో విషయములందు నీ కృతి పూర్తిగా నితర కృతుల ననుసరించినది

ఈ గ్రంథ రచనకు కారణముగా నీ క్రింది కథ గ్రంథస్థమై యున్నది "పోతన భాగవతమున చతుర్థస్కంధమున దక్షాధ్వర ధ్వంసమును వర్ణించునప్పుడు, శివ నింద చేసెను. శివ నిందా దోషము పోగొట్టుకొనుటకై యాతడు వీరభద్రవిజయమును రచించెను" అందులకు వీరభద్ర విజయమునందలి యీ క్రింది పద్యము తార్కాణము అని కూడ గ్రంథస్థమైన విషయము.

ఉ. భాగవతప్రబంధ మతిభాసురతన్ రచియించి, దక్షదు
ర్యాగ కథాప్రసంగమున నల్పవచస్కుడనైతి తన్నిమి
త్తాగత వక్తృ దోష పరిహారముకై యటనైక శైవశా
స్త్రాగమ వీరభద్రవిజయంబు రచించెద వేడ్కనామదిన్

ఈ పద్యము వీరభద్రవిజయములో షష్ఠ్యంతములకు ముందుగా ముద్రితమై యున్నది. దాని ముద్రిత గ్రంథము నందలి (పుట 10) యథోజ్ఞాపికలో "ఈ పద్యము పెక్కు మాతృకలలో కానరాదు"[1] అని కలదు. మాతృకలనగా తాళపత్రప్రతులు. ఇందు పలికిన తొలుత పద్యము పెక్కు యనిపించుట సందిగ్ధము. ఇక రెండవది కర్తృత్వము — ఈ పద్యము పోతన కృతమే యైనచో నింతకంటె యసందర్భమగు విషయము వేఱొకటి యుండదు. 'పిన్ననాడ' నని వీరభద్ర విజయమున స్పష్టముగా చెప్పిన పోతన పై విధముగా నెట్లు వ్రాయును? కావున నిది కల్పితము కావలెను. పై పద్యమున 'అల్పవచస్కుడనైతి' అని కలదు. అనగా శివుని గూర్చి చులకనగా మాట్లాడుట యని యర్థము.

కాని పోతన భాగవతమున దక్షయజ్ఞ సందర్భమున శివునిగూర్చి చెప్పిన మాటలల్పములు గావు. అవి యనల్పములు. ధర్మజుని రాజసూయయాగ సందర్భమున శిశుపాలుడు శ్రీ కృష్ణు

---

1 వావిళ్ల ముద్రణము — 1952 వేటపాలెం తాళపత్రప్రతులయందును నీపద్యము కానరాలేదు

పరమాత్మను నాక్షేపించుచు, నిందా రూపమగు వ్యాజస్తుతి నన్నయ ఎట్లు గావించెనో అట్లే పోతనయు దక్ష యాగమున, దక్షుని శివుని గూర్చి పల్కిన పల్కులన్నియు వ్యాజస్తుతులే కాని వేరు కావు.[1] పోతనయే యీ పద్యము చెప్పిన, నాతఁడు స్వవచన వ్యాఘాత దోషమునకుఁ బాల్పడును. కావున పద్యమాతనిది కాదు. భాగవతము పీఠిక "ఇమ్మనుజేశ్వరాధములకు" అను పద్యమువలె నిదియు ప్రక్షిప్తము.

వీరభద్రవిజయము బాల్యకృతియే యైనను, నది పోతన రచించినది గావున వాఙ్మయ ప్రపంచమున నిలచినది. మరియు పోతన బాల్య కవిత ప్రౌఢ కవితగా నెట్లు భాగవతమున పరిణమించి నదియు తెలిసికొనుటకు నీ కృతి ప్రధాన సాధనముగా నున్నది. ఈ విషయము నిటుపిదప వివరింతును.

వీరభద్రవిజయము నాల్గాశ్వాసముల ప్రబంధము. ఇందు ప్రథమాశ్వాసమున 231, ద్వితీయాశ్వాసమున 314, తృతీయాశ్వాసమున 267, చతుర్థాశ్వాసమున 234 — మొత్తము 1046 గద్యపద్యములుగలవు.

గ్రంథావతారికలో, తొలుత శివస్తుతి, ఆవెనుక వీరభద్ర గణాధిపవాణీస్తుతులు గలవు. సంస్కృత కవి స్తుతిలో — వ్యాస వాల్మీకులు, కాళిదాసు, బాణుఁడు, మాఘుఁడు, శివభద్రుఁడు మణిభద్రుఁడు (1) భారవి, భోజుఁడు గలరు.

తెలుఁగు కవి స్తుతిలో — నన్నయ, తిక్కన, వేములవాడ భీమన, రంగనాథుఁడు, శృంగార కవినాథుఁడు కలరు. శృంగార కవినాథుడు శ్రీనాథుఁడని మనము గ్రహింప వలెను. వీరితోఁబాటు

క. భవునిజాడక, భవిడాయక
భవు పదములు గొల్చి ఘోర భవభంజనులై
భవదూరులైన పుణ్యుల
భవునర్చన జేసి వరముఁబడసిన వారిన్" అని యితరులను పేర్కొన్నాఁడు.

వీరు — సిరియాలుఁడు, కరికాలుఁడు, సినముఁడు, ఉద్భటుఁడు, బాణుఁడు, కేశిరాజు, బసవ రాజు,కన్నప్ప,చెన్నయ్య,కరయూరి చోడుఁడు, కుమ్మర గుండయ్య, నమ్మినాథుఁడు, పండితారాధ్యుఁడు భల్లాణుఁడు, నమినంది, మడివాలుమాచయ, మాచిరాజు, చేరమ, చిరుతొండఁడు, ఓహిళయ్య,

[1] సభాపర్వమునకు భారతము లక్ష్మీపతి సోమయాజి వ్రాసిన వ్యాఖ్యలో నీ విశేషములన్నియు వివరింపఁబడినవి.

సాంఖ్యతొండఁడు, మడివాలుమాచఁడు — అనువారు. వీరిలో బసవన అవైదికమగు జంగమ సంప్రదాయమునకు, పండితారాధ్యుఁడు సద్వైదికమగు నారాధ్య సంప్రదాయమునకు ప్రవర్తకులు. సద్వైదికమగు నారాధ్య సంప్రదాయము, లేక వీరమాహేశ్వరాచారసంప్రదాయమునకుఁ జెందిన వాఁడు పోతన.

తాను లేఁబ్రాయమున వాఁడయ్యు, తన గురువగు ఇవటూరి సోమనారాధ్యుని ప్రేరణచే నీ కృతి రచించినట్లు, "పిన్నవాఁడననియు, పెక్కు సంస్కృతులు వినని వాఁడననియు" నను వాక్యముచే తెలియుచున్నది. మఱియు గద్యయందు, "ఇది శ్రీమన్మహామాహేశ్వర యివటూరి సోమనారాధ్య దివ్య శ్రీపాదపద్మారాధక, కేసనామాత్య పుత్ర, పోతన నామధేయ ప్రణీతంబైన" అని యుండుటవలన పై గురుశిష్య సంబంధము వ్యక్తమగుచున్నది.

## కథాసంగ్రహము

పోతనయే కృత్యాదియం దీకథ వాయుపురాణాంతర్గతమని చెప్పియున్నాఁడు. (1—౭౭) ఒకనాఁడు పార్వతీపరమేశ్వరులు రజతాచలమున కొలువుదీరి యుండగా, గౌతమ కశ్యప వామదేవాది ఋషులరుదెంచి, శివ సాన్నిధ్యము బడసి శివుని స్తుతించుచుండిరి. ఆ సమయమున దక్షుఁ డచ్చటికిఁ వచ్చెను. కాని పరమేశ్వరుఁడు తక్కిన ఋషుల వలెనే, యాతనిని గౌరవించెను గాని, మామగారని యెదురేగి తీసికొని వచ్చి పూజింపలేదు. దానితో దక్షునకుఁ గోపము వచ్చి, శివుఁడు తన్ను ఋషుల ముందర యవమానము చేసినందులకు ప్రతీకారముగా నొక్క యజ్ఞము నాయత్తపఱచి, అందులకై యందఱుదేవతల, ఋషుల నాహ్వానించి, శివుని పిలువకుండ యజ్ఞము చేయ ప్రారంభించెను. అప్పుడు నారదుఁడు కైలాసమునకు వచ్చి దాక్షాయణితో నామె తండ్రి దక్షుఁడు చేయు యజ్ఞమును గూర్చి చెప్పెను. ఆమెయు, శివునితో, దక్షుఁడు యజ్ఞము చేయుచున్నాఁడనియు, శివునిఁ బిలువక యాతఁడు ప్రారంభించుట తప్పనియు, తనకేదో వింతగ గానవచ్చుచున్నదనియు, నాజ్ఞయైన యెడల, యజ్ఞము చూచి వచ్చెదనని విన్నవించెను. శివుఁడు వల్లెయనెను. ఆమె యజ్ఞశాల కరుగగానే, దక్షుఁడామెను తిరస్కరించి పరాభవించుటయే గాక శివుని నిందించెను. ఆమెయు తండ్రితో పరమేశుని మహాత్మ్యమ్ముఁజెప్పినను నాతఁడు వినక పోవుటచేత, శివనింద విన్న పాపపరిహారార్థము, యోగాగ్ని గల్పించుకొని యందుండి దేహత్యాగము చేసెను. ఇది తెలుసుకొని శివుఁడు, వైవస్వతమనువునాఁడు దక్షుని ధ్వంసముచేసెదనని శాపమిచ్చెను.

అంత దాక్షాయణి హిమవంతునకుఁ గూఁతురై పుట్టెను. ఆమె తొలి నుండియు శివుని భర్తగాఁ గోరెను. యౌవనము రాగానే హిమవంతుఁడామెను ఈశ్వర పరిచర్యకొఱకు, తపస్సు చేయుచున్న శివునకుఁ జూపెను. శివుఁడామె పరిచర్యనంగీకరించెను. ఇది ప్రథమాశ్వాస కథ.

ద్వితీయాశ్వాసమున తారకాసురుని దుండగములు శివ పార్వతులకు జన్మించిన కుమారుని వలన తారకాసుర సంహార మగునని బ్రహ్మ దేవతలకు, చెప్పుట అప్పుడు తపస్సు చేయుచున్న శివుని తపోభంగము చేయుటకు నింద్రుని ప్రేరణచే మన్మథుఁడు వెడలుట యనువానితో ప్రారంభమగుచున్నది. రతి యెంత చెప్పినను వినక మన్మథుఁడు శివునిపై వెడలుట — ఆతఁడు శివుని కంటి మంటలచే దగ్ధుఁడగుట — రతీదేవి నాకాశవాణి సమాశ్వాసించుట—హిమవంతుఁడు పార్వతి నింటికిఁగొనిపోవుట. శివుఁడొక యెఱుకత వేషము ధరించి, శీతగిరికేగుట — పార్వతితో పరమేశ్వరుని కొఱకు తపస్సు చేయుమని యుపదేశించుట — ఆమె తపము — శంకరుఁడు బ్రహ్మచారియై వచ్చి, ఆమెకు తన మనోరథము దెల్పుట యను కథలు గలవు.

తృతీయాశ్వాసమున, పార్వతీ పరిణయము — కైలాసమున హరగిరిజలు సుఖముండుట — శంకరుఁడు గరళకంఠుఁడగుటకు కారణము — హాలాహలభక్షణ కథ వివరింపఁబడినవి.

చతుర్థాశ్వాసము, వీరభద్రవిజయ ఘట్టము — ఈ నాటికి వైవస్వత మన్వంతరమగుటచేత దక్షుఁడు తిరిగి శివరహితముగా యజ్ఞము చేయ ప్రారంభించి, సమస్త దేవతలను ఋషులను నాహ్వానించెను. అప్పుడు దధీచి, శివుఁడు లేని యజ్ఞము వ్యర్థమని, శివుఁడేయజ్ఞకర్త, యజ్ఞభోక్త యని బోధించెను. దధీచిని దక్షుఁడు తూలనాడి యవమానించెను. దానితో నాతఁడు కైలాసమునకుఁ బోయి శంకరునితో నీ వృత్తాంతము నివేదించెను. శివునకు, పార్వతికి కోపము వచ్చెను. శివుని కోపము వలన వీరభద్రుఁడును, పార్వతి కోపమువలన భద్రకాళి యను భద్రేశ్వరియుఁబుట్టిరి. తక్కిన ప్రథమగణములతో వీరభద్రుఁడు దక్షుని యజ్ఞము ధ్వంసము గావించెను. దక్షుని శిరస్సు ఖండించెను. కాని యాగ పురుషుఁడగు విష్ణువు వీరభద్రునితో యుద్ధము చేసెను. విష్ణు చక్రము ఖండితమయ్యెను. తక్కిన దేవతలకు నాసికాచ్ఛేదన కర్ణచ్ఛేదనాది దండనలు జరిగినవి. వీరభద్రుఁడు విజయముతో కైలాసమునకు వారందరిని తోడ్కొనిరాగా, శివుఁడు దక్షుని కరుణించి. దేవతలకు వారి వారి స్వస్వరూపములనిచ్చి, విష్ణుని సంభావించి, వీరభద్రవిజయమునకు సంతసమందెను.

వీరభద్రవిజయము పోతన బాల్యమున రచితమైనను భాగవతమహా వృక్షమున కది బీజప్రాయమైనదని నిరాఘాటముగా నిర్ణయింపవచ్చును.

వీరభద్రవిజయము 1—202

సీ. శృంగారములు సేయ శృంగారియొల్లదు
పువ్వులు దురుమదు పువ్వుఁబోడి
పలుకంగ నేరదు పలుక నేరని భాతిఁ
జంచలత్వమునొందుఁ జంచలాక్షి

సరసులఁగ్రీడింప సరసిజానన పోదు
మౌనంబుతోగుందు మానవిభవ
గంధంబు పూనదు గంధవారణయాన
చెలువలఁబిలువదు చెలులచెలియ

గీ ముకురమే పొద్దుఁజూడదు ముకురవదన
తరుణి మరియును సర్వకృత్యములు మఱచి
హరుని తోడి కొండాటయై లతాంగి
యుగ్రతాపంబు సైరింపకున్నఁ జూచి

భాగవతము దశ పూ 1731

సీ మృగనాభియలఁదదు మృగరాజమధ్యమ
జలములనాడదు జలజగంధి
ముకురంబుజూడదు ముకురసన్నిభముఖి
పువ్వులుదురుమదు పువ్వుఁబోడి
వనకేళిఁగోరదు వనజాతలోచన
హంసంబు బెంపదు హంసగమన
లతలఁబోషింపదు లతికాలలితదేహ
తొడవులు తొడవదు తొడలతొడవు

ఆ వె తిలకమిడదు నుదుట తిలకినీతిలకంబు
గమలగృహముచొరదు గమలహస్త
గారవించి తన్ను కరుణ గైకొన వన
మాలి రాడు జాలిమాలి యనుచు

వీరభద్రవిజయము 1—206

చ ఘనతరమాతులుంగవటఖర్జురరంభకదంబనింబచం
దననవచంపక క్రముక తాలతమాల విశాలసాలరో
చన వరగంధసార ఘనసార యుదుంబర చూతకేతకీ
పనస లవంగలుంగ తరుపంక్తుల నొప్పినదాని వెండియున్

ఇందు 'ఘనసార' యుదుంబర అను సమాసదోషము కలదు

భాగవతము 3—764

ఉ. అందుఁదమాల సాల వకుళార్జున నింబకదంబ పాటలీ
చందన నారికేళ ఘనసార శిరీషలవంగలుంగ మా
కంద కుచందనక్రముక కాంచన బిల్వకపిత్థమల్లికా
కుంద మధూకమంజుల నికుంజములందనరారి వెండియున్

ఇందలి సమానరచన విస్పష్టమై వెలయుచున్నది

వీరభద్ర విజయము 2—96

మ. కనియెం గాముఁడు మాతులుంగకదళీ ఖర్జూర పున్నాగ చం
దన జంబీర కదంబరంభఫలినీ దాడిమ మందార కాం
చన నాగార్జున బింబ కంటక ఫలానంత ప్రవాళావళీ
వన సంరంభము శీతవంతమును శర్వాణీ ప్రియోపాంతమున్

ఇందు చివర పాదమున నన్ప్రాసగలదు
పై పద్యమును నన్ప్రాసలతో దిద్ది తీర్చినట్లు భాగవతమున నట్టి ప్రాసతో నున్న యీ క్రింది పద్యములంజూడుఁడు

మ. కనియెన్ దానవపుంగవుండఖిలలోకఖ్యాతవర్తిష్ణు శో
భనభాస్వత్పరిపూర్ణయౌవన కళాభ్రాజిష్ణు, యోగీంద్ర హృ
ద్వనజాతైకచరిష్ణు గౌస్తుభ ముఖోద్యద్భూషణాలంకరి
ష్ణు నిలింపాహితజిష్ణు విష్ణుఁ బ్రభవిష్ణుం గృష్ణరోచిష్ణునిన్ 3—148

మ. కనియెన్ నిశ్చలభక్తియోగమహిమం గంజాతగర్భుండు శో
భనచారిత్రు జగత్పవిత్రు విలసత్పద్మాకళత్రున్ సుధా
శనముఖ్యస్తుతిపాత్రు దానవచమూ జైత్రున్ దళత్పద్మనే
త్రు నవీనోజ్జ్వల నీలమేఘ నిభగాత్రుం బక్షిరాట్పుత్రునిన్. 3—284

మ. కని రాతాపస పుంగవుల్ — — — — — —
— — — — సంపద్భద్రునిన్ రుద్రునిన్ 4—695

బాల్యకవితయైనను భాగవతమునందలి ధారాశుద్ధి శుద్ధియైన పద్దియంబులిందు లేకపోలేదు

శా నానాథుండు మహేంద్రదేవమునిరాణ్ణాగేంద్ర దిగ్రాజవాక్
శ్రీ నాథాగ్ర కిరీట కూట విలసచ్ఛృంగార దివ్యప్రభా
నానారత్ననికాయి సంతత లసన్నవ్యస్ఫురత్పాదుకే
కావాలంకృతుఁ డీశుఁ డాతనికి నిల్లాలన్ శివాసుందరిన్

1—70

శా మందారోన్నత పారిజాత కదళీ మాకందపుష్పావళీ
మందాలోలసుగంధమారుత మనోమాన్నిత్య సమ్మోదియై
నందాత్మల్ సురసిద్ధ సాధ్య విలసన్నాగేంద్ర బృందంబు లిం
పొందం గొల్వ ననంతరాజ్య సిరిఁగొల్వుండెన్ సురేంద్రుఁడోగిన్

2—17

మ విలుఁ జూచున్ వెలిఁజూచుఁ జూచుసురలన్, విశ్వేశ్వరుంజూచుఁ గొం
దలమందుం దలపోయుఁ జొచ్చుఁ గడిమిన్ దర్వీకరాలంకృతో
జ్జ్వల విభ్రాజిత నిత్యనిర్గుణ తపోవారాన్నిధిన్ జెచ్చెరన్
గలపం జూఁచుఁగలంపలేక తలఁకుంగాముండు విశ్వేష్టుఁడై

2—101

పై యుదాహృతులను బట్టి వీరభద్రవిజయము పోతన కృతమనుట నిస్సంశయము

ఈ ప్రబంధమున శైలియందు, శాబ్దిక రూప వ్యత్యయములు, వైరి సమాసములు, వ్యాకరణ దోషములు యతి భేదములు కాన వచ్చుచున్నవనియు, నందుచే నిది పోతన కృతము కాదని యందురు కాని యిది కేవలము శివకవుల కవితా సంప్రదాయముల ననుసరించినది వీనిలో కొన్ని ప్రాచీన లాక్షణికు లామోదించినవియే అయినను తరువాతి లాక్షణికులను, విమర్శకులు ప్రమాణములుగా గొనుట చేత నీయవ్యవస్థ యేర్పడినది

సంసారము — సమసారము శబ్ద రూపములు 1.

ఉ శంకర జోగిఁదెచ్చి సమసార నివాసునిఁజేసి 2—144

ఇచ్చట పోతన, సంసారమును సమసారముగాఁజేసినాడు శబ్దరూపము సరిగాక పోవచ్చును గాని — సంసారము — భార్య భర్తలిరువురకు సమానమైన సారముగలది సమసారము గదా !

'సం' అను నుపసర్గ తెలుఁగున 'సమ్ము' 'సంపు' అను రూపములనందుచున్నది 'సంపలరఁగ' — ఁ అని ఒక్కన విక్రమార్కచరిత్రలోఁ బ్రయోగము కలదు

2 మృగనేత్రి — ఇట్టి రూపములు శాసనములయందుఁగన్పట్టు చున్నవి కవుఁ ప్రయోగించిరి కాని నేఁటి ముద్రణములలో నిట్టివి రూపు మాసినవి ఇచట యతిస్థానము నున్నది కావున నిర్ధారకము

"ధృతిమై నుత్తమ కన్యయండ్రు మృగనేత్రిన్—" (2—221)

## మిశ్ర సమాసములు

ఉలరుసాయకవైరి (2—229)
భోగరాయఁడు (3—79)
భూకాంతతేరు (2—81)

ఇట్లే నైషధమున 'వలుద కుచకుంభములు' అని గలదు (1—85)

## యతులు

ఋ — రు

"ఋతు సంవత్సర మాస పక్షజానితారూఢాయ" (3—239)
"మృడునకుఁగేలెత్తి మ్రొక్కువారు" (3—164)
ఇట్టి యతులు భాస్కర రామాయణమునను గలవు

## ప్రాసలు — వలప గిలక ప్రాస

క ఎవ్వరి సొమ్ము తలోదరి
యెవ్వరి దాసుండ నేను నెల్లప్పుడు, మా
కెవ్వఁడు దైవము శంభుఁడు
సర్వేశుఁడు దానెకాదె సకల విధములన్ (3—45)

ఇట్టి ప్రాసలు శివతత్త్వసారమున గలవు తిక్కనయు వాడియున్నాఁడు—
"ద్యూత క్రీడకుఁ గొండొక
నేతున్ (నేర్తున్)" విరాట (1—67)

పైని చూపిన శాస్త్రేతర కవిప్రయోగములననుసరించి వీరభద్రవిజయమునందలి ప్రయోగములు లాక్షణికములనియే గ్రహింపవలెను

# కథావస్తు ప్రాధాన్యము

నన్నెచోడ మహాకవి ఈదక్షయజ్ఞకథను కుమారసంభవ ద్వితీయాశ్వాసమున 105 గద్య పద్యములతో రచియించి యున్నాఁడు అందీ క్రింది మార్పులు గావించి యున్నాఁడు

1 ఇందు పురాణ ప్రసిద్ధమగు వీరభద్రుని ప్రశంసయే లేదు దక్షయజ్ఞ భంగమంతయు గణాధిపతి చేసినట్లు గలదు "అస్మదీయ జననీ పరాభవంబింతయుఁ గావున నవశ్యము నిప్పని నాకుఁ దయసేయవలయు"నని (2—60) గణాధిపతి కోరి యీ కార్యము నిర్వహించెను పురాణము లలో వీరభద్రుని పుట్టుకయే దక్షాధ్వర ధ్వంసముకొఱకని స్పష్టముగానున్నది

2 "అంతకుమున్న కృతాంతకుండు తద్వృత్తాంతంబంతయు నారదు వలన విని" అని (2—49) దక్షయజ్ఞమున సతీ దేవి దగ్ధవృత్తాంతము నారదుని వలన వినినట్లు కుమార గలదు పురాణములలో దధీచి వలన వినినట్లు గలదు

3 దక్షుఁడు రెండు మారులు యజ్ఞము చేసినాఁడు మొదటి దక్షయాగమందే సతీ దేవి యోగాగ్ని యందు దగ్ధమైనది అప్పుడు యజ్ఞము భంగముకాలేదు అంత శివుఁడు వైవస్వతమన్వంతరమున దక్షునికి బుద్ధి చెప్పెదనని శాపమిచ్చును రెండవమారు వైవస్వత మన్వంతరమున యజ్ఞముఁ చేసినప్పుడు, వీరభద్రుని సృష్టించి, శివుఁడు యజ్ఞధ్వంసము చేసెను ఇందు సతీదేవి ప్రస్తావనయే లేదు

నన్నెచోడఁడీరెండింటిని కలిపి యొక్కమారే దక్షుఁడు యజ్ఞము చేసినట్లు వర్ణించి, సతీదేహత్యాగమును, యజ్ఞధ్వంసమును నొక్క మారే వర్ణించినాఁడు

4 పురాణములలో దక్షుని శిరస్సు ఖండితమైనట్లుగలదు ఇచట బంధితుఁడైనట్లు మాత్రమే గలదు

వీరభద్రప్రాభవమును వెలయించు దక్షాధ్వరధ్వంసకథ యివ్విధముగా తెలుఁగున మార్పుఁ జెందుటయు అదియును శివకవి కృతమగు మహాకావ్యమునందుండి వ్యాప్తియగుటయు చూచియే పోతన గురువగు నివటూరి సోమనాథుఁడును, వాయు పురాణోక్తమైన వీరభద్రవిజ యమునుఁ దెలుపుమని యానతిచ్చియున్నాఁడు మూలగ్రంథము ననుసరించి పోతన తూచ తప్పకుండ వ్రాసియున్నాఁడు పోతన వీరభద్రవిజయగ్రంథరచన మూలముననే, వీరభద్రా రాధనము, కొలువులు దేశమందువ్యాప్తములైనవి

పోతన కాలమునకు కొంచెము ముందుగానే, తెలుఁగు దేశమున, గుంటూరు మండలమున తాడువాయి గ్రామములోను, తూర్పు గోదావరి మండలమున పట్టిసక్షేత్రమునను, వీరభద్రాలయములు వెలసినవి[1] పట్టిసక్షేత్ర వీరభద్రాలయము శైవులకు పుణ్య క్షేత్రమైనది వాఙ్మయమున ప్రసిద్ధి వడసినది కాశీ ఖండమున —

"పట్టిస శ్రీ వీరభద్రేశు సేవించి' (3—16) అనియు

అందే, వీరభద్రగిరి, వీరభద్ర వర్ణనము (3—31—32)

"బ్రహ్మ సంవేద్య మాదిగాఁబొల్చు సొంతము (3—33)" అని యీ క్షేత్ర ప్రశంసగలదు నిశ్శంక కొమ్మన శివలీలావిలాసమున, పట్టిసము, ప్రసిద్ధ శైవాచార్యుఁడగు ఘూడెరాయ భీమేశ్వర గురూత్తమునకు నివాసమని చెప్పబడియున్నది

ఒరంగల్లునకు పడమట నున్న 'కొలివి' యందు వీరభద్రాలయ ముండుట కూడ, పోతన వీరభద్రవిజయకర్తృత్వ నిర్ధారణకుఁ దోడ్పడుచున్నది

ఈ క్షేత్రమునకుఁ బ్రత్యేక క్షేత్ర మహాత్మ్యములు లేక పోయినను, పోతన వీరభద్ర విజయము వలన, వాని ప్రాభవమినుమడించినదని చెప్పుటలో యతిశయోక్తి లేదు వీరభద్ర విజయ గాథ, వాఙ్మయమునఁ బ్రచారము గాంచుట పోతన కృతి వలననే గావున, బాల్యకృతియయ్యును నది వాఙ్మయ చరిత్రమున చిరప్రతిష్ఠవడసి ప్రబంధ, యక్షగాన, శతక, గేయరూపముల విలసిల్లుట కాధారమైనది

శివకవియగు నన్నెచోడ మహాకవి కృత కుమారసంభవమును పోతన చక్కఁగాఁ జదివి యున్నట్లు, వీరభద్రవిజయమునందలి యీ క్రింది సంవాదములను బట్టి నిరూపింపవచ్చును

1 మన్మథుఁడీశ్వరుని తపోభంగము గావించుటకు బయలు వెడలునపుడు రతీ మన్మథులకు సంభాషణ నడచినది కాళిదాసు కుమార సంభవమున నిదిలేదు నన్నెచోడుని కృతి యందున్నది పోతన దానిననుకరించినాఁడు

---

[1] సుప్రసిద్ధారాధ్య విద్వత్కవివతంసులు, మహోపాధ్యాయులునగు మల్లంపల్లి వీరేశ్వర శర్మగారు తాడువాయి వీరభద్రునిగూర్చి "వీరభద్రోదాహరణము" అను ప్రశస్త స్తుతి కావ్యమును రచించిరి

## కుమార సంభవము 4—72

ఎ. అతని శరాసనంబు గనకాచల మిక్షుశరాసనంబు నీ
కతనికి నమ్ముపాశుపత మంటిన గందెడు పూవుటమ్ము నీ
కతఁడు పురాపహారి విరహాతుర పాంథ జనాపహారి వీ
వతనికి నీకు హస్తిమశకాంతర మెమ్మెయినెన్ని చూచినన్

## వీరభద్ర విజయము 2—81

సీ. భూకాంతతేరును పూవులతేరును
నిర్జరసుభటులు కీరభటులు
కనకాచలమువిల్లు కడుతియ్యనగువిల్లు
మేటినందిపడగ మీనుపడగ
బహుమంత్రవాజులు పచ్చనివాజులు
పెక్కుదలలవారి భృంగనారి
నలుమొగంబుల యంత నవవసంతుఁడు యంత
పురుషోత్తముండమ్ము పూవుటమ్ము

ఆ వె వెలయు రేలుఁబగలు వెలిగించుకన్నులు
తమ్మికండ్లు త్రిపుర దైత్యకోటి
గురి విటవ్రజంబు గురి యతనికి నీకు
వేమి చెప్పవచ్చు నెంతకెంత

సీసపద్యమున భావము విస్తృతమైనది

## కుమార సంభవము 4—83 మన్మథ రథ వర్ణన

సీ. పంకరుహాంబులు బండికండులు చంప
కంబులు మొగలుత్పలంబు లిరుసు
కరవీరములు పలుఁగాండి జాదులు పనుఁ
గొయ్య లశోకముల్ గోడిపీఁట

సిందువారంబులు సీలలు గేదగుల్
మెట్టులు మొల్లలు మెట్టుగుదెలు
పొగడలు పలుపులు పున్నాగములు పగ్గ
ములు సహకారముల్ పూనుగాడి

తే కురవకానీకమూలంపుఁ గోల కైర
వములు మునుకోల కోకముల్ వాహనములు
గా వసంతుఁడు సూతుఁడై పూవుఁదేర
నెరయఁ గుసుమాయుధంబులు నినిపి తెచ్చి

వీరభద్ర విజయము 2—94

సీ కమలషండము నున్నఁగాఁజేసి యిరుసుగాఁ
గావించి కెందమ్మి కండ్లఁగూర్చి
తగ నించు మోసుల నొగలుగాఁ గావించి
కరమొప్ప గేదఁగి కాఁడివెట్టి
సంపెంగమొగ్గల చనుగొయ్యలొనరించి
పల్లవంబులు మీఁద పరపుఁజేసి
చెలువైన పొగడదండలచేత బిగియించి
లేఁదీగ పలుపులు లీలఁ జొనిపి

ఆ వె తెఱఁగ లరసి పువ్వుతేనెఁ గందెనవెట్టి
గండురాజకీరగములుగట్టి
మెఱయ చిగురుగొడుగు మీనుటెక్కెముద్రగాల
దేరుఁబన్ని సురభి తెచ్చెనపుడు

కు సం "మునివరులు ప్రముదిత హృదయులగుచు నిప్పరమేశ్వరి పరమేశ్వరు
నగ్రమహిషియగు డేమి యపూర్వంబని నిశ్చయించి పార్వతి
ముద్రారోహణంబు సేసి నగపతిచే నమస్కృతులై వీడ్కొని చనుదెంచిరి" 7—139

పి వి
"మునీంద్రులు కల్యాణ పాదంబులు చెలంగ
ముదితకు ముద్రారోహణంబు చేసి" . . . 3—56

వీరభద్రవిజయమున తెలుగునాట పోతన కాలమునాటి వివాహ ప్రక్రియలో దేశీయాచారములు వర్ణితములైనవి 1 ఉంగరము కన్యకకుఁ బెట్టుట 2 పాలకూళ్ళ గుడుచుట 3 గడియారము పెట్టించుట 4 క్రంతలు గొని పాడుట 5 తలంబ్రాలు పోయుట 6 ప్రవేశ హోమము 7 లాజ హోమము వర్ణితములైనవి మంగళ సూత్రధారణ ప్రస్తావనమిందు లేదు

శివ పంచస్తవములలోఁ బ్రసిద్ధమగు నీలకంఠస్తవమును గూర్చి ప్రత్యేకముగా నిందొక సీసపద్యము గలదు 3—263

సీ. కరమొప్పు నీ నీలకంఠస్తవంబులో
నబల ! యేక శ్లోకమ్మైనఁజాలుఁ
గరమొప్పు నీ నీలకంఠస్తవంబులో
నబల ! యర్ధ శ్లోకమ్మైనఁజాలుఁ
గరమొప్పు నీ నీలకంఠస్తవంబులో
నబల ! పాద శ్లోకమ్మైనఁజాలుఁ
గరమొప్పు నీ నీలకంఠస్తవంబులో
నబల ! కించిన్మాత్రమ్మైనఁజాలు

ఆ వె విమల భక్తితోడ వినినఁబఠించిన
సజ్జనుండు సకల సంపదలను
గలిగి భవము లేక కైలాసవాసుఁడై
నన్నుఁ జేరియుండు నలిననేత్ర !

శ్రీనాథుఁడు హరవిలాసమున పార్వతి తపోవర్ణన సందర్భమున "నీలకంఠస్తోత్రనియతిఁ గూర్చు" అని యీస్తవ ప్రశంస, సంస్కృత కుమార సంభవమున లేకున్నను వ్రాసి యున్నాఁడు

పండితారాధ్యుల కాలమున శైవులకు నీ నీలకంఠస్తవము నిత్య పఠనీయస్తవములలో నొకటి యని సోమనాథుని పండితారాధ్యచరిత్ర వలనఁ దెలియుచున్నది క్రీ శ 1520 ప్రాంతమున యీరదేవమంత్రి దీనిని శివ పంచస్తవిలోఁ జేర్చి వ్యాఖ్యానము వ్రాసి యున్నాఁడు

శివకవి యుగము వెనుక వీరశైవ సంప్రదాయమును ప్రత్యేకముగ నిరూపించు కృతులలో, శివదేవధీమణీ శతకము, శరభాంక లింగ శతకము, సోమనాథ లింగశతకము (అన్యవాద కోలాహలము)

త్రిపురాంతకోదాహరణము మున్నగు లఘుకృతులు గలవు. కవిత్రయ యుగము వెనుక వీరశైవ కథలచే వాఙ్మయవీథి నలంకరించుటకుఁ బూనుకొనినవాఁడు శ్రీనాథ కవి సార్వభౌముఁడు. అతని హరవిలాసమున పౌరాణిక, వీరశైవ సంప్రదాయమునకు సంబంధించిన కథలు గలవు. ప్రత్యేకముగ వీరశైవ సంప్రదాయమునకుఁ జెందిన గ్రంథములలో నా మహాకవికి సమకాలికుఁడైన పోతనామాత్యుని వీరభద్రవిజయము మొదటి కృతి యని చెప్పనొప్పును.

భాగవతము చతుర్థస్కంధమున 100 సంఖ్యగల పద్యమునుండి 213 సంఖ్యగల పద్యము వరకు గల భాగమునఁ దీ దక్షయజ్ఞ కథను, వీరభద్రుని వృత్తాంతమును పోతన రచించియే యున్నాఁడు. అందలి రచన, పరిణతిఁజెందినది గావునఁ బ్రౌఢమై యున్నది. ఇచట పోతన, వ్యాస భాగవతమునందున్న క్రమము ననుసరించెను. కావున కథా రచనలో వీరశైవ సంప్రదాయము లేవియు సూచింప లేదు. ఇదియు పోతన కవితా పరిణతినే గాక, చిత్త పరిపాకమును గ్రహించుటకు నాధార భూతమగుచున్నది.

## నారాయణ శతకము

వీరభద్రవిజయము రచించిన వెనుక పోతన నారాయణ శతకమును రచించెను. ఈ శతకము దేశమందు చాల వ్యాప్తి గాంచినది. దసరాయుత్సవములలో బాలురు తమ బడిలోని తోడివారితో యిండ్లకు వచ్చి, కానుకలడుగుటకు ముందుగా నీ క్రింది పద్యమును జదివెదరు.

మ. ధర సింహాసనమై, నభంబు గొడుగై, తద్దేవతల్ భృత్యులై
పరమామ్నాయము లెల్ల వందిగణమై బ్రహ్మాండ మాగారమై
సిరి భార్యామణియై, విరించి కొడుకై, శ్రీ గంగ సత్పుత్రియై
వరుస న్నీ ఘనరాజసంబు నిజమై వర్తిల్లు నారాయణా

పోతన, తొలుత బాల్యమునుండి శివ భక్తినిరతుఁడు మరియు వీరశైవారాధ్యుల శిష్యుఁడు. వీరశైవులకు విష్ణువనిన ద్వేషము లేదనియు, వారు విష్ణువును శివ భక్తునిగా పరిగణింతురనియు ముందు తెలిపియున్నాను. కావున శైవ గ్రంథమైన వెనుక వైష్ణవ భక్తి ప్రసక్తమగు నారాయణ శతకమును పోతన రచించుట సంభావ్యమే యగుచున్నది. ఈ శతకమున, వీరశైవ కవియగు యథావాక్కుల అన్నమయ్య సర్వేశ్వరశతకానుసరణములేగాక, వైష్ణవ భక్తివాఙ్మయమున ప్రసిద్ధిగన్న కులశేఖరాళ్వారుల ముకుందమాలానుసరణములుగూడ గన్పట్టుచున్నవి. కావున భాగవత రచన నాటికి —

"చేతులారంగ శివ పూజ చేయడేని
నోరు నొవ్వంగ హరి కీర్తి నుడువడేని"

అను పోతన మానసిక తత్త్వ పరిపక్వ దశకు నీ శతక రచన బీజ రూపమున వెలయుచున్నది మరియు భాగవతమున దశమస్కంధమున ప్రతిపాదితమైన కృష్ణభక్తియు నిందుఁ జూపట్టుచున్నది మొదట సర్వేశ్వర శతకమునకు నారాయణ శతకమునకు గల పోలికలను దెలిపెదను

## సర్వేశ్వర శతకము

మ. సకలాధీశ్వరులై, గణాధిపతులై, సర్వజ్ఞులై, నిత్యులై
యకలంకాత్మకులై, మహామహిములై, యంభోజగర్భాండర
క్షకులై యుండుదు రెల్లవారును భవత్పద్భక్తి నానాగణా
ధిక లీలావిధి నంతరంగముల వర్తింపంగ సర్వేశ్వరా!

## నారాయణ శతకము

మ. ఘన భోగాస్పదులై, గతౌఘమతులై, కారుణ్యులై, పుణ్యులై
ఘనకీర్తిప్రదులై, దయాభిరతులై, ధర్మాత్ములై, నిత్యులై
మనుజాధీశ్వరులై, మనోజ్ఞ విభులై, మాన్యస్థులై, స్వస్థులై
వనరన్పొప్పెదువారు నీ పదనుతుల్ వర్ణింప నారాయణా!

## సర్వేశ్వర శతకము

మ. ఖలులై, యాచకులై, విరుద్ధ వికటాకారాంగులై, పంగులై
బలహీనాతురులై, రుజాపటల తాపచ్ఛన్నులై, ఖిన్నులై
చలనాందోళిత చిత్తులై, మలినులై జాత్యంధులై, మందులై
తొలిజన్మంబున నిన్ను గొల్వని దురాత్ముల్ వారు సర్వేశ్వరా!

## నారాయణ శతకము

మ. నిరతానందవియోగులై, నిరసులై, నిర్భాగ్యులై, నీచులై
కరుణాహీనమనస్కులై, కఠినులై, కష్టాత్ములై, నష్టులై
పరుషవ్యాధినిబద్ధులై, పతితులై, భగ్నాంగులై, మ్రగ్గువా
రరయున్నిమ్ముమ్మొగి నాత్మయందిడని వారబ్జాక్ష నారాయణా!

## సర్వేశ్వర శతకము

మ. భువనోత్పత్తి విధించుచో భవుఁడవై, పాల్పొందఁగా దానిను
త్సవలీలం బ్రభవించుచో మృడుఁడవై, సర్వంబుఁగల్పాంతబై
రవసంక్షోభ నటించుచో హరుఁడవై త్రైగుణ్య శక్తిం దుదిన్
శివ నామాంకము దాల్చు నీమహిమదాఁ జిత్రంబు సర్వేశ్వరా !

## నారాయణ శతకము

శా. భూతవ్రాతము నంబుజాసనుఁడవై పుట్టింతు, విష్ణుండవై
ప్రీతిం బ్రోతు, హరుండవై చెఱుతు నిర్భేద్యుండవై, త్రైగుణో
పేతంబై, పరమాత్మవై నిలుచు నీ పెంపెవ్వరుం గాన ర
బ్జాతోద్భూతసుజాతపూజిత పదాబ్జ శ్రేష్ఠ నారాయణా !

పై రెండింటి యందుఁగల పదసామ్యమును బరిశీలించునది మరియు నీ క్రింది పద్యమునుఁ జూడుడు

## సర్వేశ్వర శతకము

మ. భవదుఃఖార్ణవ యానపాత్రము ఎఱ్ఱబహ్మంబు యోగీంద్ర హృ
ద్భవన ప్రస్ఫురిత ప్రదీపము నఘ ధ్వాంతార్కబింబం బతి
శ్రవణానందకరంబు సన్మునిగణస్వాధ్యాయపాఠంబు మీ
శివనామాంకము భక్తిపుంగవ సదాసేవ్యంబు సర్వేశ్వరా !

## నారాయణ శతకము

మ. పరమంబై, పరతత్త్వమై, సకల సంపత్సారమై, భవ్యమై
సురసిద్ధోరగ యక్ష పక్షి ముని రక్షోహృద్గుహాంత స్ఫుర
ద్వర మజ్ఞాన సుదీపమై, శ్రుతి కథా వ్యాపారమై, సిద్ధమై
సరిలేకెప్పుడు నీదు నామమరున్ సత్యంబు నారాయణా !

కులశేఖరాళ్వారు ముకుంద మాల

శ్లో॥ ఆమ్నాయభ్యసనాన్యరణ్యరుదితం వేదవ్రతాన్యన్వహం
మేదశ్ఛేద ఫలాని పూర్త విధయస్సర్వేహుతం భస్మని
తీర్థానా మవగాహ నానిచ గజస్నానం వినాయత్పద
ద్వంద్వాంభోరుహ సంస్మృతిం విజయతే దేవస్స నారాయణః

## నారాయణ శతకము

శా॥ స్నానంబుల్ నదులందుఁ జేయుట గజస్నానంబు చందంబగున్
మౌనంబొప్పఁ జపించు వేదపఠనీమధ్యంబులో చేప్పగున్
నానా హోమము వెల్ల బూడిదఁబోసన్ వేల్చునెయ్యైచనున్
నీ నామోక్తియు నీ పాదాబ్జ రతియున్ లేకున్న నారాయణా !

ఈశ్లో లీలాశుకులు చెప్పిన కృష్ణకర్ణామృతములోని యొక శ్లోకమున కనువాదమున్నది

## కృష్ణ కర్ణామృతము

శ్లో॥ రాధా పునాతు జగదచ్యుత దత్త చిత్తా
మంథానమాకలయతీ దధిరిక్త పాత్రే
తస్యాస్తనస్తబక చంచల లోల దృష్టి
దేవోఽపి దోహనధియా వృషభం నిరుంధన్

## నారాయణ శతకము

మ॥ పెరుగుల్ ద్రచ్చుచు నొక్క గోపిక మిముం బ్రేమంబునన్ జూచి రా
గరసావేశిత రిత్తపవ్వనిడియెం గవ్వంబు నీవు న్మనో
హరలీలం గనుగొంచు ధేనువనియున్ వ్యాబోతుకుం బెట్టితీ
వరవృత్తాంతము లేను పుణ్యకథగా వర్ణింతు నారాయణా !

భాగవతమున నతిలోకోత్తరముగాఁ జిత్రింపఁబడిన శ్రీ కృష్ణగోపికా శృంగార లీలా వర్ణనము కుఁ బ్రతిపదిక కాఁగల కొన్ని పద్యములు నిందున్నవి

మ॥ కసవొప్పం బసి మేసి ప్రొద్దు గలుగం గాంతారముం బాపి యు
ప్పసియున్నీవును వచ్చుచో నెదురుగాఁ బైకొన్న గోపాంగనా
రసవద్వృత్త పయోధరద్వయ హరిద్రాలేపనామోదముల్
పసఁగొంచున్ బసిఁగొంచు వచ్చుటలు నే భావింతు నారాయణా !

శా॥ చన్నుల్ మీఁదికిఁ జవుకళింప నడుముం జవ్వాడ కందర్పసం
పన్నాఖ్యంబు నటింపఁ జూడ్కి కబరీభారంబు లూటాడఁగా
విన్నాణంబుల నొప్పు గోపికలు గోబృందంబుతో వచ్చు మీ
వన్నెల్ కన్నుల ముంచి గ్రోలుటలు నే వర్ణింతు నారాయణా !

శా కేళింగోలయు గాటి చిక్కము నొగిం గీలించి నెత్తెంబుగాఁ
బీలీపింఛము జుట్టి వెన్నడుమునన్ బింఛావళిం గట్టి క
ర్ణాలంకారకదంబగుచ్ఛమధుమత్తాళిస్వనం బొప్పని
వాలంగాచిన భావమిట్టిదని నే వర్ణింతు నారాయణా !

శా కాళిందీతటభూమి నాలకదుపుల్ కాలాది మేయన్ సము
త్తాలాలోలితమాలపాదపశిఖాంతస్కందవై వేణురం
ధ్రాళిం రాగరసంబు నిండ విలసద్రాగంబు సంధించి గో
పాలవ్రాతము గండుగోయిలలుగా వర్తింతు నారాయణా !

భాగవతమున విస్ఫూరిన భావములకు మూలములనదగిన పద్యములునిందు లేక పోలేదు

మ పరమగ్రాబ్ధి తరంగడోలికలలో వైకుంఠ లోకంబులో
విరజావీధి నయోధ్యలో మధురలో ద్రేపల్లెలో ద్వారకా
పురిలో బ్రహ్మ హరేశ్వరాదిక హృదాంభోజంబులో నుండు నై
ఖరి నా లోపల నుండు భాగవత సాక్షాత్కార నారాయణా !

భాగవతము — అష్టమస్కంధము — గజేంద్ర మోక్షము

మ అల వైకుంఠ పురంబులో నగరులో నామూలసౌధంబు దా
పల మందారవనాంతరామృతసరః ప్రాంతేందుకాంతోపలో
త్పల పర్యంకరమావినోదియగు నాపన్నప్రసన్నుండు వి
హ్వల నాగేంద్రము పాహి పాహి యని గుయ్యాలించి సంరంభియై

భాగవత పద్యపుంబోకడలు గల పద్యములు నిందున్నవి

మ అధికాఘౌఘ తమోదివాకరమునై యద్రీంద్రజా జిహ్వకున్
సుధయై, వేద వినూత్న రత్నములకున్, సూత్రాభిధనంబునై
బుధసందోహమనోహరాంకురమునై భూదేవతాకోటికిన్
విధులై మీ బహునామరాజి వెలయున్ వేదాత్మ నారాయణా !

మ మనమూరన్నచలేంద్రజాధిపతికి నన్మస్త్రాగమాణిక్యమై
మునికోపానలదగ్ధరాజితతికిన్ ముక్తిస్ఫురన్మార్గమై
యెనయన్ సాయక శాయికిన్ జననియై యేపారు మిన్నేటికిన్
జని మూలంబగు నంఘ్రి నాదు మదిలోఁజర్చింతు నారాయణా !

మ. ఏ భావంబున నిన్ దలంచె గజయూథేంద్రుండు నాపన్నుఁడై
యే భావంబున ద్రౌపదీయెద రమానాథాయనెన్ వాయసం
బే భావంబున నీ శరణ్యమనెనో, యాభావ కృపాదృష్టిచే !
నా భావంబుఁ దలంపు నేర్పు కృపసేయం జూడి నారాయణా !

ఈ శతకము బమ్మెర పోతన కృతముగాదా? అను నొక సందేహము మీ వలకుఁ గలుగుచునే యున్ని పద్యములుదాహరింపఁబడినవి మరియుఁ గొందరు విమర్శకు లిందలాక్షణికములును, వ్యాకరణ విరుద్ధములైన ప్రయోగములున్నవని, యందుచే నిది పోతన కృతము కాదని వాదించిరి కాని వారు చూపినవి లాక్షణికకవులవి మనము భావించిన వారికృతులయందును గానవచ్చుచున్నవి పెక్కండ్ర కృతులయందివి సామాన్యములే! నారాయణ శతకమునందలి కొన్ని ప్రయోగముల నిట జూపుచున్నాను

1 ద్రుతమున కద్దుపరంబగునప్పుడు ద్విత్వము ప్రయుక్తముగాట 'ఏడింన్నే తప్పులున్'

ఇది దోషము కాదు నన్నయ భట్టారకుడు 'అన్నిష్మనఖి' అని యిట్టి ద్విత్వము ప్రయోగించి యున్నాఁడు పోతన భాగవతములో 'సర్వ మున్నతని దివ్యకళామయమంచు' అని ప్రయుక్త మైనది (7-142) ఉత్తర హరివంశమున "సర్వాంగువిన్నను భూతా" (6 76) అని కలదు

2 'విహరించిరి ద్రవిరించి శంకర మహా విర్భూతికిన్', 15 వ క్త్వార్థక సంధి
ఈ సంధికి కవిసంశయవిచ్ఛేదమున లక్షణమున్నది

గీ. ఇగాగ వచ్చును క్త్వప్పపై నిత్యసంధి
మాత్ర మొక్కొక్కచోటను మట్టుమీఱఁ
గొలుతునఘమడంప గోరిందుశేఖరు
నన్నయాఖ్యు కవిజనామమతిని (1-14)

3. అత్యంత సామర్థ్యలై. 12 వ

శివనాథుని పర్వతపురాణమున అపాంగ వ్యాప్తలోల క్రియాసామర్థ్యన్ (1-1) చాతుర్యుడు సింగన — ద్విపదభాగవతము దారిద్ర్యుండు — కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశిక యందు ప్రయోగములు గలవు

3 వైరి సమాసములు —
మృగ మీనాకృతి 11 వ
వలుద కుచకుంభములు — నైషధము — 2 95
కొలువ నేత్ర విలాసము — విజయ విలాసము — 2

5. 'ఇరువై యొక్కటి మారు' 16 ప
'ఇరువై నాలుగు మూర్ల మేర' — కాశీ ఖండము 1—9
'నూటిరువై యెనిమిది భేదములను వదలుదురు' — నరస భూపాలీయము 2—50

6 'వరదాసావళి దాసదాసినయి దుర్వారౌఘముల్ జేసితిన్' 88 ప

ఇచట దాసి శబ్దము, దాసుఁడు అనుటకు ప్రయుక్తమైనది "చెచ్చెర కాళిదాసికిని" అని బసవ పురాణమున, "పరమున కేను దసినని పల్కఁగ" అని కుమార సంభవమున ప్రయోగములు గలవు ఇది శివకవులలో పరిపాటియగు పదము

8 కల్గుండు — 76 ప (కల్గియుండును — కలిగియుండుననుటకు)
"కలదన్న వారికి గలిగుండు వాఁడు" బసవ పురాణము

## భోగినీ దండకము

మహాభాగవత రచనకు ముందుగా పోతన రచించిన కృతులలో భోగినీ దండకము ప్రసిద్ధమైనది ఆ కాలమున రాచకొండ సంస్థానమును పరిపాలించుచుండిన సర్వజ్ఞ సింగభూపాలు నొక వేశ్య వలచి, యాతని వలపింపజేసి, తుదకాతనిని పొందిన వృత్తాంత మీ దండకమున నితివృత్తము దండకము తుదినున్న యీ క్రింది పద్యమును బట్టి యిది పోతన కృతమనుట నిశ్చితము —

ఉ ఎండిత కీర్తనీయుఁడగు బమ్మెర పోతన యాసుధాంశుమా
ర్తాండకులాచలాంబునిధితారకమై విలసిల్ల భోగినీ
దండకమున్ రచించె బహుదాన విహర్తకు, రావు సింగభూ
మండల భర్తకున్ విమత మానవనాథ మదాపహర్తకున్

తాను ముందు రచింప బోవు భాగవతమునందు ప్రదర్శించిన యనుప్రాస విన్యాసపు రుచిఁజూపుటకు పోతన యీ దండకమును సమకూర్చియున్నాఁడు అష్టమస్కంధమున వామనుఁడు బలి చక్రవర్తి నాశీర్వదించు ఘట్టమునఁగల యీ క్రింది పద్యముతో పై పద్యమును పోల్చి చూడఁదగు

ఉ స్వస్తి జగత్త్రయీ భువనశాసనకర్తకు, హాస మాత్రవి
న్యస్త నిలింప భర్తకు, నుదారపద వ్యవహర్తకున్, మునీం
ద్ర స్తుత మంగళాధ్వర విధాన విహర్తకు, నిర్జరీ గళ
న్యస్త సువర్ణ సూత్ర పరిహర్తకు దానవలోకభర్తకున్

దండకమున — బహు దానవిహర్త — మదాపహర్త — భూమండల భర్త
భాగవతమున — విధాన విహర్త — స్తోత్ర పరిహర్త — లోక భర్త యను ప్రాసములను
పరిశీలించిన నిది పోతన రచన యనుట స్పష్టము

దండక మధ్య భాగముననున్న యీ క్రింది వాక్యములతోను, భాగవతమున సప్తమస్కంధమున గల పద్యముతోను సరిపోల్చిన నిది పోతనయే రచించినట్లుల స్పష్టమగును

భోగినీ దండకము—

పెంగ భూపాలు పై వ్రాలి నా చిత్తమున్మత్తమై సోలి
కామానలాయత్తమై రాదు, తేరాదు, నేనాపరుండన్నె,
గౌరీ వరుండైన, వాణీధరుండైన దేవోత్తరుండైన
నెవ్వన్ మదిం గోరుగా నొల్లనే ?
ఉల్లసత్ఫుల్ల మందార రాజన్మరందంబునందంబునం గ్రోలు
మత్తాళి దుత్తూరముం గ్రోలునే ?
హేమ రాజీవ రాజీ రజో రాజితాకాశ గంగానదీ లోల
కల్లోల డోలానట ద్రాజహంసంబు శైవాలగండూపదీభేక
భేకీకులీ సంకులాసార కాసారముం జేరునే ?
మండితా ఖండలా నీల జీమూత నిర్యత్పయోధారలన్
ద్రావు సారంగి, కుంభాంతరాంభః ప్రపూరంబులున్ ద్రావునే
మాధవోజ్జాత చూతాంకుర స్వాదులీలాలసత్కోకిలేంద్రంబు
ఝుల్లీవర క్రూరభల్లాత కీశాఖకున్ బోవునే ?

భాగవతము సప్తమస్కంధము 7—160

సీ. మందార మకరంద మాధుర్యమునఁదేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మల మందాకినీ వీచికలఁదూఁగు
రాయంచ చనునె తరంగిణులకు
లలిత రసాలపల్లవ ఖాదియై చొక్కు
కోయిల సేరునే కుటజములకుఁ
బూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరక
మరుగునే సాంద్ర నీహారములకు

తే అంబుజోదర దివ్య పాదార వింద
చింతనామృత పాన విశేషమత్త
చిత్తమేరీతి యితరులఁ జేరనేర్చు
వినుతగుణశీల ! మాటలు వేయునేల ?

దండకమునందలి మూఁడు పాదముల భావములను సీస పద్యమున మూఁడు పాదములుగా వెలసినవి ఈ భావములు చిన్నతనమునందే పోతన పెద్దన్నకిని సోమనాథుని బసవపురాణము నుండి గ్రహించెనని యనువాద ప్రకరణమునఁ దెలుపఁ బోవుచున్నాను

ప్రారంభమునుండి పదునేడు పంక్తులవరకును నిండు ముక్తపదగ్రస్తాలంకారము గలదు

శ్రీమన్మహామంగళాకారు, నాకార లక్ష్మీ కుమారున్
కుమారీ మనోరాము, రామాంబరీషాది రాజన్యరాజ
ద్యశఃకాముఁ, గామాహిత క్షీర వారాశి తారేశ వాగీంద్ర
నాగేంద్ర మందార విందారకుంద్రాభకల్లోలినీ కాశ విఖ్యాత
సత్కీర్తి ముక్తావళీ భూషితాశాంగ నాలోక సీమంతు
సీమంతినీ మానసారామవాటీవసంతున్, వసంతావనీ
నాథ సంసేవితాంచత్పదాంభోజు .
సింగ భూపాలు, భూపాల గోపాల గోపాలికా కృష్ణ గోపాలు గోపాల దేవోత్సవ క్రీడలో

ఇట్లే మొదలునుండి తుది వరకు నొకే రీతిని మనోహర పద విన్యాసముతో నొప్పుచుండును

ఈ దండకమునందు ప్రస్తుతుఁడైన రాజు సర్వజ్ఞ సింగ భూపతి రేచర్ల వంశీయుఁడు ఈతఁడు పోతన జన్మ స్థానమైన బమ్మెరకు కొలది దూరమున నున్న రాజాచలము అని పేరుగన్న రాచకొండ సంస్థానాధీశుఁడు ఈతనికి, వసంతావనీనాథుఁడను సోదరుఁడు గలఁడు ఈ వంశీయులలో ముచ్చురు రాజులు సర్వజ్ఞ సింగముఁడను పేరుతో నున్నను, వసంతావనీ నాథ సోదరుఁడు భోగినీదండక కృతిపతిగావునను, నాతఁడు క్రీ శ 1430—1470 ప్రాంతములఁ బరిపాలించె గావునను పీ కృతి క్రీ శ 1430 కి తరువాత పుట్టి యుండునని నిశ్చయింప వచ్చును

ఆంధ్ర వాఙ్మయమున విశిష్టమైన శాఖలతో 'దండకములు' అను శాఖ యొకటి సంస్కృత భాషలోగాని, ద్రావిడ, కర్ణాట,మళయాళ దేశభాషలలోగావి తెనుఁగు భాషలోనున్నన్ని దండకములు లేవు. ఈ దండక శాఖలో పోతన భోగినీదండకమునకు నొక ప్రత్యేక విశిష్ట స్థానమున్నది. ప్రాధాన్యతయు నున్నది

దండకము తొలుత దైవ స్తుతి పరముగానే సంస్కృతమున వెలసినది తెనుఁగున, నన్నయ భట్టారకుఁడు భారతమున నారణ్య పర్వమున, కిరాతార్జునీయ ఘట్టమున నీశ్వరస్తుతిని దండకముగానే రచించి యున్నాఁడు తెనుఁగున మొదటి దండక మిదియే నన్నయ వెనుక శివకవు లెవ్వరును, దండకమునుపయోగింప లేదు తిక్కన, యెఱ్ఱనలు నుపయోగింప లేదు ఆ వెనుక శ్రీ నాథాది కవీశ్వరులు తమ యా సందర్భములలో దండకములు రచించిరి పోతనయు వీరభద్రవిజయమున, భాగవతమున దండకములను రచించియే యున్నాఁడు భాగవతమున అక్రూర దండకము బహుళ ప్రచారమును బడసినది [1]

కాని పై దండకములన్నియు గ్రంథాంతర్గతములు అనఁగా, నాయా కావ్య ప్రబంధముల యందుపయుక్తములైన ఛందస్సులలో నదియు నొకటి గ్రంథముతో సంబంధించియే యుండును గాని వేరు కాదు ఇక భోగినీ దండక విశిష్టతఁ దెలిపెదను

మఱొక గ్రంథముతో సంబంధము లేకుండ ప్రత్యేక గ్రంథ రూపమున వెలువడిన దండకములలో భోగినీ దండకము మొదటిది ఆ నాటినుండియు దండక మొక ప్రత్యేక రచనా ప్రక్రియగా నేర్పడుటచేత, నిది భోగినీ దండకము యొక్క ప్రథమ విశిష్టత

ప్రత్యేక రచనతో దండకము యొక్క ప్రధాన లక్షణమైన స్తుతి రూపక సంప్రదాయమునకు భిన్నముగా, నితివృత్త సంప్రదాయము ప్రారంభమైనది అనఁగా దైవ స్తోత్రముచేయు సందర్భమునందే యుపయుక్తము కాదగిన యీదండకము, మానవ సంబంధమైన సన్నివేశములను ప్రపంచించుటకు నుపయుక్తమైనది దీనికిని భోగినీ దండకమే మొదటిది ఇందలి యితి వృత్తము రాజునకును, వేశ్యకును జరిగిన సమాగమము ఇట్టి స్వల్పమైన సన్నివేశములే, యీ వెనుక వాఙ్మయమున ననేక సన్నివేశములు గల కథలు కూడ దండకములలోఁ జెప్పుటకు దారి తీసినవి. స్తుతి ప్రధానమగు దండకమును, ప్రత్యేక నిర్దిష్ట సన్నివేశ కథా ప్రధానముగా జేయుట భోగినీ దండకమునందలి రెండవ విశిష్టత

మూఁడవది యన్నింటికన్న ముఖ్యమైనది కేవలము భక్తి ప్రపత్తికై యుపయుక్తమై, భక్తిరస ప్రవణమగు దండకమును శృంగార రస పరముగా సంతరించుట భోగినీ దండకమునకు ముందుగల దండకములన్నియు భక్తిపరములే. శృంగార రస పరమగు దండకము లేదు కావున దండకమంతయు శృంగార రసపరముగా రచించుటకు ప్రాతిపదిక, పోతన కృతియే. భోగినీ దండకము వెనుకనే శృంగార దండక రచన ప్రారంభమై, దాక్షిణాత్యాంధ్ర వాఙ్మయమున, నతివేలమైనది.

---

1 దండకముల పుట్టు పూర్వోత్తరములను గూర్చి, వాఙ్మయమును గూర్చి, పరిశోధన సంచికలో నేను వ్రాసిన "దండక వాఙ్మయము" అను వ్యాసమును జూడుఁడు

భోగినీ దండకము నాందిగా వాఙ్మయమున వెలసిన కొన్నిశృంగార దండకములను పేర్కొనుట యప్రస్తుతము గాదు

మూల గ్రంథమునుండి వెలువడిన ప్రత్యేక రచన యగుటచే నట్టిదండకమును రచించిన కవులు తమ కర్తృత్వమును దెలుపుట యావశ్యకమయ్యెను ఇందుచేతనే పోతన, పండిత కీర్తనీయుడగు బమ్మెర పోతన యని, తన పేరును, "భోగినీ దండకము" అని దండకము పేరును ప్రత్యేక పద్యమునఁజెప్పియున్నాఁడు ఈ పద్ధతికిని పోతనయే ప్రాథమికుఁడు. పోతన తరువాత కొందరీ నియమమును పాటించి, పద్యమే వ్రాసియున్నారు కాని యా వెనుక దండకము యొక్క చివర భాగమున నా వృత్తముననే మరి కొందరు, తమ నామధేయములను ననుసంధించి యున్నారు. భోగినీ దండకము వెనుక శృంగార దండకములనేకములు వర్ధిల్లినవి [1]

*శృంగార దండకము — తాళ్లపాక పెదతిరుమలాచార్యులు శ్రీ వెంకటేశ్వర స్వామికిఁగృతి దండకాంతమున

ఉ. సన్నుతి తాళ్లపాక పురశాసనుఁడన్నయ తిమ్మనార్యుఁడ
త్యున్నతిఁ జెప్పె దండకము దుగ్ధ పయోనిధి కన్యకారతి
స్విన్న మృగీమదాంకునకు వేంకట భర్తకు నిత్య భోగనం
పన్నన కారవిందుకులపర్వత తారకమై చెలంగగాన్

ఇట్లే శృంగార రస ప్రధానమగు భల్హాణ దండకము చివర, కర్త్కర్త యిట్లు చెప్పియున్నాఁడు —

ఉ. రాణఁదలిర్పఁజెప్పి, రఘు రాముస కంకిత మిచ్చినాఁడ భ
ల్హాణ చరిత్ర దండక మలక్ష్యము సేయఁగఁబోకుఁ డాంధ్ర గీ
ర్వాణ రసజ్ఞులైన కవి వల్లభులార ! పరీక్ష సేయుఁడ
క్షీణ పదార్థ గర్భ రస సిద్ధనుదీయ కవిత్వ తత్త్వమున్

శ్రీ కాళహస్తీశ్వర దండకము — శ్రీ కాళహస్తీశ్వర మహాత్మ్య కృతికర్త ధూర్జటి మనుమఁడు ధూర్జటి రచించినది ఇది శృంగార పరమైనది. ధనైకలుబ్ధయగు తల్లిని ప్రతి ఘటించి యొక వేశ్య శ్రీ కాళహస్తీశ్వరునిఁబొందుట యిందలి యితివృత్తము

---

[1] కథా ప్రధానములైన దండకములలో నడిమింటి రామజోగి (18 వ శతాబ్ది) విరచితమైన భల్హాణ దండకము చాల ప్రసిద్ధమైనది ఆరేండ్ల క్రింద శ్రీ కలుగోడు అశ్వత్థ నారాయణ రాయ మహాభక్తులు, రామాయణ కథనంతయు, దండక రామాయణమను పేర రచించి యున్నారు. తెనుఁగుబాసలో నింతవరకు దండక రామాయణముకన్న పెద్ద రచన యాంధ్రభాషలో లేదు

"మరందావళిన్ మాధురీ సాధు రీతిన్ రచించెన్ ప్రియావల్లికీ భాతిచేతో భవారాతిపై మార్జి శృంగార మీదండకంబాంధ్ర భాషా కవి గ్రామణిన్ ధూర్జటి ప్రఖ్యుడన్"

భోగినీ దండకము పోలిక దక్షిణాంధ్ర వాఙ్మయమున పెక్కులు వెలువడినవి. రాజు వాహ్యాళి వెడలుట, అతని చూచి యొక వేశ్య మోహించుట, విరహ విప్రలంభము, కలయిక, యిందలి యితి వృత్తము వానిలో ముఖ్యమైన వానిని మాత్రమే పేర్కొందును

విద్యావతీ దండకము — గణపవరపు వేంకటకవి కృతము మధురాపురాధీశ్వరుడగు ముద్దళగిరీంద్రునిపై విద్యావతి అను వేశ్య వలపు గొనుట గ్రంథాంతమున పంక్తులీ దండక ప్రశస్తిని వివరింపగలవు

"కళాభోజ పేరన్, జయోదాత్తముద్దళ్గిరిక్ష్మాతలాధీశు పేరన్, వృషాద్రీశ సంకాశు పేరన్, మహాలక్షణగ్రంథ' భాషాభిధాన ప్రథామాధురీ సాధురీత్యర్థవచ్ఛబ్దబంధాను బంధ ప్రబంధాది నాథప్రియామాత్యరాడ్వేంకటార్య ప్రణీతంబుగాఁ బొల్చు నా పుష్ప కోదండకంబైన విద్యావతీ దండకంబుర్వినాచంద్ర తారార్కమై యొప్పు." 1

మోహినీ దండకము — అల్లాడ విజయ భూపతి పరముగా రచితమైన శృంగార దండకము. అముద్రితము

బృహన్నాయికా దండకము — మహోద్దండ కవి సుదురుమాటి వేంకనార్య ప్రణీతము. రాయ రఘునాథుని గూర్చిన శృంగార దండకము

చంద్రాననా దండకము — వేంకనార్యుని కొడుకు సాంబశివ కవి రచితము. భోగినీ దండకమును పోలినది రఘునాథ తొండమాన్ పుత్రున కంకితము.

చంద్రాననా దండకము — చిదానంద కవి రచితము. ఇతడు వేంకన కవి పౌత్రుడు. రామచంద్ర తొండమాన్ రాజున కంకితము.

---

1 గణవరపు వెంకటకవి కాల నిర్ణయమున కనుకూలించు నీదండకమును నేను క్రీ శ 1949 లో ప్రకటించితిని ఇది 360 పాదములు గల పెద్ద దండకము

# 5. ఆంధ్ర భాగవతము

## స్కంధ విభాగ పరిశీలనము

తెలుఁగు దేశమున భాగవతమనగా పోతన భాగవతమనియే వాడుక నేడు మనకు లభ్యమగుచున్న భాగవతమంతయుఁ బోతన కృతము కాకున్నను నా గ్రంథమున విశేష భాగము రచించిన కవి పోతనయే యగుట చేత, దానిని పోతన భాగవతమని వ్యవహరించుట సమంజసమే యగుచున్నది రామాయణ రచనలో ప్రసిద్ధికెక్కిన భాస్కర రామాయణమును, భాస్కరుఁడు కాక కొందరు కవులా గ్రంథ భాగములు రచియించినను ఎందు ప్రధానుఁడు భాస్కరుఁడే యగుట చేత 'భాస్కర రామాయణము' అని లోకమున వాడుక కెక్కినది అట్లే గంగన, సింగన, నారయ అను కవులు భాగవతములోని కొన్ని స్కంధములు రచియించి యున్నను పోతన రచియించిన స్కంధములు వాని యన్నింటికన్న నన్ని విధముల మిన్నయై యుండుటచే పోతన భాగవతము అనుటయు సరసమే ముద్రితమైన భాగవతమున నేయే స్కంధములెవరెవరిచే రచియింపఁబడినవో చదువరులకు సుగమ మగునట్లు క్రింద వానిని వివరించుచున్నాను

| స్కంధము పేరు | | ఆశ్వాస సంఖ్య | కవి పేరు | గద్య పద్య సంఖ్య | |
|---|---|---|---|---|---|
| 1 | ప్రథమస్కంధము | | పోతన | | 529 |
| 2 | ద్వితీయస్కంధము | | పోతన | | 289 |
| 3 | తృతీయస్కంధము | | పోతన | | 1055 |
| 4 | చతుర్థస్కంధము | | పోతన | | 977 |
| 5 | పంచమస్కంధము | ప్రథమాశ్వాసము | గంగన | 183 | |
| | | ద్వితీయాశ్వాసము | ,, | 168 | 351 |
| 6 | షష్ఠస్కంధము | | సింగన | | 530 |
| 7 | సప్తమస్కంధము | | పోతన | | 482 |
| 8 | అష్టమస్కంధము | | పోతన | | 744 |
| 9 | నవమస్కంధము | | పోతన | | 736 |
| 10 | దశమస్కంధము | పూర్వ భాగము | పోతన | 1790 | |
| | | ఉత్తర భాగము | | 1342 | 3132 |
| 11 | ఏకాదశస్కంధము | | నారయ | | 127 |
| 12. | ద్వాదశస్కంధము | | నారయ | | 53 |
| | | | | | 9005 |

పై వివరణమును జూచిన తొమ్మిదివేల య్యైదు గద్యపద్యములు గల భాగవతమున వేయి యిరువది యొక్క గద్యపద్యములు మాత్రమే యితరులు రచియించినట్లు స్పష్టము. ఆ గ్రంథమున పండ్రెండు స్కంధములలో నెనిమిది స్కంధములు పోతన రచితములు. తక్కిన నాలుగును నితరులచే రచితములు. స్కంధాంత గద్యములును పై విషయమును నిర్ణయించుచున్నవి.

పోతన గద్య — ఇది శ్రీ పరమేశ్వర కరుణాకలిత కవితా విచిత్ర కేసన మంత్రి పుత్ర సహజ పాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన శ్రీ మహా భాగవతమను మహాపురాణంబునందు

గంగన — ఇది శ్రీ సకలసుకవి జనానందకర బొప్పయామాత్య పుత్ర గంగనార్య ప్రణీతంబైన శ్రీ మద్భాగవత మహాపురాణంబునందు కథలు గల పంచమస్కంధంబున ప్రథమాశ్వాసము

సింగన — ఇది శ్రీ సకల సుకవి జనమిత్ర, శ్రీవత్స గోత్ర పవిత్ర కసువయామాత్య పుత్ర బుధజన ప్రసంగానుషంగ సింగయనామధేయ ప్రణీతంబైన శ్రీ మహాభాగవత పురాణంబునందు షష్ఠస్కంధము

నారయ — ఇది శ్రీ పరమేశ్వర కరుణా కలిత కవితా విచిత్ర కేసన మంత్రి పుత్ర సహజ పాండిత్య పోతనామాత్య ప్రియశిష్య వెలిగందల నారయ నామధేయ ప్రణీతంబైన శ్రీమహా భాగవతమను మహాపురాణంబునందు ద్వాదశస్కంధము

నారయ గద్యయందు పోతనామాత్య ప్రియ శిష్యుడనని చెప్పుకొనుటచేత నాతడు పైయిరువురకన్న పోతనకు సన్నిహితుడని తెలియుచున్నది.

భాగవత ప్రారంభము —

శా॥ శ్రీ కైవల్య పదంబుఁజేరుటకునై చింతించెదన్ లోకర
క్షైకారంభకు, భక్తపాలన కళా సంరంభకున్, దానవో
ద్రేకస్తంభకుఁ గేళిలోల విలసద్దృగ్జాల సంభూతనా
నాకంజాత భవాండకుంభకు మహానందాంగనాడింభకున్

అని కృష్ణపరముగా నున్నది. ఆ వెనుక షష్ఠ్యంతములు నాలుగు పద్యములును కృష్ణ పరములు గానే యున్నవి. మఱియును,

ఉ. న్యాయికి, భూసురేంద్రమృతవందనదాయికి, రుక్మిణీమన
స్థాయికి, భూత సమ్మద విధాయికి, సాధుజనాను రాగ సం
ధాయికిఁ బీతవస్త్ర పరిధాయికి, పద్మభవాండ భాండ వి
ర్మాయికి గోపికా నివహ మందిర యాయికి శేషశాయికిన్

పోతన భాగవత ప్రారంభమున కృష్ణుని స్తుతించినను, స్కంధాంతమున పద్యములను శ్రీరామ పరముగాఁజెప్పెను

మాలిని అనుపమగుణహారా ! హాస్యమారారి వీరా
జన వినుతవిహారా ! జానకీచిత్తచోరా !

తక్కిన ద్వితీయాదిస్కంధాద్యంతంబులయందు శ్రీరామ పరముగానే పద్యములు గలవు వానిలో దశమస్కంధప్రారంభమున నున్న

క. శ్రీ కంఠ చాప ఖండన
పాకారి ప్రముఖ వినుత భండన ! విలస
త్కాకుత్స్థ వంశ మండన
రాకేందు యశోవిశాల ! రామనృపాలా !

అను పద్యమాంధ్రులందరకుఁబరిచితమైనదే

గంగనయు, సింగనయు తమ రచనలలో నాద్యంతములు కృష్ణ పరములుగాఁజెప్పియున్నారు. నారయ మాత్రము పోతన వలె రామపరములుగాఁ జెప్పియున్నాఁడు ఇది తెలుఁగు భాగవత గ్రంథ వివరణము

ఇట్లు వేర్వేరుగా, విస్పష్టముగా, స్కంధాంత గద్యలాయాకవుల రచనలని చాటుచున్నవి ముద్రిత ప్రతులయందే గాక వానికి మూలములగు తాళపత్ర గ్రంథములందును నీ గద్యలిట్లే యున్నవి అయినను భాగవతములో శైథిల్యము, గ్రంథ పాతము గలదని యీ క్రింది రెండు కథలు వాడుకలో నున్నవి

## శైథిల్య గ్రంథపాత విమర్శ

1. పోతన భాగవతమును పూర్తి చేసి, యది పామరులకు లభ్యంబైన దాని గౌరవము నశించునని దేవతార్చన పేటికయందుంచి, తన కుమారుఁడగు మల్లనకు నాపేటిక భద్రముగా-

గాపాడుమని చెప్పి కాలధర్మము చెందెను కొంత కాలమునకు మల్లన యా పేటికను దెరచి చూడ నందు కొంత భాగము క్రిమిదష్టమై శిథిలమై నష్టమై యుండెను దానిని చూచి పోతన శిష్యులు వెలిగందల నారయ మొదలైన వారా నష్ట భాగములను పూరించిరి

దీనిని మొదట గ్రంథస్థము చేసిన వారు భాగవత ప్రథమ ముద్రణకర్తలగు పురాణము హయగ్రీవ శాస్త్రిగారు ఈ ముద్రణ క్రీ శ 1848 నాటిది

2. రెండవ కథ కవి సార్వభౌముఁడగు కూచిమంచి తిమ్మకవి గ్రంథస్థము చేసినది ఆతఁడు సర్వలక్షణసారసంగ్రహము అను లక్షణ గ్రంథమున నీ విషయమై యిట్లు చెప్పియున్నాఁడు

సీ ఘనుఁడు పోతన మంత్రి యను భాగవతమును ర
చించి చక్రికి సమర్పించు వేళ
సర్వజ్ఞ సింగయక్ష్మాపతి యుండి ద
క్కిమ్మని పేర్మి నీయకున్న
నలిగి యా పుస్తకం బవనిఁ బాతించిన
బిపికి యందొక కొంత శిథిలమయ్యెఁ
గ్రమ్మరనది వెలిగందల నారయ
రాజును మరి బొప్పరాజు గంగ

గీ రాజు మొదలగు కవివరుల్ తేప మొసఁగఁ
జెప్పిరా గ్రంథముల యందె దప్పులోదవెఁ
గాని పోత కవీంద్రుని కవనమందు
లక్షణం బెందు దప్పునా దక్షహరణ

ఈ గ్రంథ రచన క్రీ శ 1740 లో జరిగినది ఇందు పోతన తనకుఁ గృతి నీయనివాఁడగుట చేత, సింగమనీఁడు కోపించి, యాతని భాగవతమును పాతి పెట్టించెననియు, నా కారణమున నందు కొంత భాగము శిథిలమైనదనియు, వెలిగందల నారయాదులు పూరించిరనియుఁ దెలియఁబడినది మరియు, నట్టి యితర కవి పూరణముల రచనలలోనే, లాక్షణిక దోషములున్నవి గాని పోతన కవిత యందెంతమాత్రము లేవని తిమ్మకవి సిద్ధాంతీకరించియున్నాఁడు

మొదటి కథ నంతగా విమర్శకులు పాటింప లేదు రెండవ కథను మాత్రము ప్రామాణికము గనే గ్రహించిరి ఏలయన, సర్వజ్ఞ సింగ భూపాలునికి పోతనకు భోగినీ దండకము మూలముగా సంబంధము కలదన్న విషయమందరెఱింగినది కాని యీ క్రింది యుపపత్తులచే నీ కథ కల్పితమని తెలుచున్నది

1 భాగవత గ్రంథ శైథిల్య వృత్తాంతము చెప్పిన వాడు వెలిగందల బొమ్మకవి యని పై వ్రాత వలన స్పష్టము. కాని యిప్పటివరకు ముందు క్రీ॥ 1656 లో వ్రాసిన కకుత్థ్సవిజయకర్త అప్పకవి భాగవత శైథిల్యము విషయమై యేమియుఁదెలుప లేదు ఒకడు భాగవతమును గూర్చి చెప్పినది పేరును కేవలము లక్షణయుసునుంగూర్చినది మాత్రమే

ఉ. బమ్మెర పోతరాజు కృతి భాగవతంబు సలక్షణంబుగా
కిమ్మహి నేమిటం గొదువ యెంతయు వారసి చూడగాను రె
ఫమ్ములు రాలుసుంగలిపి ప్రాసములైనవి లాదిసం గదా
యమ్ములవాది లాక్షణికు లెన్నరు మాని రుదాహరింపఁగన్.

కాబట్టి క్రీ॥ 1656 ప్రాంతమున భాగవత శైథిల్య ప్రస్తావనయే లేదనుట విశ్వయము

2. క్రీ॥ 1580 ప్రాంతమున నున్న పోతన మునిమనుమలు వేసన మల్లన కవులు, దాక్షాయణీ పరిణయము, విష్ణు భజనానందము అనుకృతులు రచించిరి వారు బమ్మెర పోతనను పితామహునిగా స్తుతించిరి. మరియు వీరి తండ్రి కవితా పాండిత్యము చేత, 'ప్రౌఢ సరస్వతి' యను పేరుగాంచినవాఁడు పోతని యల్లుఁడజ్జరవు పేరయ లింగయ ప్రౌఢకవి. వీరెవ్వరును భాగవత శైథిల్యమును గూర్చి గాని గ్రంథ పాతముఁగూర్చిగాని యేమియుఁ జెప్ప లేదు కావున వారి కాలమునకు నేఁడున్నరీతిగా భాగవతముండెడిదనియు, గ్రంథ పాతములు లేవనియుఁ జెప్ప వచ్చును.

3 పై రెండింటికన్న ముఖ్యమైనది, మూఁడవది పంచమస్కంధ రచయిత గంగన కాని, షష్ఠస్కంధ రచయిత సింగన కాని,ఏకాదశ ద్వాదశ స్కంధ కర్త నారయకాని, యీ గ్రంథ శైథిల్యమును గూర్చి యేమియుఁజెప్పలేదు గంగన నారయలిద్దరును స్కంధ ప్రారంభమున పోతన వలె కంద పద్యములనే వ్రాసిరి. ప్రత్యేక రచన వలె, కృతిపతి స్తుతి ప్రారంభముతో నాశ్వాసాంత గద్య పద్యములతో నాయా స్కంధములను రచించిరి. స్కంధాంతమునకైన, నీ విషయము తెలిపియుండ లేదు. ఇక షష్ఠస్కంధము సింగన పోతన వలె కృత్యవతారికతో ప్రారంభించి, తనకు ప్రత్యక్షమైన వాణి యా దేశమున షష్ఠస్కంధము రచించినట్లు చెప్పియున్నాఁడు

"సమర్పితంబుగ నా యొనర్పంబూనిన షష్ఠస్కంధంబునకుఁ గథా ప్రారంభక్రమంబెట్టి దనిన" (37 వ వచనము) ఇందుచేత సింగన రచన స్వతంత్ర రచనయే కాని శిథిల పూరణము కాదనుట స్పష్టము.

శైథిల్య సూచన లేమిచే కృత్యాది లేకున్నను, గంగన నారయ రచనలు స్వతంత్రములే యనుట నిర్వివాదము

4 పై రెండు కథనములందలి గ్రంథము చాల పెట్టించుటయే నిజమైన యెడల, పంచ్రెండు స్కంధములకొకే సంపూర్ణముగా సమకూర్పబడియున్నప్పుడు, తక్కినవి సరిగ నుండి పంచమ, షష్ఠ, ఏకాదశ, ద్వాదశ స్కంధములు మాత్రమే శూన్య తప్పుటుండ, ఆదినుండి అంతము వరకు నొకే రీతిగా నెట్లు శిథిలములైనవో దేవునికే యెఱుక !

5 పోతన రచితములైన స్కంధములే శిథిలములైన యెడల నవి పోతన నిర్యాణ కాలము నకుఁ గొంచెము వెనుకనే సింగన నారయలు పూరించినచో, వెనువెంటనే నాయా స్కంధములను నితర కవులెల ప్రత్యేకముగా రచింప వలసి వచ్చెనను ప్రశ్న మన సాహిత్య విమర్శన లోకమున నుదయించ లేదు.

షష్ఠస్కంధము సింగన కాక, హరిభట్టును, శృంగార షష్ఠమను పేరనంది మల్లయ్యయును సింగయ కవులును, మఱియు మారుతము సర్వన్నయు రచించి యున్నారు. వీనిలో చివర రెండును లభ్యములు లేవు. హరిభట్టు రచనము మాత్రము లభ్యమగుచున్నది. ఇక నేకాదశ ద్వాదశ స్కంధముల ప్రత్యేక రచన హరిభట్టునాటినుండి నేటి వరకు సాగుచునే యున్నది. ఇంకొక విశేష మేమనగా, తాళపత్ర ప్రతులలో పెక్కింటియందు, సింగన నారయల రచనలకు బదులు, హరిభట్టారకుని షష్ఠస్కంధ ఏకాదశ ద్వాదశ స్కంధములు కన్పట్టుచున్నవి. ఈ ప్రత్యేక రచనలు నిర్వివాదముగా పోతన నీ స్కంధములను రచింపనే లేదనియు, శిథిల పూరణ ప్రస్తావన యసత్యమనియు సిద్ధాంతీకరింప వచ్చును. భాగవతము శిథిలము కాలేదు నారయాదులు పూరించనులేదు.

పై రెండు విధముల ప్రతిపాదనలును, నిర్హేతుకములని నిరాధారములని గ్రంథస్థ ప్రమాణములను బట్టి కూడ నిర్ణయింపనగును.

భాగవతము ద్వితీయస్కంధమున గల యీ క్రింది పద్యమును నప్పకవి చతుర్థాశ్వాసమున నుదహరించి యున్నాడు [1]

ఉ. సర్వ ఫల ప్రదాతయును సర్వ శరణ్యుఁడు, సర్వ శక్తియున్
సర్వ జగత్ప్రసిద్ధుఁడును, సర్వ గుణాఢ్యుఁడు నైన చక్రి యా
సర్వ శరీరులన్ విగత సంగతిఁజెంది విశిష్యమాణులై
పర్వినచో నఖిలము గతి బ్రహ్మముఁదాఁబొడకుండు నెప్పుడున్.

---

1 భాస్కర రామాయణ భాగములను, భారతారణ్యపర్వశేషమునుండి పద్యముల నుదాహరించు నప్పు డప్పకవి స్పష్టముగా నాయా భాగ రచయితలను పేర్కొన్నాడు

ఉపోద్ఘాతములను గూర్చి చెప్పు సందర్భమున నవ్వకవి 'ఆకాశము నెట్టనై నందులకు భాగవతము ద్వితీయ స్కంధమునందు" (4—69) లని పై పద్యము నుదాహరించియున్నాడు ఈ పద్యము నేడు భాగవతమున, "ఇటునుండి వెలిగందల నారయ కవిత్వము" అను శీర్షిక క్రింద నున్నది. నారయ కవిత్వము 93 వ పద్యముతో ప్రారంభమగుచున్నది అప్పకవి యుదాహరించిన పద్య సంఖ్య 210 కావున పై పద్యము నారయ కవిత్వమున చేర్చబడుచున్నది ఇది వెలిగందల నారయ కృత భాగము కాదనియు, అప్పకవి నాటి తాళపత్ర ప్రతులలో నున్న యొడల నాతడట్లే దానిని యుదాహరించి యుండును కాబట్టి అప్పకవినాటి తాళపత్ర ప్రతులలో "నారయ కవిత్వము" అను మాటయే లేదని మనము నిశ్చయించ వచ్చును

6. భాగవత రచనను గూర్చి పై కథలు వ్యాప్తిలోనికి వచ్చిన వెనుక, భాగవత తాళపత్ర ప్రతుల యందు నీకథల కనుగుణముగా కొన్ని మార్పులు, చేర్పులు జరిగినవి అందు ప్రధానమైనవి రెండు ఘట్టములు

ద్వితీయస్కంధమున నారదుడు బ్రహ్మతత్త్వోపదేశము చేయు సందర్భమున

"ఉ. ఒట్టి యనంత శక్తి జగదాత్ముని నాభి సరోజమందు నే
ఒట్టి . . యుపాయము నా మనంబునన్" 2—93

అను పద్యము పైని "వెలిగందల నారయ కవిత్వ ప్రారంభము" అని కొన్ని తాళపత్ర ప్రతులయందు ఉండుట చేత, భాగవత ప్రథమ ముద్రణమున నట్లే ముద్రితమైనది తరువాతి వారు దాని ననుసరించిరి ఈ స్కంధాంత గద్య పోతన పేరనే యున్నది

ఇట్లే తృతీయ చతుర్థ స్కంధములు, పోతనపేరుతో గద్యలున్నను వానియందు చాలభాగ ములుత్సన్నములైనవనియు, నారయ పూరించెననియు పూర్వపీఠికలయందు వ్రాయబడి యున్నది

దశమ స్కంధోత్తర భాగమున శ్రీకృష్ణుడు కేళీగృహమున రుక్మిణితో సరసోక్తు లాడుట యనుఘట్టము —

సీ. వాటిక నెరయంగఁగన్నిటి వందలై
కుచకుంభయుగళ కుంకుమము దడియు — అను పద్యము237 వ మొదలు

స్కంధాంతమువఱకు నారయ కవిత్వమని కలదు గద్య పోతన పేర నున్నది

పై చేర్పులను సమర్థించుటకు, నీ క్రిందియుపపత్తి ప్రధానముగా జూపబడుచున్నది

"ఈ భాగమంతయు పెక్కు భాగములు గావున నివిపరపూరితములు ఏ ఒక కవియందుండ కన్పట్టని, యలాక్షణిక ప్రయోగములు, రేఫ శకట రేఫ సాంకర్యము, దుష్ట సంధులు, మొదలగు భాషా దోషములీ భాగములనే కన్పట్టుచున్నవి. వెలిగందల నారయ కవిత యందిట్టివి గానవచ్చుచున్నవి కాన నివియును నాతనిచే రచింపబడినవి"

భాగవతదశమస్కంధోత్తర భాగమున, నేటి ముద్రిత ప్రతులలో 237 పద్యమునుండి, నారయ కవిత్వమని కూడు. ఉత్తర భాగమున 1338 గద్య పద్యములు గలవు దీనినిబట్టి నారయ 1100 గద్య పద్యములు వ్రాసినట్లేర్పడుచున్నది కాని యీ భాగమునందలి బాణాసుర యుద్ధ కథ, షోడశ సహస్ర సంగత శ్రీ కృష్ణుని మహిమ, కుచేలోపాఖ్యానము పోతన రచితములు గాక, వేరొక కవి రచనములెట్లు మాత్రము గావని, ముఖ్య కుచేలోపాఖ్యానమే నిరూపింపగలదు పోతనగారు వ్రాసిన విమర్శకులందఱును, కుచేలుని దారిద్ర్యావస్థను వర్ణించునపుడా వర్ణన పోతన యనుభవ పూర్వకముగ వ్రాసినదో యని యేకగ్రీవముగా నంగీకరించియున్నారు. ఇంతియే కాక, నీ భాగమున గల రచనలు — స్పష్టముగా పోతన రచనలని నిరూపించిన దానికి— భేదమణు మాత్రమైన లేదు

1. పోతన కవనమునకు ముఖ్య లక్షణమగు నంత్యనియమమీభాగమున గానఁగుట

సీ. ఇందీవరశ్యాము, వందిత సుత్రాము
కరుణాలవాలు, భాసుర కపోలు దశమ-ఉత్తర (979) అను పద్యమే కాక

సీ. నవపద్మలోచను భవబంధమోచను
భరిత పబాపాలు దురితదూరు దశమ-ఉత్తర (747) అను రచనలు గలవు

2. సంస్కృత సమాన భూయిష్ఠములగు గద్య రచనలును పోతన కృతములే కాని వేరుకావు

3. కచాకర్షణలు (330), నిర్వాణమూర్తియన (1049) చాల (327) మిథిలను పురము (1177) నిర్మలి నాకుతన్నులిన్ (307) ఇత్యాది రచనలన్నియు పోతనవియే యనియు, నివి శివకవుల భాషా సంప్రదాయాను సారముగ లాక్షణికములే యనియు పోతన శైలి సందర్భమున వివరించితిని.

కనుక వివాదమంతయు నప్రస్తుతము — 8 స్కంధములు నిస్సందేహముగా పోతన రచనలు.

## అన్యకవి కృత స్కంధరచన - హేతువులు

[illegible] కాదశ ద్వాదశము[illegible] [illegible] రచించినట్లు చూపితిని [illegible] తొలినుండియు విడిచి యుం[illegible] [illegible]

భాగవతములోని [illegible] స్కంధములు [illegible]ప్రతిపాదకములు. షష్ఠ స్కంధ [illegible] స్కంధము[illegible] దశమస్కంధాంతము వరకు గల భాగమంతయు [illegible] భక్తిరస[illegible] [illegible] పోతన [illegible] కవితా [illegible] [illegible] భక్తిరస [illegible] [illegible] తాత్త్విక వివరణ [illegible] జీవ [illegible] [illegible] రీతి [illegible]

## భాగవత రచనాక్రమము

మన యాంధ్ర భాషయందు గల మహాగ్రంథములలో భారత, భాగవత, రామాయణములు ముఖ్యములు. ఈ మహాగ్రంథములొక్కే చేతి మీఁదు యొకే కవి రచియించుట కష్టమగుట చేత ననేకులచే రచితములైనవి భారతము మువ్వురు కవుల చేతను, భాగవతము నలువురు కవుల చేతను, భాస్కర రామాయణమైదుగురు కవుల చేతను రచితమగుట మనమెఱింగినదే పోతన భాగవతము రచియింపఁదలంపు గొని తాను గ్రంథ మెపుడు ప్రారంభించి, తొలినాలుగు స్కంధములు రచియించి, యావెనుక భక్తి రసప్రధానములగు సప్తమాష్టమ నవమ స్కంధములను తానే రచియింపఁదలచి, మధ్యస్కంధములలో గంగనకు పంచమము, సింగనకు షష్ఠము, విచ్చి యుండవలెను. గంగన పంచమ స్కంధాదిని కృత్యాది వ్రాయక పోయినను గద్యయందాతని పేరుండుటయు, కవితారీతియుభేదముగ నుండుటయు పోతనవలె, నద్వైత మతాను సారముగ రచించుటయుఁ జూడగా నీతఁడు స్కంధమాది నుండి ప్రారంభించినాడని తెలియఁగలదు.

ఇక షష్ఠస్కంధమున సింగన కృత్యాదియే, పోతన ననుసరించి వ్రాసిన వాఁడగుటు చేత నీతఁడు స్కంధాదినుండి ప్రారంభించెనని స్పష్టమగుచున్నది పోతనను స్తుతించు పద్యమున నాతనిని "భాగవత వైష్ణికుడై తగువాని" అని ప్రశంసించి యున్నాఁడు దీనికి రెండు విధములుగ నర్థము చెప్ప నగును ఒకటి భాగవతులాచరించు నిష్ఠతో ననగా భాగవత ధర్మానుసారియై జీవితము

# 6. ఆంధ్రీకరణవిధానము

సంస్కృత భాగవతమున పన్నెండు స్కంధములును, మూడు వందల యిరువదిరెండధ్యాయములును, పదునెనిమిది వేల గ్రంథములును గలవు. గ్రంథమనగా ముప్పది రెండక్షరములు కలిగిన ఒక శ్లోకము. పోతన తెలుగు రచనతో నీ భాగవతము ముప్పది వేల గ్రంథ సంఖ్య వరకుఁ బెరిగినది. అనగా సంస్కృత భాగవతము గ్రంథ సంఖ్యకన్న తెలుగు భాగవతము సగమునకుఁబైగాఁ బెంపుఁబొందినది అని చెప్పవచ్చును. ఈ పెంపునకుఁ గారణము లీ క్రింద వివరింతును.

1. అష్టాదశ పురాణములయందును, భగవత్తత్త్వరహస్యమును, భగవద్భక్తిని, భగవద్గుణ గణ విశిష్టతను, విపులముగ వర్ణించు పురాణమగుట.

2. భాగవతాంధ్రీకరణమున, మూల గ్రంథమునే గాక వ్యాఖ్యానములను గూడ పరిశీలించి, యందలి విషయములను జొప్పించుట.

3. భగవద్గుణగణములను, భగవద్దివ్యమంగళస్వరూపమును వర్ణించు పట్టులను, భక్తిని ప్రపంచించు భాగములను పోతన నిరుపమాన నిరతిశయ భక్త్యావేశమున విశేషముగ నవ్య పద్యములు రచించుట.

4. సంస్కృత భాగవతమున ప్రతిపాదింపఁబడిన కృష్ణ కథలనే గాక, హరి వంశము, విష్ణు పురాణము మొదలగు గ్రంథములనుండి కృష్ణకథలను గ్రహించి, తెలుగున సమకూర్చుట.

శ్రీ కృష్ణుని దివ్య చరిత్రము, నింత సమగ్రముగను, విస్తృతముగను వర్ణితమగుటచేతనే, నాంధ్ర భాగవతము, తరువాత భారతదేశమున వెలసిన శ్రీ కృష్ణభక్తి సంప్రదాయమునకు ప్రధాన గ్రంథమై వెలసినది.

సంస్కృత మూలమున , భాగవత పురాణ శ్రవణము జరిగిన నైమిశ క్షేత్రమునుగూర్చి యీ క్రింది శ్లోకమొకటియే గలదు.

> శ్లో. నైమిశే = నిమిషక్షేత్రే మునయశ్శౌనకాదయః
> సత్రం స్వర్గాయ లోకాయ సహస్ర సమ మాసత. (1—39)

పై శ్లోకములో "నైమిశే = నిమిష క్షేత్రే" అనుచిన్న వాక్యమునకు పోతన పెంపకము చూడుఁడు.

పుణ్యంబై, ముని వల్లభ
గణ్యంబై, కుసుమ ఫలనికాయోత్థిత సౌ
దన్యామయి, నైమిశాఖ్యా
రణ్యంబు నలింపదగు నరణ్యంబులలోన్ (1—38)

మఱియు మధువైరి మందిరంబునుంబోలె మాధవీ మన్మదహితంబై, బ్రహ్మ గేహంబు నుంబోలె శారదాన్వితంబై, నీలగళనభానికేతనంబునుంబోలె, వహ్నివరణ సమీరణ చంద్ర రుద్ర హైమావతీ కుబేర వృషభ గాలవశాండిల్య పాశుపత జటి పటలమండితంబై, బలి భేది భవనంబునుబోలె నైరావతామృతరంభాగణికాభిరామంబై, మురాసుర నిలయంబునుం బోలె, నున్మత్త రాక్షస వంశ సంకులంబై ధనదాగారంబునుంబోలె శంఖ పద్మ కుంద ముకుంద నందనంబై నారాయణ స్థానంబునుంబోలె, నీలకంఠ హంస, కౌశిక శుక భరద్వాజ తిత్తిరి భాసురంబై, మహా భారతంబునుంబోలె, నేకచక్ర బక కంక ధార్తరాష్ట్ర శకుని నకుల సంచార సమ్మిళితంబై, సూర్య రథంబునుంబోలె ఉరుతర ప్రవాహంబై, జలదకాల సంధ్యాముహూర్తంబునుంబోలె బహువితత జాతి సౌమనస్యంబై యొప్పు నైమిశారణ్యంబను శ్రీ విష్ణు క్షేత్రంబున॥

సంస్కృత కాదంబరి గద్య శైలిననుసరించి వ్రాసిన పై వచనము, ముప్పది నాల్గు వాక్య ములు గలవు

ప్రథమస్కంధమున భీష్మస్తవము, తెలుగు వారికి సుపరిచితములైన స్తవములలో నొకటి మాతృకలోఁబంద్రెండు శ్లోకములు గలవు తెలుగున నవసంఖ్య గల పద్యములున్నను నన్నియు నవనవోన్మేషితములు

మూలము శ్లో॥ త్రిభువన కమనం తమాలవర్ణం
రవికర గౌరవరాంబరం దధానే
వపురలక కులా వృతాననాబ్జే
విజయ సఖనతిరస్తుమే ఽ నవద్యా

మ॥ త్రిజగన్మోహననీలకాంతిఁదనువుద్దీపింపఁ, బ్రాభాతనీ
రజబంధు ప్రభమైన చేలము పయిం రంజిల్ల నీలాలక
వ్రజసంయుక్త ముఖారవిందమతిసేవ్యంబై విజృంభింప మా
విజయుంజేరెడు వన్నెకాఁడు మది నావేశించు నెల్లప్పుడున్ (218)

(5)

శ్లో॥ స్వనిగమమపహాయ మత్ప్రతిజ్ఞాం ఋతమధికర్తుమవప్లుతో రథస్థః
ధృత రథ చరణో అభ్యయాచ్చలద్గు—ర్హరి రివహంతుమిభం గతోత్తరీయః
శితవిశిఖహతో విశీర్ణదంశః క్షతజపరిప్లుత ఆతతాయి నోమే
ప్రసభమభిససార మద్వధార్థః సభవతుమే భగవాన్ గతిర్ముకుందః

ఈ రెండింటి తెనిఁగింపే తెనుఁగు దేశమున బాలగోపాల మెఱింగిన యీ క్రింది పద్యము

సీ॥ కుప్పించి యెగసిన కుండలంబుల కాంతి
గగన భాగం బెల్లఁ గప్పికొనఁగ
నుఱికిన నోర్వక యుదరంబులో నున్న
జగముల వ్రేఁగున జగతి గదలఁ
జక్రంబు చేపట్టి చనుదెంచురయమున
పైనున్న పచ్చని పటము జాఱ
నమ్మితినాలావు నగుబాటుసేయకు
మన్నింపుమని క్రీడిమఱలఁ దిగువ

గీ॥ కరికి లంఘించు సింహంబు కరణి మెఱసి
"నేఁడు భీష్ముఁజంపుదు నిన్నుఁగాతు
విడువుమర్జున" యంచు మద్విశిఖ వృష్టిఁ
దెరలిచనుదెంచు దేవుండె దిక్కు నాకు (1—222)

ఇట్టి భీష్మస్తవమే వ్యాస మహర్షి భారతమున శాంతి పర్వమున వ్రాసి యున్నాఁడు తిక్కన దానిని తెనిగించి యున్నాఁడు అది శాంతి పర్వము ద్వితీయా శ్వాసమున 19 నుండి 59వ పద్యము వరకు నలుబది పద్యములపోనున్నది అది పురుషసూక్త విధానము ననుసరించి యున్నది మఱియు నందు దశావతార వర్ణనము, కళా సూచకము గల భాగములు గలదై యున్నది

సీ. శుచియును హంసుండు, శుచిషత్తు నంబరమందు
పరమేష్ఠియును వసు భవ్యుఁగొలుతు
మఱియు సురలు నెవ్వనియ రూపెఱిం
గిరు సర్వనిగుని నప్పురుషుఁగొలుతు

ప్రాణులు సెప్పఁగ మహాపాతకము దుఃఖౌషధం
బుగ నెఱింగెడు పుణ్యమూర్తిఁ గొలుతు
శోకంబు లెల్లఁ గలుగుట నిల్పుటొందుగుట
తన యందు యగు మహోత్తమునిఁ గొలుతు

గీ. పక్షి రత్నపయంబుఁ బుష్పవ్రణంబు
పంజరము ద్రాడువార యుపాశ్రయముగ
యుండుచాట్పున విశ్వంబు నుండుటకును
ఖాస్పదంబగు పుండరీకాక్షుఁ గొలుతు (2—20)

అని మొదలిడినను —

మ. యదు వంశంబున వాసుదేవుఁ డన్నఁ గీడార్థంబు జన్మించి దు
ర్మదదైత్యావళిఁ గాల్చి పార్థునకు సారథ్యంబు త్రైలోక్య స
న్ముట మారంగ నొనర్చి దేవముని సమ్మానోద్ధృతిం భూ భరం
బు దొలంగించిన చక్రి పంకరుహనాభుం గొల్తు కృష్ణాత్మునిన్ (2—47)

అని కృష్ణ వర్ణన విపులముగాఁ జేసి యున్నాఁడు.

తే. తపమునకు విద్యకును జనుస్థానమైన
జనన రహితుని యజ్ఞాత్ము శౌరి వాజ్ఞ
యాధ్వరార్చితుఁ జేసితి నా జనార్ద
నుండు మధ్యజనమున ప్రీతుండుగాత (2—53)

అని శౌరి, జనార్దన నామములతో తిక్కన నీ స్తవమును ముగించినాఁడు.

శ్రీ కృష్ణుఁడు భీష్మునిపై యుద్ధమునకు వెడలునప్పటి ఘట్టమునే తిక్కన మూలమునను సరించి వ్రాసినను యిచ్చట పోతన, భీష్మస్తవము చివర నద్వైత పరముగా ముగించి యున్నాఁడు

మ. ఒక సూర్యుండు సమస్త జీవులకుఁ దా నొక్కొక్కఁడై తోచు పో
లిక నే దేవుఁడు సర్వ కాలము మహాలీలం సముత్పన్నజ
న్యకదంబంబుల హృత్సరోరుహములన్ నానా విధానూనరూ
పకుఁడై యొప్పుచునుండు నట్టి హరినేఁ బ్రార్థింతు శుద్ధుండనై
(భాగ-1—226)

తిక్కన జ్ఞాన మార్గమును, పోతన భక్తి మార్గమును నిరూపించుటకుఁ పై స్తవముల భాషాంతరీకరణములు చక్కని యుదాహరణములు

## ద్వితీయస్కంధము

శుకుడు భక్తి మార్గమును నిరూపించు నెడల మూలమున నాలుగు శ్లోకములు మాత్రమే గలవు. వీనిని తెలుగున పోతన ద్వితీయస్కంధము 34 నుండి 59 వరకు నిరువదియైదు గద్య పద్యములతో రచించి యున్నాడు. శుకుడు ముక్తి మార్గము దెలుపు సందర్భమున మూలమున పదమూడు శ్లోకములకు పోతన 21 గద్య పద్యములు వ్రాసియున్నాడు

## తృతీయస్కంధము

ఇందు ప్రధానమైనది విదురమైత్రేయ సంవాదము. ఇది మూలమున నేబది శ్లోకములున్న తెలుగున 180 నుండి 388 వరకు, 208 గద్య పద్యములున్నవి. ఈ గద్యములు చిన్నవిగావు ఇందొక దండకముగూడ నున్నది. ప్రథమస్కంధమున "నైమిశే నిమిష క్షేత్రే" అను దానికి పెద్ద గద్య వ్రాసినట్లుగా పోతన యీ స్కంధమున —

"అన్వేషనీయ చరణౌ చలయన్ సహస్రశీః" అను శ్లోక పాదమున "సహస్రశీః" అను మూడక్షరములకు రెండు వృత్తములు రచించియున్నాడు

చ. శరనిధి కన్యకా మణియు సంభ్రమ మొప్పఁగ దోడరా మనో
హర నిజ లీలమై ఁబరమ హంసము నీశ్వర వంద్య పాదపం
కరుహములన్ వినూత్న మణి కాంచన నూపురమంజు ఘోషముల్
వరుసఁ జెలంగ నార్యజనవంద్యుఁడు యోగిజనైక సేవ్యుఁడై (3—53)

చ. కరమణి హేమ కంకణవికాయరుఘుఁ కృతులుల్లసిల్లన
చ్చరలిపు హంసపక్షసిత చామరగంధవహోచ్ఛలత్సుధా
కరరుచిరాతపత్ర సుభగ ప్రవిలంబిత హారవల్లరీ
సరసగళత్తుషార కణజాల విరాజిత మంగళాంగుఁడై (3—535)

యజ్ఞవరాహావతారమున మూలమున పండ్రెండు శ్లోకములకు తెలుగున 21 గద్యపద్యములు గలవు

## చతుర్థస్కంధము

ఇందు దక్ష యజ్ఞమును, వీరభద్రజనన ఘట్టమును మూలముకన్న విపులముగ నున్నవి పోతన శైవుఁడగుటయేగాక నంతకుముందు వీరభద్రవిజయమును ప్రత్యేకముగ రచించియే

యున్నాఁడు. అయిన నీ ఘట్టమున భాగవత మూలమునే ననుసరించియే రచించినాఁడు. ఒక్కొక్క చోట నొక శ్లోకమునకు రెండు పద్యములు రచించినాఁడు.

శ్లో॥ ప్రీడామమా భూత్కుజన ప్రసంగతః
తజ్జన్మధిక్ యోమహతామవద్యకృత్
గోత్రంత్వదీయం భగవాన్ వృషధ్వజః
దాక్షాయణీత్యాహ యదాసుదుర్మనా.

ఉ॥ నీఁగళాపరాధియగు నీకు ననూభవ నొట చాలదా ?
చాలుఁ గుమర్త్య ! నీదు తనుజాతననన్ మది సిగ్గు పుట్టెడిన్
ఏల ధరన్మహాత్ములకు నెగ్గొనరించెడి వారి జన్మముల్ ?
గాలుపనే తలంప జనక ! కుటిలాత్మక ! యొన్ని చూడఁగన్ (4—94)

చ॥ వరవృషకేతనుండు, భగవంతుఁడునైన హరుండు నన్ను నా
దర పరిహాస వాక్యముల 'దక్షతనూభవ'! యంచుఁబిల్వ, నేఁ
బురపురఁబొక్కుచున్ ముదముఁబొందక నర్మవచఃస్మితంబులన్
దొరగుదు నీ తనూజనను దుఃఖము కంటెను నెచ్చు టొప్పఁగున్ (4—95)

భాగవతమున పైనాలుగు స్కంధములును భగవతత్త్వ ప్రతిపాదకములు. సప్తమాష్టమ నవమ దశమ స్కంధములు భగవద్భక్తి ప్రతిపాదకములు. కాబట్టి సహజముగ నిరవధిక భక్తి విశేషము చేత, పోతన యీ నాలుగింటిని, మూలమునకు పెంపును, మెఱుఁగును నతివేలముగా గల్పించినాఁడు. కావుననే గ్రంథము పెరిగినది.

సప్తమస్కంధమున ప్రహ్లాద చరిత్రము, అష్టమ స్కంధమున క్షీర సాగర మథనము, గజేంద్ర మోక్షము, నవమస్కంధమున వామన చరిత్రము, శ్రీ రామ చరిత్రము, గంగావతరణ ఘట్టము గలవు. దశమస్కంధమున శ్రీ కృష్ణ చరిత్రము, రుక్మిణీ కల్యాణము గాక, హరివంశాదుల నుండి సంగృహీతములైన కథలు గలవు. వీని వలననే తెలుఁగు భాగవతమునకు ప్రత్యేక విశిష్టత యేర్పడినది.

## సప్తమస్కంధము

ఇందు జగదాహ్లాదకరమగు ప్రహ్లాద చరిత్ర గలదు. మూలమున 250 శ్లోకములు, అనగా 350 గ్రంథములున్నవి. తెలుఁగున, 272 గద్య పద్యములు గలవు (7—114—386)

గ్రంథ పరిమాణముననుసరించిన, నిందు 1000 గ్రంథములు గలవు కాబట్టి మూలముకన్న మూడింతలు పెరుగుదల గలదు చూపుదు —

హిరణ్యకశిపు — శ్లో॥ ప్రహ్లాద ఉచ్యతాంతాతస్వధీతంకించిదుత్తమమ్
కాలేన్నైతావతాయుష్మన్ యదశిక్షద్గురోర్భవాన్

ప్రహ్లాద.— శ్లో॥ శ్రవణం కీర్తనం విష్ణోస్స్మరణం పాదసేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనం

శ్లో॥ ఇతి పుంసార్పితా విష్ణౌభక్తి శ్చేన్నవలక్షణా
క్రియతే భగవత్యద్ధాతన్మన్యే ధీతముత్తమమ్. 7—6—22, 23, 24

పై మూడు శ్లోకములకుఁ బోతన యెనిమిదిపద్యములను వ్రాసియున్నాఁడు అవి సుపరి చితములే యైనను, వాని నుదహరించిన గాని పోతన భక్త్యతిశయము, కవితారీతియు బోధ్య మానములుగావు

హిరణ్యకశిపుఁడు

శా॥ చోద్యంబయ్యెడి నింతకాలమరిగెన్ శోధించి యేమేమి సం
వేద్యాంశంబులు సెప్పిరో గురువు లే జాడం బఠింపించిరో
విద్యాసారమెఱుంగఁగోరెద భవద్విజ్ఞాత శాస్త్రంబులోఁ
బద్యం బొకటి చెప్పి సార్థముగఁ దాత్పర్యంబు భాషింపుమా! (163)

శా॥ నిన్నున్ మెచ్చరు నీతిపార మహిమన్ నీ తోడి దైత్యార్భకుల్
గన్నారన్నియుఁజెప్పనేర్తురు గదా! గ్రంథార్థముల్ దక్షులై
యున్నా! యెన్నడు నీవు నీతివిదుఁడౌనంచున్ మహా వాంఛతో
నున్నాఁడన్ ననుఁగన్న తండ్రి భవదీయోత్కర్షముం జూపవే! (164)

ప్రహ్లాదుఁడు

క॥ చదివించిరి నను గురువులు
చదివితి ధర్మార్థ ముఖ్య శాస్త్రంబులు నేఁ
జదివినవి గలవు పెక్కులు
చదువులలో మర్మమెల్లఁ జదివితిఁ దండ్రీ! (166)

మ. తనుహృద్భాషల సఖ్యమున్, శ్రవణమున్, దాసత్వమున్ వందనా
ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం
బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్ముఁ హరిన్నమ్మి స
జ్జనుఁడై యుండుట భద్రమంచుఁదలఁతున్ సత్యంబు దైత్యోత్తమా! (167)

శా. అంధేందూదయముల్ మహాబధిరశంఖారావముల్ మూకసత్
గ్రంథాఖ్యాపనముల్, నపుంసక వధూ కాంక్షల్ కృతఘ్నావళీ
బంధుత్వంబులు భస్మహవ్యములు లుబ్ధద్రవ్యముల్ క్రోడసత్
గ్రంథంబుల్ హరిభక్తి వర్జితుల రిక్తవ్యర్థసంసారముల్ (168)

సీ. కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకునిఁ జూచు చూడ్కులు చూడ్కులు
మధువైరిఁ దగిలిన మనము మనము
విష్ణునాకర్ణించు వీనులు, వీనులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
భగవంతువలఁగొను పదములు పదములు
పురుషోత్తమునిఁ మీఁది బుద్ధి బుద్ధి

తే.గీ. దేవ దేవుని చింతించు దినము దినము
చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడు గురుఁడు గురుఁడు
తండ్రి! హరిఁజేరుమనియెడి తండ్రి తండ్రి! (169)

సీ. కంజాక్షునకుఁగాని కాయంబు కాయమే
పవనగుంభిత చర్మ భస్త్రిగాక
వైకుంఠుఁ బొగడని వక్త్రంబు వక్త్రమే
ఢమ ఢమ ధ్వనితో ఢక్కఁగాక
హరి పూజనము లేని హస్తంబు హస్తమే
తరుశాఖ నిర్మిత దర్విగాక
కమలేశుఁ జూడని కన్నులు కన్నులే
తనుకుడ్యజాల రంధ్రములుగాక

ఆ.వె. చక్రిచింత లేని జన్మంబు జన్మమే
తరళ సలిల బుద్బుదంబు గాక
విష్ణు భక్తి లేని విబుధుండు విబుధుఁడే
పాద యుగముతోడి పశువు గాక ! (170)

సీ. సంసార జీమూత సంఘంబు విచ్చునే
చక్రిదాస్య ప్రభంజనము లేక
తాపత్రయాభీల దావాగ్నులాఱునే
విష్ణు సేవామృత వృష్టి లేక
సర్వం కషాఘౌఘ జలరాసులింకునే
హరిమనీషా బడబాగ్ని లేక
ఘనవిపద్గాఢాంధ కారంబులడఁగునే
పద్మాక్షనుతి రవిప్రభలు లేక

గీ. నిరుపమాపునరావృత్తి నిష్కళంక
ముక్తినిధి గానవచ్చునే ముఖ్యమైన
శార్ఙ్గ కోదండ చింతనాంజనము లేక
తామరస గర్భునకునైన దానవేంద్ర ! (171)

ఈ క్రింది చిన్న శ్లోకమునకు నొక పెద్ద శార్దూల వృత్తము వ్రాసి భావమునెట్లు పెంచినాఁడో చూడుఁడు

శ్లో. యతోన కశ్చిత్క్వచకుత్ర విద్వాన్
దీనస్స్వమాత్మానమలం సమర్థః
విమోచితుం కామదృశాం విహార
క్రీడామృగోయన్నిగళో విసర్గః (7—6—25)

శా. హాలాపాన విజృంభ మాన మదగర్వాతీత దేహోల్లసత్
బాలా లోకన శృంఖలా నిచయ సంబద్ధాత్ముఁడై లేశమున్
వేలా నిస్సరణంబు గానక మహావిద్వాంసుఁడుం గామినీ
హేలాకృష్ట కురంగ శాబకమగున్ హీన స్థితింగంటిరే ! (7—215)

# అష్టమస్కంధము

ఇందు మొదటి ఘట్టము గజేంద్ర మోక్షణము మూలమున 120 గ్రంథములు గల భాగము తెలుగున నాలుగు రెట్లు పెరిగినది 120 గద్య పద్యములలో నైదు వందల గ్రంథములున్నవి మాతృకలో —

శ్లో॥ ఏవంగజేంద్రముపవర్ణిత నిర్విశేషం
బ్రహ్మాదయో వివిధ లింగ భిదాభిమానా
నైతేయ దోపసరిపుర్నిఖిలాత్మకత్వాత్
తత్రాఖిలామరమయో హరిరా విరాసీత్ (8 3 30)

శ్లో॥ తంతద్వ దార్తముపలభ్య జగన్నివాసః
స్తోత్రం నిశమ్యదివిజైః సహసంస్తువద్భిః
ఛందోమయేన గరుడే నసముహ్యమాన
శ్చక్రాయుధోభ్యగమ దాశుయతోగజేంద్రః (8 3 31)

శ్లో॥ సోంతస్సరస్యురుబలేన గృహీత ఆర్తో
దృష్ట్వా గరుత్మతి హరిం ఖ ఉపాత్త చక్రమ్
ఉత్క్షిప్యసాంబుజకరం గిరమాహకృచ్ఛ్రా
న్నారాయణాఖిల గురోభగవన్నమస్తే (8—3—32)

శ్లో॥ తంవీక్ష్య పీడిత మజస్సహసావతీర్య
సగ్రాహమాశు సరసః కృపయోజ్జహార
గ్రాహాద్విపాటిత ముఖాదరిణో గజేంద్రం
సంపశ్యతాం హరి రమూముచ దుస్రియాణాం (8—3—33)

పై నాలుగు శ్లోకములు గల ఘట్టమును పోతనార్యుడిరువది యొక్క పద్యములతో వర్ణించినాడు (8—93—8—114) ఈ ఘట్టము మూలాతిశాయియై పోతన కవితారచనకు ప్రథమోదాహరణముగా నిలిచియున్నది

తొలి పద్యమున విష్ణుని విశ్వమయత వర్ణితమైనది.

> ఆ.వె. విశ్వమయత లేమి వినియు నూరక యుండి
> రంబుజాసనాదు లడ్డపడక
> విశ్వమయుఁడు విభుఁడు విష్ణుండు జిష్ణుండు
> భక్తియుతున కడ్డపడఁదలంచె. (94)

ఆ వెనుకనే, విష్ణువెచ్చట నున్నాఁడు? ఏమి చేయుచున్నాఁడు ? ఎట్టి సమయమది? అనునవి మన కన్నులకుఁగట్టునట్లుగా పోతన యీ క్రింది పద్యమున వర్ణించెను —

> మ. అల వైకుంఠ పురంబులో నగరిలో నా మూల సౌధంబుదా
> పల మందారవనాంతరామృతసరః ప్రాంతేందు కాంతోపలో
> త్పలపర్యంక రమావినోది యగునాపన్న ప్రసన్నుండు వి
> హ్వల నాగేంద్రము పాహి పాహి యనఁ గుయ్యాలించి సంరంభియై. (95)

ఇచటను విష్ణుని సర్వ వ్యాపకత్వ విశేషమే వర్ణితము. సర్వభూతముల యందాతఁడు నివసించును. అందుచేతనే,పోతన,"కల డంబోధి కలండుగాలి గలఁడాకాశంబునం గుంభినింగలఁడు"అని ప్రహ్లాదునిచేఁ జెప్పించినాఁడు. కావుననే యెచటనుండియో గజేంద్రుఁడు పెట్టిన మొర, అందరకుఁజేరరాని వైకుంఠమున, నందున నగరి మూల సౌధము దాపల నున్న నుద్యాన వనమున, వేకడనో యున్న సరోవరతీరమున, చంద్రకాంతశిలాతలోత్పల పర్యంకమున — రమావినోది యగు నాతని చెవుల — బడినది. అట్టి మహానంద సమయముననున్నను భక్తుని యార్తనాదము వినిన తత్క్షణమే, ఉన్నయట్లే యువ్వెత్తుగ లేచి భక్త రక్షణకై శ్రీ మహా విష్ణువు పరువిడినాఁడు. ఆనంద సమయ మత్యంత సంరంభ సమయముగా మారినది. దీనా వస్థలోనున్న భక్తుఁడగు గజేంద్రుఁడు తప్ప విష్ణువునకు వేరెవ్వరును తలంపున లేరు. కావున నెవరితోఁజెప్పవలెను? ఎవరితో మాటాడ వలెను? అను ప్రశ్నలట్టి సందర్భమున పొడసూపవు. ఈ పరిస్థితినే పోతన యీ క్రింది పద్యమునఁజిత్రించెను —

> మ. సిరికిం జెప్పఁడు, శంఖ చక్ర యుగముం జేదోయి సంధింపఁ డే
> పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణికాం
> తర ధమ్మిల్లము చక్క నొత్తఁడు, వివాద ప్రోత్థిత శ్రీకుచో
> పరిచేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై. (96)

దిశలు పరిశీలించి, గజేంద్రుఁడున్న చోటు గాంచి, చక్రంబు ధరించి,గగన మార్గమున కెగసెను. అంత, లక్ష్మి దేవి సకల పరివారము, వైకుంఠమునుండి విష్ణు మూర్తి వెడలుటచూచి, యాతని వెంటనంటిరి. ముఖ్యముగా లక్ష్మి దేవికి విష్ణుమూర్తి సంరంభము విశదము కాలేదు. ఆమె,

శా. లోలాంకాచలనంబుతో, భుజనటద్ధమ్మిల్ల బంధంబుతో
శాటీ ముక్త కుచంబుతో, సదృఢ చంచత్కాంచితో, శీర్ణలా
లాటా లేపముతో, మనోహర కరా లగ్నోత్తరీయంబుతో
గోటీంద్రు ప్రభతో సురోజభరసంకోచద్విలగ్నంబుతో. (102)

నెదలో నెంత తడఁబడినదియో, నుడువుటకు, నీ క్రింది పద్యము చాలును —

క. అడిగెదనని కడువడి జను
నడిగినఁ దను మగుడ నుడువఁడని నెడ యుడుగున్
వెడవెడ చిడిముడి తడఁబడ
నడుగిడు, నడుగిడదు, జడిమ నడుగిడు నెడలన్ (103)

ఇచట లక్ష్మి పాదముల తొట్రుపాటును, అడుగులను సమముగా వేయుటకు వీలు కాని సంరంభమును సూచించుటకు పోతన నాలుగును **సమపాదములుగాని** కంద పద్యములో రచించుట, యాతని కవితా వైపుణ్యమెంతయుఁ జాటుచున్నది ఆపైని రమాదేవి విష్ణువువెంట నరుగునప్పు డామెను వర్ణించిన సీసము భావస్ఫోరకము —

"మెఱుంత మొగిలు పిఱిది మెఱుఁగు దీగయుఁబోలె
జలదవర్ణు వెనుక జనెడు సిరియు !" (104)

ఈ భావము కాళిదాసు కుమార సంభవములోని "శశినా సహ యాతి కౌముదీ సహ మేఘేన తటిత్ ప్రలీయతే" అను శ్లోకము ననుసరించినది మెఱుపు, స్త్రీ రూపము ను దాల్చి భూమికి దిగి వచ్చిన నెట్లుండునో, అట్లే లక్ష్మి స్వరూపము వర్ణితమైనది ఈ ఘట్టమున పద్యములన్నియు నాణి ముత్తెములు.

తరువాతి ఘట్టము క్షీరసాగర మథనము మూలమున నేడధ్యాయములలో 350 గ్రంథములలో నున్నది తెనుఁగున 260 గద్యపద్యములతో నున్న యీ భాగమున మూలమునకు రెట్టింపుగా వివరణమున్నది ఈ ఘట్టముననే, శివ మహిమాన్వితమైన హాలా హల భక్షణ కథ గలదు ఇది శైవులకుఁ బ్రీతికరమైన కథ పోతన సహజముగ శైవుఁడేగాన యీ సందర్భమును, స్వభావోక్తులతో చక్కఁగ రచియించి యున్నాఁడు

వాసుకిని త్రాడుగా మందరగిరి కవ్వమును క్షీరసాగరమున నిలిపి, దేవాసురు లిరువైపులను బట్టి తరచుచున్నప్పు డా మందరగిరి తిరుగు తెరవు నిట్లు తెనుఁగున పోతన వ్యక్త పఱచెను

క విషమంబగు మందరగిరి మునుపు దిరుగుచుం
గుడి వెడమను వెనుక దిరుగు కుంభిని వెలిం
గల కొడుకు సురలు నసురలు
బొడి బొడి ఫణి ఫణము మొదలు దుదియున్ దిరుగన్ (8 211)

ఈ పద్యము చూడఁగానే నన్నయ, కిరాతార్జునీయ ఘట్టమున వరాహవర్ణనము జ్ఞప్తికి రాక మానదు

క హరు శరమును నరు శరమును
సరి నిరువక్కలుగ దాఁకి సమముగ నిరుసం
ధరమున దిరిగె వరాహము
శరనిధి మథనమున దిరుగు శైలము పోలెన్ (అర-1—306)

అంత హాలాహల ముద్భవించినది దేవాసురు లిరువురు త్రాడును, కవ్వమును విడిచి పారిరి

క ఆలోల జలధి లోపం
హాలో నహి విడిచి సురలు నసురలుఁ బఱవం
గీలా కోలాహలమై
హాలాహల విషము పుట్టె నవనీ నాథా! (8—215)

దేవదానవులు దిక్కు తోచక, శివుని శరణుఁజొచ్చిరి ఈ సందర్భమున, శివ పార్వతుల కొక సంభాషణ కల్పించి పోతన పరమశివుని జగద్రక్షకత్వమును, పార్వతి మంగళసూత్రమహిమను లోకమునకు ప్రకటించి యున్నాడు

క కంటే! జగముల దుఃఖము
వింటే! జలజనిత విషము వేఁడిమి, ప్రభువై
యుంటకు నార్తుల యాపద
గెంటింపఁగ ఫలము గాదె కీర్తి మృగాక్షీ! (8 233)

క ప్రాణేశ్వ వచ్చి చొచ్చిన
ప్రాణుల రక్షింపవలయుఁ బ్రభువుల కెల్లన్
ప్రాణులకీర్తురు సాధులు
ప్రాణంబులు నిమిషభంగురము లని మగువా! (8—234)

కం. పరహితము సేయు నెవ్వఁడు
పరమ హితుండగుచు భూత పంచకమునకున్
పరహితమె పరమధర్మము
పరహితునకు నెదురు లేదు పర్వేందుముఖీ! (8—235)

కం. హరి మది నానందించిన
హరిణాక్షి! జగంబులెల్ల నానందించున్
హరియును జగములు మెచ్చగ
గరళము వారించు టొప్పఁగంబుజదళాక్షీ ! (8—236)

కం. శిక్షింతు హాలహలమును
భక్షింతును మధుర సూక్ష్మ ఫలరసము క్రియన్
రక్షింతుఁ బ్రాణి కోట్లను
వీక్షింపుము నేఁడు నీవు వికచాబ్జముఖీ! (8—237)

తాను విషమును భక్షింతునని భర్త చెప్పుచున్నను, పార్వతి యణుమాత్రమేని చలింప లేదు. ప్రశాంత చిత్తముతో "దేవా! దేవర చిత్తంబు కొలంది యవధరింతురు గాక!" యని విన్నవించినది. ఆనాఁడు కైలాసమున జరిగిన యీ సంభాషణను పరీక్షిన్నరేంద్రుఁడు విని, "ఇదేమి చిత్రము! లోకములో భర్త విషము త్రాగి మరణమునకు సిద్ధముగ నుండ, యట్లే చేయుఁడని యేభార్యయైన బోధించునా?"

మ. అమరన్ లోకహితార్థమంచు నభవుండౌఁగాక యంచాడెటో
అమరుల్ భీతివి మ్రింగవే యనిరివో, యంభోజగర్భాదులున్
తముఁగావన్ హర! తెమ్ము! తెమ్మనిరివో—తాఁజూచి కన్గంట న
య్యుమ ప్రాణేశ్వరు నెట్లుఁ మ్రింగుమనె నయ్యుగ్రానల జ్వాలలన్
(8.239)

"లోక కల్యాణము కొఱకు శివుఁడు విషము మ్రింగెనని చెప్పవచ్చును. దేవతలు భయము చేత మ్రింగుమని యనవచ్చును. బ్రహ్మాదులు తమ్ము రక్షించుటకు తెమ్మని యనవచ్చును. కాని యీ యుమాదేవి "చూస్తూ చూస్తూ" తన భర్తను నేలాగున మ్రింగమన్నది." అన్నాఁడు పరీక్షిత్తు. శుకయోగి యందుకొని

కం. మ్రింగెడువాడు విభుండని,
మ్రింగెడిదియు గరళమనియు మేలని ప్రజకున్
మ్రింగుమనె సర్వమంగళ
మంగళసూత్రంబు నెంత మది నమ్మినదో ? (8—241)

అని పరీక్షిత్తు సందేహమును, పాఠకుల సందేహమును పోతన యొక్కమారే తీర్చినాడు.

''ఆ పైని హాలాహలమును ధిక్కరించి, కైవసము చేసికొని సూక్ష్మ ఫల రసము వలె దాని నాస్వాదించి, కంఠ బిలమున నిలుపుట. భక్షించునంత సేపును, పరమ శివుడు నిశ్చలుడై యుండుట- ఇవి హాలాహలభక్షణ సమర్థులో వర్ణితములైనవి. పోతన శైవుడే యైనను నిచ్చట శైవులకు ముఖ్యమగు—నీల కంఠస్తవ ప్రశంస చేయలేదు. ఇది యెంతయు నుచితముగ నున్నది—హాలాహలభక్షణ కథకే ఫల శ్రుతి చెప్పినాడు పోతన. కాని కేవల శివ స్తుతికి కాదు.

## నవమస్కంధము

ఇంధు, వైవస్వతమనువంశ కథనము, అంబరీషోపాఖ్యానము, సూర్య చంద్ర, యదు వంశ రాజుల చరిత్రములు గలవు. ఇందు ప్రధానముగాఁబెంపుఁజెందినది — గంగావతరణ ఘట్టము,

సగర చక్రవర్తి మునిమనుమఁడగు భగీరథుఁడు తపస్సు చేసి యాకాశగంగను భూమిపై నవతరింపఁజేసెను. మూలమున నీ వృత్తాంతము రెండు శ్లోకములలో మాత్రము చెప్పఁబడినది.

'తథేతిరాజ్ఞాభిహితః సర్వలోక హితః శ్శివః
దధారావహితో గంగాం పాదపూత జలాం హరేః
భగీరథోఽథ రాజర్షిః నిన్యేభువన పావనీం
యత్ర స్వపిత్రూణాందేహాః భస్మీభూతాశ్శేరతే.''

పై రెండు శ్లోకముల యర్థము — గంగా నదీ సమానరంగ దుత్తుంగ రచనతోనొక గద్యమును నొక పద్యమును పోతన రచించి, తన యసమాన గద్య రచనా నైపుణ్యము ప్రకటించినాఁడు. ఇది శ్లేషముాలోపమానాలంకారిక విశేషములతో నచ్చులో మాఁడు పుటలాక్రమించినది. గంగా ప్రవాహమేకధారగా పరమేశ్వర జటాజూటంబునుండి నిర్గమించిన రీతిని నీ గద్యమంతయు, ముక్త పదగ్రస్తాలంకార శోభితమై, యేకాకృతిఁగూర్చుచున్నది.

"ఇట్లు బ్రహ్మసది పురారాతి జటాజూట కంధరంబు వలస నిగింబగి, నిర్గళ ప్రవాహంబై మహేశ్వరున వదన గహ్వరంబు వెడలినోంకారంబు పోలెం జెలువడు శబ్దప్రవాహంబు భంగిప షద్భమిభ్రమంబై పంక్తికన్యావశీకరంబులై శ్రీకరంబులు గలిగి, మధ్యమ లోక శ్రీకరంబై, శ్రీకరంబు తెలుంగున విష్ణు పదంబు ముట్టి, విష్ణు పదంబు భాతి సుల్లసిత హంస రుచి రంబై, రుచిర పక్షంబు రీతినతికోభిత కువలయంబై, కువలయంబు చెప్పున బహు జీవనంబై, జీవనంబులాగున సుమనో వికాస ప్రధానంబై, ప్రధాన పర్వంబు పొలుపున నేకచక్ర బక భీమ మహా జంగి సుభద్రార్జున చరిత్రాభిరామంబై, రామ చిత్తంబుమెలపువం దన వారిహో బొచ్చిన దోషాచరుల కథయప్రదానభరణంబై ప్రదాన చరణ వర్తనంబు భాతి సముపాసిత వృత్త్యంతరయంబై వృత్త్యం తయు రూపంబు పోలిక నిరూతి సుకుమారంబై ప్రదాతయాగి నూటి సర్గ వరంపరావామనంబై వామనచరణ రేఖలు లిసంఖ్యవయసంబై, నయుశ్రోత్రంబు మార్గంబున సాపురాల భేదమాయో పాయ వతనంబై, చతురాస నాండంబు భావంబు సపరిమిత భువన జంతు జాల సేవ్య మానంబై,"

(7—230)

అని యిూ గతి నతులితమతి చతుర పద విన్యాసమున గంగ నవతరింపజేసినాడు పోతన గంగ స్త్రీ దేవత గావున స్త్రీకి సహజముగ నుండవలసిన లక్షణములను వ్యంగ్య మర్యాదతో నిరూపించుచు నామె భూమిపై పాదము పెట్టిన భంగిమను నిట్లు వర్ణించినాడు

మానిని యనతోంతు నూపక —
గరితయన నడిసప్పుడుచేయక —
ముగుధ యన బయలు పడక
ప్రమద యనుగ్రయ్యం బాలుచు
పతివ్రత యన నిట్టట్టు చనక
తల్లియన నెవ్వియ్యైన లోంగొనుచు —
దైవంబన భక్తమనోరథంబు లిచ్చుచు, నంతకంతకు
గుణిగడచి యవాఙ్మానస గోచరంబై ప్రవహించి (9—230)

గంగా ప్రవాహము వంటి పోతన రచనయు మన కవాఙ్మానస గోచరమే!
ఆ పైని గంగ నీటి మాహాత్మ్య మిట్లభివర్ణితమైనది

మ. జగతీనాథు రథంబు వెంట బహుదేశంబుల్ వడిం దాటి తా
సగరక్ష్మాప కుమార భస్మముల మీఁదన్ముంచి పారెన్ వెసన్
సగరా వాసము వారు వొందిరి నవీన శ్రీలతో గంగచే
యగణింగాక మహాసురంత సుజన ద్రోహానలం బాఱునే

(9—231)

గంగావతరణము తరువాతి ఘట్టము శ్రీరామ చరిత్రము. శ్రీరామ భక్తిపారవశ్యముచే పోతన యీ ఘట్టమును వివరించుచు ప్రతి పద్యమును ననుప్రాసములతో రచియించి యున్నాడు.

మ. అమరేంద్రాశకుఁ బూర్ణచంద్రుఁ డుదితుండైనట్లు నారాయణాం
శమునం బుట్టె మదాంధ రావణ శిరస్సంఘాత సంచ్ఛేదన
క్రమణోద్దాముఁడు, రాముఁ డాగరితకున్ గౌసల్యకున్ సన్నుత
క్రమనైర్మల్యకతుల్య సంచిత తపస్సంసార సాఫల్యకున్.

అని ప్రారంభించి (9—259)

క. మంతనములు సద్గతులకుఁ
బొంతనములు ఘనములైన పుణ్యముల కిదా
నీంతన పూర్వ మహాఘని
కృంతనములు రామ నామ కృత చింతనముల్. అని ముగించి

యున్నాఁడు. (9—363)

## వామనావతార ఘట్టము

ఇదియు ముందు చెప్పిన వాని వలె మూలముకంటె మిక్కిలి విపులముగ నున్నది. 200 గ్రంథ మూలము, తెనుఁగున 700 వరకుఁ బెరిగినది. స్వంతమైన భావములు పెక్కులు ప్రదర్శితములు.

"యజంతి యజ్ఞైః క్రతుభిర్యమాదృతాః
భవంత ఆమ్నాయ విధానకో విదాః
సఏవ విష్ణుర్వర దోస్తువాపరో
దాస్యామ్యముష్మైక్షితి మీప్సితాం మునే
యద్యప్యసావధర్మేణ మాం
బధ్నీయాదనాగసం
తథాప్యేనం నహింసిష్యేభృత బ్రహ్మతనుంహరిం"

8,11,12,20

పై వాని యర్థమెంత హృద్యముగా తెలుఁగున వివృతమైనదో చూడుఁడు.

శా కారే రాజులు? రాజ్యముల్ గలుగవే? గర్వోన్నతిం బొందరే?
వారేరీ? సిరిమూటఁగట్టుకొని పోవం జాలిరే? భూమిపైఁ
బేరైనం గలదే? శిబి ప్రముఖులున్ బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు? వారల న్మఱచిరే యిక్కాలమున్ భార్గవా!
(9—590)

క ఉడుగని క్రతువుల వ్రతముల
బొడఁగనఁ జనునట్టి పొడవు, పొడవునఁగుఱుచై
యడిగెడినట! నను బోఁటికి
నిడరాదె మహానుభావ! యిష్టార్థంబుల్ (9—591)

శా ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁదనువుపై, నంసోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ, గపోలతటిపైఁ, బాలిండ్లపై సూత్నమ
ర్యాదం జెందుకరంబుఁ గ్రిందగుట, మీఁదై నా కరంబుంట మే
ల్గాదే? రాజ్యము గీజ్యము న్సతతమే కాయంబు సాపాయమే!
(9—592)

మ నిరయంబైన, నిబంధమైన, ధరణీ నిర్మూలనంబైన, దు
ర్మరణంబైనఁగులాంతమైన నిజమున్ రానిమ్ము, కానిమ్ము పో
హరియైనన్ హరుఁడైన నీరజభవుం డభ్యాగతుండైన నౌఁ
దిరుగన్నేరదు నాదు జిహ్వ వినుమా! ధీవర్య! వేయేటికిన్?
(9—593)

క మేరువు తల క్రిందైనను
బారావారంబులింకఁ బారిన లోలో
ధారుణి రజమై పోయినఁ
దారాధ్యము బద్ధమైనఁ దప్పక యిత్తున్ (8—595)

ఈ ఘట్టముననే భాగవత సూక్తి రత్నములలో నొకటి యగు నీ క్రింది పద్యము గలదు

ఆ వె బ్రదుక వచ్చుఁగాక బహుబంధనములైన
వచ్చుఁగాక! లేమి వచ్చుఁగాక
జీవ ధనములైనఁ జెడుఁగాక పడుఁగాక!
మాట తిరుగ లేరు మాన ధనులు (8—599)

పోతన భావనా శక్తిని ప్రకటించు నీ క్రింది పద్యము నిందే కలదు

మ రవిబింబం బుదయింపఁ బాత్రమగు ఛత్రంబై, శిరోరత్నమై
శ్రవణాలంకృతియై, గళాభరణమై, సౌవర్ణకేయూరమై
ఛవిమత్కంకణమై, కటిస్థలి నుదంచత్ ఘంటయై నూపుర
ప్రవరంబై,పదపీఠమై, వటుఁడు దా బ్రహ్మాండము న్నిండుచున్
(8—623)

వామన మూర్తి యంతకంతకు పెరుగుచున్న దృశ్యమును పోతన యీ క్రింది పద్యమున వర్ణించెను

శా ఇంతింతై వటుఁడింతయై, మఱియుఁ దానింతై, నభో వీధిపై
నంతై, తోయదమండలాగమున కల్లంతై, ప్రభారాశిపై
నంతై చంద్రుని కంతయై ధ్రువునిపై నంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంతసంవర్తియై
(8—622)

ఇది సాధారణచిత్రకళా నిపుణులకుఁ జిత్రించుట కసాధ్యము ఒక్క చలన చిత్రమున మాత్రము జూపుటకు సాధ్యము

ఈ ఘట్టమున మూలమున కంటె బలి చక్రవర్తి భార్య 'వింధ్యావళి' పాత్ర రసోత్తరముగఁ జిత్రితమైనది తన భర్త నడఁగ ద్రొక్కినపుడామె వామను నుపాలంభించిన రీతి వినుఁడు

క కాదనఁడు సొమ్ము!లేదీ
రాదనఁడు! జగత్త్రయైక రాజ్యము నిచ్చెన్
నాదయితుఁగట్టనేటికి
శ్రీ దయితా చిత్తచోర! శ్రితమందారా ! (8—657)

“శ్రీ దయితా చిత్త చోర !’ అనుటలో నీకును భార్య లక్ష్మీదేవి యున్నది భర్తకుఁ గష్టము గలిగినపుడు, భార్యకెంత దుఃఖము గలుగునో ఆమె నడుగుము అను ధ్వని గలదు “శ్రితమందారా” అనుచో ‘ఆశ్రితులగు భక్తులక కల్ప వృక్షమువలె వలసిన వెల్ల నిచ్చెదవు అట్టిచో నీకు ‘కాదు’ ‘లేదు ’అనకుండ భక్తుని వలె కొనఁగిన నా భర్త నిట్లు కష్టముల పాలు చేయుట నీకు ధర్మముకాదు అని వేడుచున్నది

## దశమస్కంధము

"అన్నియు నొక్క యెత్తు అగస్త్యుడు ఒక్కడు ఒక్క యెత్తు" అను సామెతగా భాగవత మంతయు నొక్క యెత్తు దశమస్కంధ మొక్కటియు నొక్క యెత్తు అని చెప్ప వచ్చును ఈ స్కంధము భాగవతమునకు మకుటాయమానము పూర్వోత్తర భాగములు గల యీ స్కంధ మున శ్రీ కృష్ణ పరమాత్మ చరిత్ర మతిలోకోత్తరముగ వర్ణితమైనది ఈ స్కంధము, మూలమున కన్న మూడు నాలుగు రెట్లు తెనుగు సేతలో పెరిగినది

1 పోతన, శ్రీ కృష్ణ చరిత్రమునకు సంబంధించిన గాథలను — విష్ణు పురాణ, పూర్వోత్తర హరివంశాదులనుండి సంగ్రహించిన విశేషములతో వివరించుట

2 శ్రీ కృష్ణభక్తిని శ్రీ కృష్ణలీలలను వర్ణించు పట్ల, భక్త్యతిశయముచే నతివేలముగ వర్ణించుట

3 రాసక్రీడ, జలక్రీడ, ఋతువర్ణన, సూర్య చంద్రోదయ వర్ణనలు ప్రత్యేకముగ నెల కొల్పుట

మనము సంస్కృత దశమస్కంధముత తెలుగు దశమస్కంధమును సరిపోల్చుచు విమర్శన ప్రారంభించిన నది యీ స్కంధమంత పెద్దది యగును ఒక్క విషయముట్టంకించిన జాలును. శ్రీ కృష్ణ జీవిత తత్త్వమును, కృష్ణ పరమాత్మ తత్త్వమును, శృంగార భక్తి తత్త్వమును, నాంధ్ర వాఙ్మయమున పోతన దశమస్కంధముకన్న రమణీయముగా, రసోల్లసితముగా, సమగ్ర విస్మృతి విస్ఫూర్తితో ప్రపంచించిన గ్రంథము వేఱొకటి లేదనుట సత్యోక్తియేగాని యతిశయోక్తి గాదు మూలమునుండి పెంపుగనిన కొన్ని పట్టులు మాత్రమే యుదాహరింతును —

దశమస్కంధమున మొదటి ఘట్టమగు శ్రీకృష్ణ జన్మ సందర్భమున కంసుడు దేవకినిఁ జంప బోవునపుడు పోతన రచించిన కరుణ రసతరంగితములగు నీ క్రింది రెండు పద్యములకు మాతృకలు లేవు.

ఉ అన్నవు నీవు నవు చెల్లెలికి యక్కట! వాడలుసీరలిచ్చుటో?
మన్నన సేయుటో? మధుర మంజుల భాషల నాదరించుటో?
మిన్నుల మ్రోఁతలే నిజము, మేలని చంపకుమన్న! మానిరా
వన్న! సహింపుమన్న! తగదన్న! వధింపకుమన్న వేఁడెదన్
10—1—26

ఉ. చెలియన్ గన్నియ ముద్దరాలబల నీసేమంబెచింతించు ని
ర్మల, దీనిన్ బయలాడు మాటలకు నై మర్యాదఁబోఁ దట్టిన
త్కులజాతుండవు పుణ్యమూర్తివకటా! కోపంబు పాపంబునే
వ్వైరి నోహోతెగ్రవేయుబాడియగునే? చింతింపు భోజేశ్వరా
10—1 28

దేవకి గర్భదౌహృదము మాతృకలో నిండుగా లేదు పోతన యా వర్ణన ప్రబంధ రీతిగా దిద్ది తీర్చినాఁడు గోప స్త్రీలు తామొండొరులతో శ్రీ కృష్ణ జన్మమును గూర్చి చెప్పుకొనుట పోతన యెంతయో హృదయంగమముగనొక చిన్న పద్యమునవర్ణించెను

"ఏమి నోము ఫలమొ? యింత ప్రొద్దొక వార్త
వింటిమబలలార! వీనులలర
మన యశోద చిన్ని మగవానిఁగనెనట
చూచివత్తమమ్మ! సుదతులార ! 10 1 184

శ్రీ కృష్ణని శైశవ స్వరూపము, నాతని క్రీడలు మూలమున 12 శ్లోకములలో నున్నవి 10—8—22 మొదలు 10-8-33 వఱకు ఆ భాగమును నలుబది పద్యములలో పోతన హృద్యముగ ననువదించి యున్నాఁడు పెంపకమునకు మచ్చుతునక —

సీ. తనువున నంటిన ధరణీ పరాగంబు
పూసిన నెరిభూతి పూఁతగాఁగ
ముందర వెలుగొందు ముక్తాలలామంబు
తొగల సంగడి కావి తునుక గాఁగ
ఫాల భాగంబుపై నిబరగు కావిరి బొట్టు
కాముని గెల్చిన కన్నుగాఁగ
కంఠమాలికలోని ఘన నీలరత్నంబు
కమనీయమగు మెడ కప్పుగాఁగ

ఆ.వె. హారవల్లు లురగ హారవల్లులు గాఁగ
బాల లీల ప్రౌఢ బాలకుండు
శివుని పగిది నొప్పె శివునకుఁదనకును
వేరులేమిఁ దెల్ప వెలయునట్లు 10 1 297

శ్రీ కృష్ణుని దుడుకు చేతలు —

క. బాలురకుఁ బాలు లేవని
బాలింతలు మొఱలు వెట్టఁ బకపక నగి యా
బాలుం డాలము సేయుచు
వాలకుఁ గ్రేపులను విడిచె నంభోజాక్షీ అను 307 పద్యము

మొదలుకొని

క. ఓ యమ్మ నీ కుమారుఁడు
మా యిండ్లను పెరుగు పాలు మననీయఁ డమ్మా!
పోయెదమెక్కడికైనను
మా యన్నల సురభులాన! మంజులవాణీ!

అను 329 సంఖ్య వఱకు పద్యము లన్నియు మూలముకంటె మనోజ్ఞములై యున్నవి

శ్రీ కృష్ణుని శైశవ క్రీడలలో పోతన మూలమునకు మించిన రచనను గావించియున్నాఁడు

శ్రీ కృష్ణుఁడు పూతన పాలు ద్రావునపుడు మూలమున నీ చిన్ని శ్లోకము గలదు —

గాఢాంకరాభ్యాం భగవాన్ ప్రపీడ్యతత్
ప్రాణైస్సమం రోషసమన్వితోపిబత్ 10 6 11

దీనికి పోతన యీ క్రింది సీస పద్యము వ్రాసి, యందు తల్లి పాలెట్లు పిల్లలు త్రావుదురో, ఆ క్రమమునంతయు స్వభావ మధురముగ వర్ణించినాఁడు

సీ. మేల్కొన్న తెఱఁగున మెల్లన కనువిచ్చి
క్రేఁగంటఁ జూచుచు గిదికి నీల్గి
యావులించుచుఁ జేతు లాదరంబున జాచి
యొదిగిలి యాఁకొన్న యోజ నూది
బిగిచన్నుఁ గవ కేలఁ బీడించి గబళించి
గ్రుక్క గ్రుక్కకు "గుటుకు గుటుకు" మనుచు
నొకటి రెండు గ్రుక్కల నుపిద ప్రాణంబులు
పైతము మేనిలో సత్త్వమెల్లఁ

గీ. ద్రావె, నదియును గుండెలుఁదల్లడిల్లఁ
జిమ్మఁదిరుగుచు నిలువక శిరము వ్రాల
నితర బాలుర క్రియ వాఁడ పీవుగావు
చన్ను విడువుము, విడువుము చాలుననుచు 10 1 225

ఇచట శిశు మనోవిజ్ఞానమును ప్రదర్శితమైనది పసి పిల్లలు పాలు త్రాగునపుడు చేయు కార్యము లీ పద్యమందలివి ప్రతి తల్లికి నిత్యము ననుభవములే !

కాళియమర్దన ఘట్టమున మూలమున శ్రీ కృష్ణుని నర్తన మిట్లున్నది

తన్మూర్ధ రత్ననికర స్పర్శాతి తామ్ర
పాదాంబుజో౽ఖిల కళాదిగురుర్ననర్త

ఇందు "ననర్త" అనునొక్క పదముతో నొక సీస పద్యమున నృత్యమును పోతన సంపూర్ణముగఁ బ్రదర్శించెను

సీ. ఘనయమునా నదీ కల్లోల ఘోషంబు
సరస మృదంగ ఘోషంబుఁగాఁగ
సాధు బృందారకచరచంచరీక గా
నంబుగాయక సుగానంబుగాఁగఁ
గలహంస సారస కమనీయ మంజా శ
బ్దంబులుఁ దాళ శబ్దములు గాఁగ
దివినుండి వీక్షించు దివిజ గంధర్వాది
జనులు సభాసీన జనులు గాఁగ

గీ. పద్మ రాగాది రత్న ప్రభా సమాన
మహితకాళియ ఫణిఫణా మండపమున
నళినలోచన విఖ్యాత నర్తకుండు
నిత్యనైపుణ్యమునఁబేర్చి నృత్యమాడె 10 1 664

శ్రీ కృష్ణుఁడు మురళి మ్రోయించునపుడు మూలమున "చుకూజవేణుం" అని యున్నదాని నాధారముగా పోతన యొక సీస పద్యమున సంగీత శాస్త్ర సంప్రదాయమును తెలుపుచు శ్రీ కృష్ణుని స్వరూపమును వేణురవముతోఁగూడ మనోరమముగఁజిత్రించి యున్నాఁడు

సీ కర్ణావతంసిత కర్ణికార ప్రభ
గండభాగద్యుతి గడలు కొలుప
భువనమోహనమైన భ్రూవిలాసంబుతో
వామ భాగానత వదన మొప్ప
నవసవ్యకరమృదుశాంగుళీచాతురి
షడ్జ ధ్వనికి మర్మ సరణిఁజూప
డాకాలి మీఁద నడ్డము సాచి నిల్పిన
పదనఖద్యుతి భూమి ప్రబ్బికొనఁగ

గీ మౌళి పింఛము కంఠదామమున మెఱయ
విలసిత గ్రామముగ నొక వేణువందు
బ్రహ్మ గాంధర్వగీతంబుపరగఁజేసెఁ
చతుర నటమూర్తి గోపాల చక్రవర్తి 10 1 769

అప్పుడు నలినాక్షుని చేతి వంశనాళముచే మ్రాకులు పూఁదేనియ లొలికించినవి ప్రకృతి కాంతపులకితయైనది

గోపికా గీతలు భాగవతమున మహా ప్రసిద్ధినందినవి అవి మూలమున 19 శ్లోకములు 40 గ్రంథములు తెలుఁగున రెండింతలు పెరిగినవి తెనుఁగునందది యనన్య సౌందర్యముతో నందఱ డెందముల నానందతరంగితములుగా నొనర్చుచున్నవి

చలసియత్ వ్రజాచ్చారయన్ పశూన్
నళిన సుందరం నాథతేపదం
శిలతృణాంకురైస్సీద తీతినః
కలిలితాంమనఃకాంత గచ్ఛతి 10 31 11

దీనికి తెలుగు పద్యము

మ. అరవిందంబులకంటె కోమలములై, యందంబులై యొప్పనీ
చరణంబుల్ కఠినంబులై మొనయు మాచన్నుంగవల్ మోపఁగా
నెరియుం బోలునటంచుఁజొక్కుదుము నీ యీ కర్క శారణ్యభూ
పరిసంచారము కృష్ణ! నీ ప్రియులకుం బ్రాణవ్యథం జేయదే?
10 1 1053

ప్రణత దేహినాం పాపకర్శనం
తృణచరానుగం శ్రీ నికేతనం
ఫణిఫణార్పితం తే పదాంబుజం
కృణుకుచేషునఃకృంధిహృచ్ఛయం

10 31 13

ఉ గోవుల వెంటఁ ద్రిమ్మరుచుఁ గొల్చిన వారల పాప సంఘముల్
ద్రోవఁగఁజాలి శ్రీదనరి దుష్ట భుజంగ ఫణాలతాగ్రసం
భావితమైన నీ చరణ పద్మము చన్నుల మీద మోపి త
ద్భావజపుష్పభల్లభవ బాధ హరింపు చరింపు మాధవా!

10 1 1041

## రుక్మిణీ కళ్యాణము

భాగవతమున నాంధ్రులకు నత్యంత ప్రియతమమైన ఘట్టములలో రుక్మిణీకల్యాణ మొకటి మాతృకలో దాదాపు రెండు వందల గ్రంథములున్న యీ భాగము పోతన చేతిలో నైదు వందల గ్రంథములకు మించిన ప్రత్యేక కావ్య కళా ఖండముగా రూపొందినది ఇందు 106 గద్య పద్యములు గలవు

రాజాసీద్భీష్మకోనామ విదర్భాధిపతిర్మహాన్
తస్యపంచాభవన్ పుత్రాః కన్యైకాచ వరాననా 10 52 21

— — — — — — — —

ఇత్యేతేగుహ్యసందేశాయదు దేవతు యాహృతాః
విమృశ్యకృత్యం యచ్చాత్రక్రియతాం తదనంతరం

10 52 46

ప్రారంభమున నున్న 26 శ్లోకములను, ముప్పది రెండు పద్యములతో పోతన, వివరించి యున్నాడు ఇందు రుక్మిణి బాల్య క్రీడలు, బొమ్మల పెండిండ్లు, గుజ్జెనగూళ్లు, ఉయ్యాలాటలు, తెలుగు బాల బాలికలకందరకు సుపరిచితములు రుక్మిణి కళ్యాణమున రచన, విశేషమేమనఁగా నది బాలురను ప్రౌఢులను సమానముగా నాకర్షించును మూలమున లేని రుక్మిణి కృష్ణుల యౌవన ప్రాదుర్భావమును, తుల్యయోగితాలంకారము గూర్చి పోతన మనోహరముగ నీ క్రింది రీతిని వర్ణించినాడు

సీ. దేవకీ సుతు కోర్కె తీగలు వీడంగ
వెండికి మైదీగ వీడఁబాఱె
కమలనాభుని చిత్త కమలంబు వికసింపఁ
గొంతినింతికి ముఖకమలమెప్పె
మధు విరోధికి లోన మదనాగ్ని పొడసూప
పొలఁతికి చనుదోయి పొడుపు సూపె
శౌరికి ధైర్యంబుసన్నమైడయ్యంగ
జలజాక్షి మధ్యంబు సన్నమయ్యె

ఆ.వె. హరికిఁ బ్రేమ బంధమధికంబుగాఁ గేశ
బంధమధికమగుచు బాలకమరెఁ
బద్మనయనువలనఁ బ్రమదంబు నిండార
నెలఁతయౌవనంబు నిండి యుండె

10 1 1690

రుక్మిణి సందేశమున గల—

సీ. ప్రాణేశ! నీ మంజు భాషలు వినలేని
కర్ణ రంధ్రంబుల కలిమి యేల?
పురుష రత్నమ! నీవు భోగింపఁగా లేని
తనులత వలని సౌందర్యమేల?
భువన మోహన! నిన్నుఁజూడగానగాలేని
చక్షురింద్రియముల సత్త్వమేల?
దయిత! నీ యధరామృతంబానఁగాలేని
జిహ్వకు ఫలరససిద్ధి యేల?

ఆ.వె. నీరజాతనయన! నీ వనమాలికా
గంధమబ్బలేని ఘ్రాణమేల?
ధన్యచరిత! నీకు దాస్యంబు సేయని
జన్మమేల యెన్ని జన్మములకు 10 1 1709

*ను పద్యమునకు మూలము లేదు

మూలమున నున్న "విధివదుపయామే" అను నొక చిన్న వాక్యము పురస్కరించుకొని పోతన యేడు పంక్తుల వచనమును, నాపై నీ క్రింది పద్యమును రచించి, రుక్మిణీ కళ్యాణ ఘట్టమును రుక్మిణీ దేవి ప్రశంసతో ముగించి యున్నాడు

మ ద్రువకీర్తిన్ హరి పెండ్లియాడె నిజచేతో హారిణిన్ మానవై
భవగాంభీర్య విహారిణిన్ నిఖిల సంపత్కారిణిన్, సాధుబాం
ధవ సత్కారిణిఁ బుణ్యచారిణి మహాదారిద్ర్య సంహారిణిన్
సువిభూషాంబర ధారిణిన్, గుణవతీ చూడామణిన్ రుక్మిణిన్

దశమ స్కంధోత్తర భాగ రచనములలో కడపటిది కుచేలోపాఖ్యానము, కుచేలుఁడు శ్రీ కృష్ణ మందిరమును ప్రవేశించునప్పుడు మాతృకలో నీ శ్లోకములున్నవి

గృహాన్ దృష్ట్వ సహస్రాణాం
మహిషీణాం హరేర్ద్విజః
వివేశైకతమం శ్రీమత్
బ్రహ్మానంద రతింయథా 10 80 17

తంవిలోకాచ్యుతోదూరాత్
ప్రియాపరంక మాస్థితః
సహసోద్థాయ చాభ్యేత్య
దోర్భ్యాం పర్య గ్రహీన్ముదా. 10 80 18

ఈ రెండు శ్లోకములకు నాలుగు పద్యములను పోతన యనవద్యముగ వ్రాసినాఁడు

సీ విశదమై యుప్పు షోడశ సహస్రాంగనా
కవిత విలాస సంగతిఁదనర్చి
మహనీయ తపనీయ మణిమయ గోపుర
ప్రాసాద సౌధహర్మ్యములు సూచి
మనము బ్రహ్మానందమును బొందఁగడునుబ్బి
సంతోష బాష్పముల్ జడిగొనంగ
ప్రకటమై విలసిల్లునొక వధూమణిమంది
రమున వింతులు చామరములు వీవఁ

తే.గీ. దనరు మృదుహంసతూలికాతల్పమందుఁ
దానుఁ బ్రియయును బహువినోదములదనరి
మహిత లావణ్య మన్మథ మన్మథుండు
ననఁగఁజూపట్టు పుండరీకాయతాక్షు 978

సీ. ఇందీవరశ్యాము, వందిత సుత్రాముఁ
గరుణాలవాలు, భాసురక పోలుఁ
కౌస్తుభాలంకారుఁ గామితమంధారు
సురుచిరలావణ్యు సురశరణ్యు
హర్యక్షనిభమధ్యు నఖిలలోకారాధ్యు
ఘన చక్ర హస్తు, జగత్ప్రశస్తు
ఖగకులాధిపయాను కౌశేయపరిధాను
బన్నగశయను నబ్జాతనయను

గీ. మకర కుండల సద్భూషు మంజు భాషు
నిరుపమాకారు దుగ్ధ సాగర విహారు
భూరి గుణ సాంద్రు యదుకులాంబోధి చంద్రు
విష్ణురోచిష్ణు జిష్ణు సహిష్ణుఁగృష్ణు 979

మ. కనిడాయం జనసంత గృష్ణుఁడు దళత్కాంజాక్షుఁడప్పేదవి
ప్రువినశ్రాంత దరిద్ర పీడితుఁ గృశీభూతాంగు జీర్ణాంబరున్
ఘన తృష్ణాతురచిత్తు హాస్య నిలయున్ ఖండోత్తరీయుం గుచే
లుని నల్లంతనెచూచి సంభ్రమవిలోలుండై దిగెందల్పమున్ 980

క. కరమర్థి నెదురుగాఁజని
పరిరంభణమాచరించి బంధుస్నేహ
స్ఫురణం దోడ్తెచ్చి సమా
దరమునగూర్చుండఁ బెట్టెఁదన తల్పమునన్ 981

కుచేలోపాఖ్యానమున సాందీపుని యాజ్ఞచే కృష్ణ కుచేలురిర్వురు నడవికి నింధనములకై వెడలి నపుడు వచ్చిన ఝంఝామారుత వర్ష వర్ణనము

శ్లో॥ ప్రవిష్టానాం మహారణ్యమపర్తేసుమహద్ద్విజ
వాతవర్షమ భూత్తీవ్రం నిష్ఠురాస్తనయిత్నవః 10 80 36

శ్లో॥ సూర్యశ్చాస్తంగతస్తావత్తమసాచావృతాదిశః
నిమ్నంకూలంజలమయం న ప్రాజ్ఞాయతకించన 10 80 37

శ్లో॥ ఏయంభృశం తత్రమహానిలాంబుభి
ర్నిహన్యమానామహరంబుసంప్లవే
దిశోవిదంతో వపరస్పరంవనే
గృహీత హస్తాఃపరిబభ్రిమాతురాః 10 80 38

పై మూఁడు శ్లోకముల యర్థమును నెంత విపులముగా పోతన వర్ణించినాఁడో చూడుఁడు—

సీ. ఘుమఘుమారావ సంకుల ఘోరజీమూత
పటలసంఛన్నాభ్ర భాగమగుచుఁ
జటుల ఝంఝానిలోత్కట సముద్ధూతనా
నావిధ జంతు సంతానమగుచుఁ
జండ దిగ్వేదండతుండనిభాఖండ
వారిధారాపూర్ణవసుధమగుచు
సద్యోతమానోగ్రవిద్యోతకిరణజి
ద్విద్యుద్ద్యుతిచ్ఛటావిభవమగుచు

గీ. నడరి జడి గురియఁగ నినుండస్తమింప
భూరినీరంధ్రనిబిడాంధకారమేచి
సూచికాభేద్యమై వస్తు గోచరంబుఁ
గాని యట్లుండె మనము వర్షానదడిసి 10 2 999

పై పద్యము చదువుచున్నప్పుడు మనకు హోరుమని గాలి వీచుచున్నట్లు, పిడుగులు పడుచున్నట్లు, మెఱపులు మెఱసినట్లు, అఖండముగా వర్షము పడుచున్నట్లు, సూది మోపరాని యంధకార బంధుర మైనట్లు, ధ్వనించు శబ్దములతో నా ఘట్టము కన్నులకుఁగట్టును

ఉషా పరిణయ ఘట్టమున మాతృకలో 80 శ్లోకములు గలవు పోతన తెలుఁగున నూటనలువది గద్యపద్యములలో రచియించి యున్నాడు

చిత్రరేఖ రాజుల చిత్ర పటములు వ్రాసి యుషకుఁజూపు సందర్భమున మూలమున నీ క్రింది రెండు శ్లోకములున్నవి

ఇత్యుక్త్వా దేవ గంధర్వ
సిద్ధచారణ పన్నగాన్
దైత్యాన్ విద్యాధరాన్ యక్షాన్
మనుజాంశ్చయథాలిఖిత్ 10 62 16

మనుజేషుచసావృష్ణీ న్
శూర మానక దుందుభిం
వ్యలిఖద్రామ కృష్ణౌచ
ప్రద్యుమ్నం వీక్ష్యలజ్జితా. 10 62 17

ఈ రెండు శ్లోకములను పోతన పదునాలుగు పద్యములుగాఁబెంచెను కొన్నింటిని మాత్రమే యుదాహరింతును 10 2 346—360

ఉ. మాళవ కొంకణ ద్రవిడ మత్స్యపుళింద కళింగ భోజ నే
పాళవిదేహపాండ్యకురుబర్బర సింధు యుగంధ రాంధ్ర బం
గాళ కరూశకుంకణత్రిగర్తసుదేష్ణ మరాటలాటపాం
చాల నిషాద ఘూర్జరక సాళ్వ మహీశులు వీరె కోమలీ!

ఉ. సింధురవైరి విక్రముఁడు శీతమయూఖ మరాళికాపయ
స్సింధుపటీర నిర్మల విశేష యశోవిభవుండు, శౌర్యద
ర్పాంధరిపుక్షితీశనికరాంధతమ పటలార్కుఁడీ జరా
సంధునిఁజూడు మాగధుని సత్ బృహదశ్వసుతుం దలోదరీ!

మ. సకలోర్వీతలనాథసన్నుతుఁడు శశ్వద్దుర్వారి బాహా బలా
ధికుఁ డుగ్రాహవకోవిదుండు త్రిజగద్విఖ్యాత చారిత్రకుం
డకలంకోజ్జ్వల దివ్యభూషణుఁడు విదర్భాధీశ్వరుండైన భీ
ష్మక భూపాల కుమారుఁజూడు మితనిన్ మత్తద్విరేఫాలకా!

ఉ. సంగరరంగ నిర్దళిత చండ విరోధి వరూధినీశ మా
తంగతురంగ సద్భటరథ ప్రకరైక భుజావిజృంభణా
భంగపరాక్రమ ప్రకట భవ్యయశోమహనీయమూర్తి కా
ళింగుఁడు వీఁడె చూడు తరళీ కృతచారుకురంగలోచనా!

ఉ శారద నీరదాబ్జ ఘనసార సుధాకర కాశచంద్రికా
సారవటీర వర్ణ్ణయదునత్తము నుత్తమనాయకుం బ్రము
త్తారినృపాల కాననహుతాశనమూర్తి బ్రబలంబదైత్యసం
హారునిగామపాలుని హలాయుధుఁజ్జాడుముద్దైత్యనందనా

చ స్ఫురదళి శింజినీ వరవిభూషిత పుష్పధనుర్వ్విముక్త భా
స్వర నవ చూత కోరక నిశాత శిలీముఖ పాత భీత వం
కరుహభవాది చేతన నికాయు మనోజనిజాంశు రుక్మిణీ
వరసుతు రాజ కీర పరివారుని మారునిఁజూడు కోమలీ!

## భాషాంతరీకరణము - శ్రీధరీయ వ్యాఖ్యానానుసరణములు

భాగవతమున పోతన రచించిన భాగములెల్ల నద్వైతపరములుగా నున్నవి దీనికిఁ గారణ మాతఁడు సంస్కృత భాగవతమునకు గల శ్రీ ధరాచార్య వ్యాఖ్యానము ననుసరించి రచియించుటయే యని చెప్పి యున్నాను పోతన కాలమునకుఁగొంచెము ముందుగానే, భాగవతమునకు, నద్వైత విశిష్టాద్వైత తత్త్వానుకూలములగు వ్యాఖ్యానములు రచితములైనవి వానిలో నద్వైత పరములుగా నున్న వ్యాఖ్యానములలో శ్రీధరాచార్యకృతము ప్రసిద్ధమైనది శివాద్వైతి కావున పోతన, యద్వైత వ్యాఖ్యానమునే యనుసరించెను పోతన యాంధ్రీకరణ విధానమున నీ క్రింది రీతి నుండును

1 తత్త్వమును నిరూపించు ఘట్టముల యందు మూలార్థము గూఢముగ నున్నప్పుడు వ్యాఖ్యానము గల యర్థమును, పదములను గ్రహించి తెనుఁగున నెలకొల్పుట

శ్లో నమోనంతాయ సూక్ష్మయ కూటస్థాయవిపశ్చితే
నానా వాదానురోధాయ వాచ్యవాచక శక్తయే
నమః ప్రమాణమూలా యశాకవయే శాస్త్రయోనయే

దశమ 16 అ 43 1,44 శ్లో

తెలుఁగు

సీ .. మూఁడహంకృతులచే మునుఁగు పడక

తే నెరి ననంతుఁడవై దర్శనీయరుచివి
గాక సూక్ష్ముఁడవై నిర్వికార మహిమ
దనరి కూటస్థుఁడవ సమస్తంబు నెఱుఁగు
నీకు మ్రొక్కెదనాలింపు నిర్మలాత్మ! —

వ మరియు "గలండు, లేడు, సర్వంబునెఱుంగు, నించుక యెఱుంగుఁ బద్ధుండు, ముక్తుండ నే కుండొకండు ననునివి మొదలుగాఁగల వాదంబులు మాయ వలనను రోధింపుదువు" కావున, నానావాదానురోధకుండవయ్యు, "నభిధానాభిదేయశక్తిభేదంబువలన," బహు భావ ప్రతీతుండవయ్యును," "జక్షురారూపంబులవలనఁ" ప్రమాణ మూలకుండవయ్యు, నిరపేక్షజ్ఞానంబు కలిమిఁ గవివయ్యు "వేదమయనిశ్వాసత్వము వలన" శాస్త్రయోనివయ్యు 10-1-181,682

తెలుఁగు పేతయందు మూలమునకన్న యెన్నో విషయములు తెలుపఁబడినవి — అవి " "అని ప్రత్యేకించి చూపబడి యున్నవి వీనిని పోతన మూలమునకు వ్యాఖ్యానమగు శ్రీధరాచార్య వాఖ్యానము నుండి గ్రహించి యున్నాఁడు

నమయిలి" అనంతాయ అహంకారా పరిచ్ఛేదాత్, అతఃసూక్ష్మాయ, అదృశ్యత్వాత్, అతఏవ కూటస్థాయ, ఉపాధికృత వికారాభావాత్, అతయేవవిపశ్చితే సర్వజ్ఞాయ, "నానేతి" నానావాధాను "రోధాయ, అస్తి,నాస్తి, సర్వజ్ఞ , కించిజ్ఞ బద్ధః, ముక్తః, ఏకః, అనేకంః ఇత్యాదీన్ నానావాధాను అనురుణద్ధిమాయయానువర్తతే, యస్తస్మై, వాచ్యవాచక శక్త్యే అభిదానాభిదేయశక్తిభేదాదపి, నానాత్వేప్రతీయ మానాయ"

నమఃఇతి ప్రమాణమూలాయచక్షురాదీనాం, చక్షురాదిరూపాయ, అతయేవ, కవయే స్వయం తన్నిరపేక్ష జ్ఞానాయకుతః శాస్త్రయోనయే వేదాత్మక నిశ్వాసాయ

పై వ్యాఖ్యానమునకుఁగూడ పోతన పూర్తిగా తెలుఁగు రచించినాఁడని దీని వలన స్పష్టమగు చున్నది

2 కేవల కావ్యసరణికి సరసముగా దోపని తాత్త్విక విషయములు బహుమనోహరముగ సులభగ్రాహ్యమగు రీతి రచించుట

శ్లో॥ మతిర్న కృష్ణేపరతస్స్వతోవా, మిథోభిపద్యేతగృహవ్రతానాం
అదాంతగోభిర్విశతాంతమిస్రం పునఃపునశ్చర్వితచర్వణానాం
(సప్తమ స్కంధము)

ఉ॥ అచ్చపుఁజీఁకటింబడ గృహవ్రతులై విషయప్రవిష్టులై
చచ్చుచుఁ బుట్టుచున్ మరల చర్వణులైన వారికిన్
జెచ్చెరఁబుట్టునే, పరులు సెప్పిననైన, నిజేచ్ఛనైన నే
మిచ్చిననైన కానలకు వేగిననైన హరి ప్రబోధముల్ (7-181)

3 మూల శ్లోకార్థమును సరిగా ననువదించుట.

శ్లో॥ నిగమకల్పతరోర్గళితంఫలం
శుకముఖాదమృత ద్రవ సంయుతం
పిబత భాగవతం రసమాలయం
ముహురహోరసికాభువి భావుకాః

ఆ వె॥ వేదకల్పవృక్ష విగళితమై శుక
ముఖసుధా ద్రవమున మొనసి యున్న
భాగవత పురాణ ఫలరసా స్వాదన
పదవిగనుఁడు రసిక భావ విదుల 1—37

శ్లో॥ 'శరదు దాశయే సాధు జాతస
త్సరసి జోదర శ్రీ ముషాదృశా
సురత నాథతే శుల్క దాసికా
వరద నిఘ్నతో నేహకింవధః

క॥ శారద కమలో దర రుచి
చోరకమగు చూపు వలన సుందర! మమ్ముం
గోరి వెలంగాని దాసుల
ధీరత నొప్పించుటేది వధించుట గాదే!

తెలుఁగులో మూలమున నున్న 'ర' ప్రాసయే యుండుటవలన పోతన యెంత జాగరూకతో మూలమున ననుసరించెనో తెలియ గలదు.[1]

4 మూల శ్లోకార్థమునకు పెంపకము

శ్లో. నమః పరస్మై పురుషాయ భూయసే
సదుద్భవ స్థాననిరోధ లీలయా
గృహీతశక్తి త్రితయాయ దేహినా
మంతర్భవాయానుపలబ్ధవర్త్మనే

---

1 ఇట్లే కిక్షర ప్రాస గల శ్లోకములు సంస్కృత భాగవతమున చాల గలవు సంస్కృత ఛందస్సున వృత్తములలో నియతముగాని 'ప్రాసలు' భాగవతమునందు, కన్పట్టుచుండుట చేతను, ప్రాచీన సంస్కృత కావ్యముల యందుఁగన్పట్టక పోవుట చేతను—కొందఱు విమర్శకులు సంస్కృత భాగవత రచనము క్రైస్తవ శతాబ్ది పదమూఁడవ శతాబ్దికాలమగునని సూచించిరి

మ పరుఁడై యీశ్వరుఁడై, మహామహిముఁడై, ప్రాదుర్భవస్థానసం
హరణ క్రీడనుఁడై, త్రిశక్తియుతుఁడై, యంతర్గత జ్యోతియై
పరమేష్ఠి ప్రముఖామరాధిపులకుం బ్రాపింపరాకుండు దు
స్తర మార్గంబునఁ దేఁటరిల్లు హరికిన్ దత్త్వార్థినై మ్రొక్కెదన్

ఇచట 'పరమేష్ఠి ప్రముఖామరాధి పులకుం బ్రాపింప' అను వాక్యముతో మొదలిడిన రెండు పాదములును పోతన పెంపకమే

5 నాల్గైదు శ్లోకములలోని యర్థము నొకే పద్యమున సంగ్రహించుట

శ్లో కస్యాశ్చి త్పూతనాయంత్యాః కృష్ణాయంత్యపిబం
తోకయిత్వారుదంత్యావదాహంచ్ఛకటాయతీం
దైత్యాయిత్వాజహారాన్యామేకాకృష్ణార్భభావనావ్
కృష్ణ రామాయితేద్వేతుగోపవత్సాయితాః పరాః
వత్సాయితాన్ గృహిత్వాన్యా భ్రామయిత్వావ్యపాతయత్
కృష్ణాయితా జఘానాన్యత్రై కాంతుబకాయితాం
ఆహూయదూరగాయద్వృత్క్ష్ణస్తమను కుర్వతీం

సీ పూతనయై యొక్క పొలఁతి చరింపఁగ
శౌరియై యొక కాంత చన్ను గుడుచు
బాలుఁడై యొక భామ పాలకు నేడ్చుచో
బండినే నను లేమబాఱఁదన్ను
సుడిగాలి నని యొక సుందరి గొని పోవ
హరినని ఎర్తించు నబ్జముఖియు
బకుఁడనేనని యొక్క పడఁతి నరింభింపఁ
బద్మాక్షుఁడను కొమ్మ పరిభవించు

ఆ వె నెలమి రామకృష్ణులింతు లిద్దఱుగాఁగ
గోపవత్స గణము కొందఱగుదు
నసురవైరి ననుచు నబల యొక్కతె చీఱుఁ
బనులమనెడు సతుల భరత ముఖ్య!

6 మూలమున కతిపయ పదములతో నున్న వాక్యములను తెలుఁగున సమాసముగా సంఘటించుట

శ్లో॥ యతోన కశ్చిత్క్వచకుత్ర విద్వాన్
దీనస్స్వమాత్మానమలంసమర్థ
విమోచితుంకామదృశాంవిహార
క్రీడామృగో యన్నిగళో విసర్గః 7—6—25

శా॥ హాలాపాన విజృంభ మాణమదగర్వాతీత దేహోల్లస
ద్బాలాలోకన శృంఖలానిచయ సంబద్ధాత్ముఁడై లేశమున్
వేలా విస్మరణంబుఁగానక మహా విద్వాంసుఁడుం గామినీ
హేలా కృష్టకురంగశాబకమగున్ హీనస్థితిన్ వింటిరే
7—215

దశమ స్కంధము — పూర్వ భాగము — గోపికా వస్త్రాపహరణ ఘట్టమున

"పాణిభ్యాం యోనిమాచ్ఛాద్య" అని యున్నది దీనిని పోతన యౌచిత్యము నిండుకొన నిట్లు సమాస రూపకముగా రచించినాఁడు —

క॥ చంచత్పల్లవ కోమల
కాంచన నవ రత్న ఘటిత కంకణ రుచిరో
దంచితకర సంఛాదిత
ఎంచాయుధ గేహలగుచుఁ బడఁతులు వరుసన్ 10పూ 839 ప

పై రెండుదాహరణములను మూలమున రేఖామాత్రముగ నున్న విషయమును పోతన యనువాదమున సమాసావయవపుష్టతో నెట్లు విరాజిల్లినది ప్రదర్శించును — మఱియు నింకొక్క యుయుదాహృతిని వినుఁడు

శ్లో॥ దంష్ట్రాగ్రకోట్యాభగవంస్త్వయాధృతా
విరాజతే భూధర భూస్స భూధరా
యధావనాన్నిస్సరతోదతోధృతా
మతంగ జేంద్రస్యసపంక పద్మినీ. 3—13—35

మ. అరవిందోదర తావకీనసితదంష్ట్రాగ్రావలగ్నక్షమా
దరవద్యబ్ధినదాటవీయుత సమిద్ధక్ష్మాతలంబొప్పె భా
సురకాసార జలావతీర్ణమదవచ్ఛుండాల రాడ్దంత శే
ఖర సంయుక్త సపంక పంకజము రేఖం బొల్చిదీపింపఁగన్

3—429

శ్లో. గృహేషు దారేషు సుతేషు బంధుషు
ద్విపోత్తమ స్యందన వాజి పంక్తిషు
అక్షయ్య వస్త్రాభరణాయుధాదిషు
అనంత కోశేష్వకరోద సన్మతిం

ఆ వె. అతనికీహమానె హారులందుఁగరులందు
ధనములందు కేళివనములందు
పుత్రులందు బంధుమిత్రులయందును
పురమునందు నంతిపురమునందు 9—88

మూలమున సప్తమీ బహువచన మనువర్తింపఁబడినది తెలుఁగున నట్లే పోతన సప్తమీ విభక్తిని వాడి మనోహరత చేకూర్చెను

దశమ స్కందోత్తర భాగముననున్న తత్త్వ ఘట్టములఁదెలిఁగింపు చాల వఱకు విశిష్టాద్వైత పరములుగా నున్న వని యీ క్రింది పంక్తులను కొందఱు విమర్శకులుదాహరించిరి

"దేవా! భవదీయ సంకల్పాదీనంబులై సి శరీరంబులం బ్రవేశించి యున్న జీవ సమూహంబు నీకు శేష భూతంబని తెలిసి కృతార్థులగుదురు

వెండియుఁగొందఱు సచరాచర వస్తు జాతంబులకు సంపర్యాప్తివై, సర్వంబు నీవయగుటం దెలియ లేక యనిత్యంబని విపరీత బుద్ధిందెలియుదురు కాని కొందఱు జగద్భరితుండవుగాన జగద్రూపకుండవైన నిన్నుఁగటకమకుటకర్ణికాది వివిధ భూషణ భేదంబులం గనకంబునిజస్వరూపంబు విడువక వర్తించుచందంబున జగద్వికారానుగతుండవయ్యును నిఖిల హేయప్రత్యనీక కల్యాణ గుణాత్మకుండవై యుందువని యాత్మ విదులైన వారు తెలియుదురు" —1219

అట్టి జీవులు దేవ తిర్యఙ్మనుష్యస్థావరాది శరీరంబులు సొచ్చి యణురూపులై యుందురు అందును నీ వుందువుతదంతరాత్మవగుచు 1222

సకల చేతనా చేత నాంతర్యామియైన సర్వేశ్వరుండు సర్వశబ్దవాచ్యుండు సకల బ్రహ్మాండ
నాయకుండవైన నీ యందు శ్రుతులు ముఖ్య వృత్తిం బ్రవర్తించు 1229

మా యాత్మ విశిష్టుండవగుచుఁ గార్యకారణాత్మకుండవై 1230

ఇట జీవ బహుత్వాను రూపత్వ శేషత్వములు, ఈశ్వరుని జగద్రూపము, చిదచిద్విశిష్టత్వము, శేషిత్వము శరీర భూత చిదచిదాత్మకత్వము, సర్వ శబ్ద వాచ్యత్వము ఈశ్వరుని యందు శ్రుతుల ముఖ్యవృత్తిత్వము మొదలగు విశిష్టాద్వైత సిద్ధాంతములు కానిపించుచున్నవి

పోతన శ్రీధరీయ వ్యాఖ్యానుసారముగ నద్వైతమత సిద్ధాంతముల ననుసరించియే భాగవతము, తెనిగించు పద్ధతి గలవాఁడు ఇచట విశిష్టాద్వైత సిద్ధాంతములున్నవి గాన, యీ భాగముఁదశమ స్కంధోత్తర భాగము పోతనది కాదనియుఁ గొందఱు విమర్శకులు చెప్పవత్తురు కాని యిది సహేతుకముగాదు !

ఏలయనగా,సమదర్శనుఁడగు పోతన యిచట ప్రధానముగా కేవలము విష్ణుపరమైన తత్త్వమును గూర్చిన ఘట్టమున, తన కాలమున ప్రచుర ప్రచారములో నున్న విశిష్టాద్వైత సిద్ధాంతమునుగూడ సూచించుట, సమంజసమే దీని వలన మనమింకొక విషయము గ్రహింప వచ్చును సహజ పాండిత్యుఁడైన పోతన యొక్క యద్వైత, మతసిద్ధాంతములనే గాక విశిష్టాద్వైత మతసిద్ధాంతములను నాకళింపు జేసి కొనినవాఁడని చెప్పటకు మనము సందేహింప నక్కర లేదు

# 7. పోతన కవితా లక్షణములు

1 సులలిత సరళధారాశుద్ధి
2 ప్రసన్న గంభీరత
3 సుకుమార మాధుర్య పద సంపద
4 రసోద్దీపకత
5 అన్వయ సౌలభ్యము
6 శయ్యా సౌభాగ్యము
7 శబ్దాలంకార వైచిత్రి
8 నిసర్గ మనోహరత
9 భక్తి భావనా బంధురత

పోతన భాగవతమున ప్రతిపాదించిన నవ విధ భక్తి మార్గములకు నవ రీతులు ననగా తొమ్మిది లక్షణములు గల కవితా రచన ననుసంధించి యున్నాఁడు పోతన కవితా కన్య సహజ సౌందర్య సౌకుమార్య సముపేత విచిత్రాలంకార విరాజిత సర్వాంగ సుందరి దీనికిఁ గారణము సమవిభక్తావయవములు శరీర సౌందర్యమున కెట్లొక హేతువులో, అట్లే పోతన పద్యముల యందలి పదసమాసాదులు, తులఁదూచి తీరిచినట్లు, రసభావాను రూపములై సువి భక్తములై రామణీయకములై యుండుటయే యని యెఱుంగునది

అర్థమాపాత స్ఫూర్తిఁగలిగి యుండుట చేత పోతన కవిత ద్రాక్షాపాకమువలె, సద్యఆస్వాద నీయమై యనుభవ యోగ్యమగును

పద్య రచనా శిల్పమునఁ బోతన ప్రకృష్టాంధ్ర మహా కవులు పెక్కుర కన్నపై చేయి—కవి త్రయము వారి రచలనలలో పద్యములలో యతిప్రాసల పట్టున, వేఱువేఱు పదములు గాని సంధి గతాక్షరములుగాని యుండుట చేత పాదపాదమునకు నిలిపి చదువ నెంతయుననుకూలపడదు

భాగవత పద్యములనే పాదమున కా పాదము విడివడుట, యతిస్థానమున ప్రాస-స్థానమున పదములు వేఱగుట,అనుప్రాసలుండుట – అను నీ మూఁడు లక్షణము లుండుట చేత చదువు వానికి పాటి వాచకత యున్నను పద్యములు తమంతట తాము దొరలి పోవును కావుననే నోరు తిరిగిన ప్రతి వ్యక్తికి భాగవత పద్యములు చదువు శక్తి గలుగుచున్నది

సంగీతమునకుఁ నాదశక్తి యెట్లో జీవహేతువో సాహిత్యమునకు నాదశక్తియట్టిదని పూర్ణముగ నిరూపించిన మహా కవి పోతన — అవ్యక్త మధురమగు సంగీతమును సువ్యక్త మొనరించినది తెనుఁగు భాష — భక్తి విన్యాసమునకు గానము లేక సంగీతము ప్రధానము — ఈ రహస్యమును గుర్తించియే పోతన, తాళలయానుకూలములై, గీతి విన్యాసమునకు నిలువ, నను ప్రాస పద బంధముతో చాల పద్యములు రచించియున్నాఁడు — ఈ సందర్భమును బట్టియే, భాగవతము నను ప్రాసగు పద్యములున్నియు, భక్తి రసభావోద్దీపకములై యున్నవి గాని, కేవలాలంకారిక శాస్త్ర లక్షణములకు లక్ష్యములై యుండ లేదు[1] —

పోతన యనుప్రాసవైఖరి సంపూర్ణముగ సంగీతము ననుసరించినదని చెప్పుటకు మరియొక యుపపత్తి కూడ కలదు

'వేదానాం సామవేదోస్మి' అను గీతా వాక్యమునకు లోకమాన్యులు — గీతా రహస్యమున వేదములలో సామ వేదము సంగీతమునకు మూలము గావునను, అది భక్తి యోగమునకు ప్రధానాంగము గావునను,భక్తి యోగము సర్వ జనసులభము గావునను సామవేదమునకే ప్రాధాన్యమీయబడినది'' అని వ్యాఖ్యానించి యున్నారు

తెలుఁగు దేశమున ''పురాణ హరి కథ'' యను నొక సంప్రదాయము గలదు—దీనిని ప్రవర్తింప జేసిన వారు కీ శే బంకుపల్లి మల్లయ శాస్త్రులవారు (1876—1946) వీరు భాగవతమును అనఁగా పోతన పద్య భాగవతమును గ్రహించి, ఆ పద్యములను గద్యములను నృత్యగీతతాళయుతముగాఁ బాడి, యాంధ్ర దేశమునందలి పల్లె పట్టణములందెల్ల పండిత పామరులను రంజింపఁజేసెడి వారు — ప్రస్తుత మీ సంప్రదాయము ప్రచారమున లేక పోయినను—పోతన కవితా విమర్శనమునందీ విషయము ముఖ్యముగా గ్రహింపదగినది యని వివరించితిని[2]

భగవద్భక్తి రసోచిత కవితారచన యందు తెలుఁగున పోతనకు పోటి లేదు సాటి లేదు ఆంధ్ర సాహిత్య ప్రపంచమున 'పతనికతండె సాటి'

---

[1] నా ''ఉదాహరణ వాఙ్మయ చరిత్ర''లో పదపద్య కవితల విశిష్టత యందు పై సంగీత సాహిత్యముల పరస్పర సంబంధము పూర్తిగ చర్చించితిని

[2] వీరి 'ప్రహ్లాదచరిత్ర' పురాణహరికథను నేనిప్పటికి ముప్పదేండ్లక్రిందట స్వయముగావిని యానందాబ్ధిలో నోలలాడితిని—పోతన యనుప్రాస విన్యాసమింత శక్తివంతమైనదని యానాఁడే గ్రహించితిని—

పోతన భాగవత గ్రంధావతారికలో నీ క్రింది విధముగ ప్రతిజ్ఞఁజేసి యున్నాఁడు —

కొందఱకుఁదెలుఁగు గుణమగుఁ
గొందఱకును సంస్కృతంబు గుణమగు రెండుం
గొందఱకు గుణములగునే
నందఱ మెప్పింతుఁ గృతులనయ్యై యెడలన్ 1—20

ఇట్లు ప్రతిజ్ఞ చేసినను, భాగవతముఁ జదివిన వారికి, పోతన కవితలోఁ దెలుఁగుకన్న సంస్కృతమే మూఁడు పాళ్లకుఁ బైగా నున్నదని తెలియఁగలదు—దీనికి నాలుగు కారణములు—

1 పోతన కవితకు ముఖ్య లక్షణమగు నంత్యానుప్రాస నియమము

2 పరమేశ్వర స్వరూప లీలా వర్ణనము

3 భక్తి రసావేశ సందర్భములు—4 వచన రచన

పోతన సంస్కృత సమాస రచన ప్రసన్నమై, నన్నయ సమాస రచన దలపించును—కాని నన్నయవలె గాక, పోతన ఏక సమాస పద్య పాద రచనలు గావించి యున్నాఁడు

ఉ మానిత సౌరభ ప్రసవ మంజుల పక్వఫల ప్రవాళ భా
రానత చూత పోత విట పాగ్రనికేతన రాజకీరస
మ్మాని సుభాను లాప పరిమండిత కర్ణమతాప సా్రశమో
ద్యాన వన ప్రదేశ కమలాకర తీర నికుంజపుంజముల్
3—104

లలితా యుతాష్ట భుజమం
డల మధ్య స్ఫురితరుచి విడంబిత లక్ష్మీ
లలనా కాంతి స్పర్ధా
కలితలసద్వైజయంతకాశోభితుఁడున్ 4—903

సీ నవ్య కాంచన రణన్మణి నూపురారావ విలసిత పాదారవింద యుగళ
కాంచీ కలాప సంకలితదుకూల వస్త్రస్ఫార పులిననితంబబింబ
రాజితాన్యోన్య కర్కశపీనకరికుంభవృథుకుచభార కంపితవలగ్న
మదిరార సాస్వాద మదవిఘూర్ణిత చారుసిత నవనికచరాజీవనయన

గీ   యుపర పక్షాష్టమీ శశాంకాభ నిటల
మదవదలికులరుచి రోపమానచికుర
లలిత చంపక కుసుమ విలాస నాస
హాస లీలావలోకన యుబ్జపాణి

3—726

శబ్దాలంకారములలో నను్రపాస రచన, పోతన భాగవతమున పరమమగు కోటికెక్కినది — ఈ యను్రపాస విన్యాసము భాగవతమున మన్నట్లాంధ్ర వాఙ్మయమున మరి యెచ్చటను గానరాదు —భాగవతమున నిది యెన్ని భంగుల, హృదయంగమమై వెలసినదో చూడుడు

1 క్రియా పదమును పద్యము తొలి పదమునందుంచి, యా వెనుక క్రియతో నన్వయించు విశేష్య పదమున కనేక విశేషణములు చేర్చి విశేష్యమున కున్న యక్షరములతో విశేషణములకు నను్రపాస సంఘటించుట

ఈ పద్ధతి వ్యాసుని స్తుతి తో ప్రారంభమైనది

క   కనియెన్నారదుఁడంతన్
వినయైక విలాసునిగమ విభజన విద్యా
జనితోల్లాసున్ భవదుః
ఖనిరాసున్ గురుమనోవికాసున్ వ్యాసున్   1—87

మ   కనియెం దాపస పుంగవుండఖిల లోకఖ్యాత వర్థిష్ణుశో
భన భాస్వత్పురి పూర్ణయౌవన కళాభ్రాజిష్ణు, యోగీంద్ర హృ
ద్వన జాత్రైక చరిష్ణుఁగౌస్తుభము ఖోద్యద్భూషణాలంకరి
ష్ణునిలింపాహిత జిష్ణుఁ, విష్ణుఁ బ్రభవిష్ణుం గృష్ణురోచిష్ణునిన్

3—148

మ   కనియెం గోప కుమార శేఖరుఁడు రంగత్ఫుల్ల రాజీవకో
కనదోత్తుంగతరంగ సంగతల సత్కాసారకన్, భూరిశో
భననిత్యోన్నత సౌఖ్యభారకను శుంభద్వైభవోదారకన్
జన సంతాపనివారకన్ సుజనభాస్వత్తారకన్ ద్వారకన్

10—2—449

ఇట్లే "కనియెందాలాంకుఁడుద్యత్కట చటులనటత్కాలదండాభశూలున్"

10—2—940

కనియెందానవుడింద్రసేనుఁడు దళత్కంజాక్షులన్ దక్షులన్"

10—2—1141

అను పద్యములు గలవు

2 కర్తృపదములతో ప్రారంభించి, విశేషణముల కనుప్రాస ఘటించుట

మ జలజాతాక్షుఁడు శౌరి డగ్గఱె మహా సౌధాగ్రబృందారకన్
గల హంసావృత హేమ పద్మ పరిఖాకాసారకం దోరణా
పరిసంచాదిత తారకం దరులతావర్గానువేలోదయ
త్పల పుష్పాంకుర కోరకన్ మణిమయ ప్రాకారకన్ ద్వారకన్

1—243

మ ప్రణతామ్నాయుఁడు కృష్ణుఁడంత గదిసెన్ బాష్పావరుద్ధారుణే
క్షణ విస్రస్తవిముక్త భూషణ దురుక్తక్రూర నారాచశో
షణ నాలింగిత ధారుణిన్ నిజకులాచారైక సద్ధర్మచా
రిణి విశ్లేషిణి వీతశోషిణిఁబురంధ్రి గ్రామణిన్ రుక్మిణిన్

10—2—240

3 కర్తృక్రియా పదములకు మధ్య పదములుండుటయు గందు అప్పుడు క్రియపాదాంత మందుండును.

మ కరుణాసింధుఁడు శౌరివారి చరమున్ ఖండింపఁగాఁబంపె స
త్వరితా కంపిత భూమి చక్రము మహోద్యద్విస్ఫులింగచ్ఛటా
పరిభూతాంబర శుక్రమున్ బహు విధ బ్రహ్మాండ భాండచ్ఛటాం
తర నిర్వక్రము బాలితాఖిలసుధాంధశ్చక్రమున్ జక్రమున్

8—109

చ మనమున మోదమందుచు సుమాతరుణీమణిఁగాంచెఁజారుమృ
త్స్నక కుశాజినాయసనికాయవినిర్మితపాత్ర సీమము
న్ననుపమవేద ఘోష సుమహత్పశుబంధన కర్మ భూమమున్
ముని విబుధాభిరామముసముజ్జ్వల హోమము యాగధామమున్

4—81

4 ఒక్కొక్కయెడ క్రియ రెండవ పాదమున నే వచ్చుచుండును

మ బలిదైత్యేంద్ర కరద్వయీ కృతజల ప్రక్షాళన వ్యాప్తికిన్
జలజాతాక్షుఁడు సాఁచె యోగి సుమనస్సంపాదిత శ్రీదమున్
కలితానంద పరంపరాలయము పదవీ కస్తూరికా పాదమున్
విరామోదము రత్ననూపురిత నానావేదమున్ పాదమున్

8—604

మ సమరారాతి కరాక్షతోజ్ఝిత విచిత్రాంభఃకణ శ్రేణికిన్
కమలాధీశ్వరుఁడొడ్డె ఖండితదివౌకస్స్వామి జన్మస్థమున్ 18-611

5 సీస పద్య పాదమునొక్కొక్క దానియందు నాల్గేసి యనుప్రాసములు

సీ కమనీయ శుభగాత్రు గంజాత దళనేత్రు వసుధాకళత్రు బావన చరిత్రు
సత్య సంకల్పు, నిశాచరోగ్ర వికల్పు, నతపన్నగా కల్పు నాగతల్పు
కౌస్తుభమణిభూషు గంభీర మృదు భాషు శ్రితజన పోషు సంచిత విశేషు
నీలనీరదకాయు, నిర్జితదైతేయు, ధృత పీత కౌశేయు, నత విధేయు

గీ ఘనుమహాగద వైద్యు వేదాంతవేద్యు
దివ్యమునిసన్నుతామోదుఁ దీర్ఘపాదు
జిష్ణువరసద్గుణాలంకరిష్ణు విష్ణు
జూడు దైతేయకులబాల! సుభగశీల 10—2—358

6 సీస పద్య పాదమున మొదటి దళమున నొక యనుప్రాస—రెండవ దళమున వేరొక యనుప్రాస

సీ ఇందీవరశ్యాము, వందితసుత్రాము
కరుణాలవాలు, భాసురకపోలుఁ
గౌస్తుభాలంకారు గామిత మందారు
సురుచిర లావణ్యు, సురశరణ్యు
హర్యక్షనిభ మధ్యు నఖిలలోకారాధ్యు
ఘన చక్ర హస్తు నగ్రప్రశస్తు
ఖగ కులాధిపయానుఁ గౌశేయ పరిధానుఁ
బన్నగశయను నబ్జాతనయను

గీ. మకర కుండల సద్భాస మంజులాస్యు
నవఘనాకారు, దుగ్ధ సాగర విహారు
భూరి గుణసాంద్రు యదుకులాంబోధిచంద్రు
జిష్ణురోచిష్ణు, విష్ణు సహిష్ణుఁగ్రసిష్ణు 10—2—979

7 సీస పద్య పాదమునకొక్కొక్క దళమున కొకే యనుప్రాస

సీ. దరదర వింద సుందర పత్ర రుచిరాక్షు
సలలిత శ్రీవత్సకలితవక్షు,
నీలనీరదనీలు నీలోత్పలశ్యాము,
నవికచాకుల మాలికాభిరాము,
కౌస్తుభరుచిరముక్తాహారయుతకంఠు
యోగిమానస పంకజోపకంఠు
సతత ప్రసన్న సస్మిత వదనాంభోజు
దినకరకోటి సందీప్తతేజు

తె. సలలితా నర్ఘ్యరత్న కుండల కిరీట
హార కంకణ కటకకేయూరముద్రి
కాకలాకోటి భూషు, భక్త ప్రపోషు
కింకిణీయుత మేఖలా కీర్ణజఘను 3—922

## కందములు

కంద పద్యముల భక్తి రసమాకందంబులుగా భక్తిలతికాకందంబులుగ నొనరించి, పోతన యనుప్రాస విన్యాసముచే వీనులకు విందొనరించును

1 క్రియతో ప్రారంభించి విశేష్య విశేషణములనను ప్రాసము రచించుట

చని చని ముందట గనుగొనె
ఘన హిమవతమహత్పతంగగరుణా పొంగన్
గసదుత్తుంగతరంగన్
అనుమిత విహార పుణ్యాసంగన్ గంగన్ 3—178

చని ముందటఁగనుఁగొనె మధు
వనమును, ముని దేవయోగి వర్ణిత గుణపా
వనమును, దుర్భవజలదప
వనమును, నిఖిలైక పుణ్య పరభవనమునున్ 4—269

2 విశేష్యములతో ప్రారంభమై యేకానుప్రాస గలిగి యుండుట

భూషణములు వాణికి నఘ
పేషణములు మృత్యు చిత్త భీషణములు హృ
త్తోషణములు కల్యాణ వి
శేషణములు హరిగుణోపచిత భాషణముల్ 1—46

భూషణములు చెవులకు బుధ
తోషణములనేక జన్మదురితౌఘ విని
శ్శోషణములు మంగళ తర
ఘోషణములు గరుడగమను గుణ భాషణముల్

3 నాలుగు పాదాంతముల యందు నొకే యనుప్రాస

అనుదిన సంతోషణములు
జనితశ్రమ తాపదుఃఖ సంశోషణముల్
దనయుల సంభాషణములు
జనకులకుం గర్ణయుగళ సద్భూషణముల్ 7—140

పరిభూత వ్యథనంబులు
నిరుపమ సంసార జలధి నిర్మథనంబుల్
నరకేసరి కథనంబులు
పరిరక్షిత దేవ యక్ష పరిమిథునంబుల్ 7—28

4 ప్రాసల యనుప్రాసలు

రామున్, మేచక జలద
శ్యామున్, సుగుణాభిరాము, సద్వైభవసు
త్రామున్, దుష్ట నిశాటవి
రామున్ బొమ్మనియె పంక్తి రథుఁడడవుంకున్ 2—106

5 ద్విప్రాసము

శర్మద, యమదండతక్షత
వర్మద, నతి కరిన ముక్తి వనితాచేతో
మర్మద, నంబుని వారిత
దుర్మద, నర్మదఁదరించె త్రోవన్ వటుఁడున్ 8—529

7 త్రిప్రాసము

శ్రీఁంబులు, ఖండితసం
తాపంబులు, కల్మషాంధ తమ సమహోద్య
ద్దీపంబులు, పాషండదు
రాపంబులు, విష్ణు వందనాలాపంబుల్ 1—445

7 చతుష్ప్రాసము

క పావనములు, దురితలతా
లావనములు, దివ్య మంగళ ప్రాభవసం
జీవనములు, లక్ష్మీ సం
భావనములు, వాసు దేవ పద సేవనముల్ 1—446

8 కంద పద్యముల యందంతటను లఘువులనే యుపయోగించుట (సర్వ లఘు కందము)

క స్ఫురిత విబుధ జన ముఖములు
పరివిదళిత దనుజనివహ పతితను ముఖముల్
గురురుచి జితశిఖి శిఖములు
నరహరి కరనఖములమరునతజన సఖముల్ 7—298

ఉత్పలమాలికలందును ద్విప్రాస, త్రిప్రాస, యనుప్రాసముల కన్పట్టును

ప్రాస

ఉ బాలుఁ బ్రభావిశాలు, హరిపాదపయోరుహచింతన క్రియా
లోలుఁ గృపాళు, సాధు గురులోక పదానత ఫాలు నిర్మల
శ్రీలు సమస్త సభ్యనుత శీలు, విఖండిత మోహవల్లికా
జాలు నదేల తండ్రి వడిఁజంపఁగ బంచె మునీంద్ర చెప్పవే ! 7—127

ద్విప్రాస

షష్ట్యంతములు నాలుగు పద్యములు ద్విప్రాసలో నున్నవి

ఉ. హారికి, నందగోకుల విహారికి చక్ర సమీర దైత్య సం
హారికి, భక్త దుఃఖ పరిహారికి గోపనితంబినీ మనో
హారికి, దుష్ట సంపదపహారికి, ఘోషకుటీపయోఘృతా
హారికి, బాలకగ్రహ మహాసుర దుర్వనితా ప్రహారికిన్ 1—29

ఇన్ని ప్రాసములే కాక, పద్యాది యందు త్రిప్రాస, చతుష్ప్రాస, పంచ ప్రాసము, పాటించుట

ద్విప్రాస

ఉ. పాఱఁడు లేచి, దిక్కులకు బాహువు లొడ్డఁడు, బంధు రాజితో
దూఱఁడు ఘోర కృత్యమని దూఱఁడు, తండ్రిని మిత్ర వర్గముం
జీఱఁడు మాతృ సంఘము వసించు సువర్ణ గృహంబులోనికిం
దాఱఁడు కావరే యనఁడు దానము నొందఁడు కంటగింపఁడున్

7—194

త్రిప్రాస

ఉ. చంపుదుమే నిలింపులను జంకెల అంకెల దాపసావళిన్
బంపుదుమే కృతాంతకుని పాలికి క్రేవుల తోడ గోవులన్
ద్రుంపుదుమే ధరాసురులఁ దోలుదుమే నిగమంబులన్ విదా
రింపుదుమే వసుంధర హరింపుదుమే జననాథ! పంపుమా!

10—1—170

చతుష్ప్రాస

ఉ. చూడవదేమి గారవపుఁజూపుల మమ్ము సఖాళితోడ మా
టాడవదేమి నర్మముగ నందెలు పాదములందు మ్రోయనే
డాడవదేమి నర్తనములవ్వల మ్రోలను గోపికావళిం
గూడవదేమి నవ్వు గ్రీ గోపకుమార యదేమి చెప్పుమా!

10—1—65/

పంచ ప్రాస

ఉ వెలిచిన వాని, దైన్యమున వేదుఱు నొందిన వాని, నిద్రమై
సొలిచిన వాని సౌఖ్యమున మద్యము ద్రావిన వాని భగ్నుఁడై
నలిచిన వాని సాధుజడ భావము వానిని గావుమంచు నా
వలిచిన గామిగామిను లలంపుట ధర్మము గాదు ఫల్గుణా

1—133

సర్వసమానత (స్వామి సాక్షాత్కార వర్ణనము)

సీ తరణి సుధాకర కిరణ సమంచిత సరసీరుహోత్పల ప్రక్క్విలాసుఁ
గంకణ నూపుర గ్రైవేయ ముద్రికాహారకుండల కిరీటాభిరాము
గంగాయిుయి సాగర కన్యకా కౌస్తుభమణి భూషణోద్భాసిత వక్షు
లలిత దరహాస చంద్రికా ధవళిత చారుదర్పణ విరాజత్కపోలు

గీ శంఖ చక్ర గదా పద్మ చారు హస్తు
నలి కులాలకరుచి భాస్వదలికఫలకుఁ
బీతకౌశేయ వాసుఁగృపాతరంగి
తస్మితేక్షణుఁబంకజోదరుని హరిని

3—750

భక్తి రసావేశమునకు

మ పర గోవింద కథా సుధారస మహావర్షోరుధారాపరం
పరలంగాక బుధేంద్ర చంద్ర! యితరోపాయాను రక్తిం బ్రవి
స్తర దుర్దాంత దురంత దుస్సహ జనుస్సంభావితానే కదు
స్తర గంభీర కఠోర కల్మష కవద్దావానలంబాఱునే! 1—49

గద్య రచన —

పోతన గద్య రచన బాణుని కాదంబరిని ననుసరించును "మధువైరి మందిరంబునుంబోలి మాధవ మన్మథ మహితంబై బ్రహ్మగేహంబునుంబోలె శారదాన్వితంబై, నీలగళ సభానికేతనంబునుం బోలె వన్ని వరుణ సమీరణ చంద్ర రుద్ర హైమవతి కుబేర వృషభగాల వశాండిల్య పాశుపత జటవటల మండితంబై, బలభేది భవనంబునుం బోలె వైరావతామృతరంభాగణి కాభిరామంబై"
1—39

"చక్రధర ఇవ కరకమలోపలక్ష్యమాణ శంఖ చక్ర లాంఛనః హర ఇవజిత మన్మథః గుహ ఇవా ప్రతిహత శక్తిః కమలయోనిరివ విమానీకృత రాజహంసమండలః జలధిరివ లక్ష్మీ ప్రసూతిః గంగా ప్రవాహ ఇవ భగీరథ పథ ప్రవృత్త" (కాదంబరి కథాముఖము)

అష్టమస్కంధము గజేంద్ర మోక్షణ కథ ఇందు వన వర్ణన యొద్దు దీర్ఘ సమాసములతో గ వింపబడినది

వ "అది మఱియును, మాతులుంగల వంగిలుంగిచూతకేతకీ భల్లాతకా మ్రాతక నరళ పనస బదరీ వకుల వంజుళ వటకుటజ కుందకురవక కురంటక కోవిదారఖర్జూర నారికేళ సిందువార చందన పిచుమంద మందార జంబూజంబీర మాధవీ మధూక తాలతక్కోల తమాల హింతాల రసాల ప్రియాళు బిల్వామలక క్రముక కదంబకరవీర కదళీక పిత్థకాంచన కందరాళ శిరీష శింశు పాశోక నాగ పున్నాగ చంపక శతపత్ర మరువక మల్లికామతల్లికా ప్రముఖ నిరంతర వసంత సమయ సౌభాగ్య సంపదం కురిత పల్లవిత కోరకితకుసుమిత ఫలిత లలిత విటప విటపి వీరున్నివహావలం కృతంబును

సప్తమ స్కంధము—శ్రీ నృసింహ రూపా విర్భావ ఘట్టము (7—285)

నవమస్కంధము — శ్రీ పరమేశ్వర జటానిర్గతగంగా ప్రవాహ వర్ణన॥ 9—230

దశమస్కంధము — పూర్వభాగము రాసక్రీడాభివర్ణన 10—1—1081 జరాసంధ యుద్ధ వర్ణన 10—1—1675 రుక్మిణీ గౌరీ మందిరా గమనము 10—1—1745

ఉత్తర భాగము — షోడశ సహస్ర స్త్రీ సహితాంతః పురవర్ణనము 10—2—601

వీని యన్నింటి యందు దీర్ఘ సమాస భూయిష్ఠ రచనమొండుకొని యున్నది

పద్యరచన — విశేషములు

1 తృతీయా విభక్తి ప్రత్యయము 'తోడ' అనుదానిలుప్త రూపము'తో' అను దానిని పోతన హెచ్చుగా వాడును

శా తాటంకాచలనంబుతో, భుజనటత్ ధమ్మిల్లబంధంబుతో
శాటీ ముక్తకుచంబుతో, సదృఢచంచత్కాంచితో శీర్ణలా
లాటా లేపముతో మనోహర కరా లగ్నోత్తరీయంబుతోఁ
గోటీందు ప్రభతో నురోజభరసంకోచద్విలగ్నంబుతోన్

8—102

మ  భట సంఘంబులతో రథావళులతో భద్రేభయూథంబుతో
బటువేగాన్విత ఘోటక వ్రజముతో బంధు ప్రియ శ్రేణితో
కటుసంరంభముతో విదర్భతనయన్ గైకొందునంచున్
10—1—1719

2 'అగు' అను క్రియకు క్త్వార్థక రూపమగు ఐ ('అయి') అనుదానిని పోతనవిరివిగా వాడెను

మ  పరుడై, ఈశ్వరుఁడై, మహామహిముఁడై, ప్రాదుర్భవస్థానసం
హరణ క్రీడనుఁడై, త్రిశక్తి యుతుఁడై, యంతర్గత జ్యోతియై
2—58

మ  శరియై, కార్ముకియై, మహాకవచియై, సన్నాహియై, వాహియై
సరథుండై, సనియంతయై, సబలుఁడై, సత్కేతనచ్ఛత్రుఁడై
7—404

సీ  రాకేందు బింబమై, రవి బింబమై యొప్పు
నీరజాతేక్షణ నెమ్మొగంబు
కందర్పకేతువై, ఘన ధూమకేతువై
యలరు పూఁబోడినేత్రాంచలంబు
భావజపరిధియై, ప్రళయార్క పరిధియై
మెఱయు వాకృష్టమై మెలఁత చాప
మమృతప్రవాహమై, యమృత సందోహమై
తనరారునింతి సుదర్శనంబు

ఆ వె  హర్షదాయియై, మహారోషదాయియై
పరగు ముద్దరాలి బాణవృష్టి
హరికి నరికిఁజూడనందంద శృంగార
వీర రసము లోలి విస్తరిల్ల
10—2—193

3 నన్నయాది మహా కవులయందు వలె పోతన కవిత్వమునందు పద్యాదిని యెత్తుగడలో వచ్చిన పదములే యావృతములగుచుండును

సముఁడై యెవ్వఁడు 1—55
సముఁడై స్నేహముచే 3—803

| | |
|---|---|
| అన్య కథానులాపములహర్నిశమున్ వినునట్టి | 2—113 |
| అన్య కథానులాపములహర్నిశముం బరిహరించి | 3—222 |
| వరయమునా నదీ సలిల | 3—108 |
| వరయమునా నదీ జలనివాస | 12 |
| ఒకవేయుర్క్కలు గూడి | 8—159 |
| ఒక మున్నూరు గదల్చి తెచ్చిన | 9—262 |
| ఒక యేనూరు కరమ్ములున్ | 9—454 |
| ఇతఁడే దానవ చక్రవర్తి | 8—543 |
| ఇతఁడే రామనరేంద్రుడు | 9—325 |
| చండస్ఫూర్తివటుండు | 8—531 |
| చండస్ఫూర్తినతండు | 9—203 |
| నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు | 9—361 |
| నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు | 10 10, 10 పూ |
| బాలుండీతడు మంచివాఁడు | 10—686 |
| బాలుండీతడు కొండ దొడ్డది | 920 |
| తన వెంటన్ సిరి | 8—98 |
| తన వేంచేయు పదంబు | 8—100 |
| సప్తస్కంధ శిలాకలాప | 2—185 |
| సప్తాబ్దంబుల బాలుఁడు | 187 |
| సప్త ద్వీప విశాల భూధరము | 8—97 |
| సప్తాంభోనిధి మేఖలా | 9—527 |
| అఖిల వ్యాపార పారాయణుల్ లేరే | 3—301 |
| అఖిల వ్యాపార పారాయణుల్ | 8— |

4 తెలుఁగు పదముల రచనకు మచ్చు —

క తొలుకారు మెఱుఁగు కైవడి
తళతళమను మేను మెఱయ ధగధగమనుచుం
గలుములు నీనెడు చూపుల
జలజంబుల మొదలి కొంకి సిరివుట్టె నృపా ! 8—263

సీ పాలమున్నీటిలోపలి మీద మీఁగడ మిసిమి జిడ్డునఁజేసి మేను వడసి
క్రొక్కారు మెఱుఁగుల కొలఁక క్రొత్తళుకుల మేనిచే గలనిగ్గు మెఱుఁగుసేసి
నాఁటి నాటికిఁ బోదినవకంపుదీవలనునుబోద నెయ్యంబు నూలు కొలిపి
క్రొవ్వారుకెందమ్మి కొలఁకునుఁ బొద్దునఁబొలసిన వలపులఁ బోదివెట్టి

గీ పసిఁడి చంపకదామంబు బాగు గూర్చి
నారు క్రొన్నెల చెలువున వాఁడదీరి
జాణ తనమున చేతుల జడ్డు విడిచి
నలువయీ కొమ్మ నొగి చేసినాఁడు నేడు 8—266

తెలుఁగున గూడ కందములలో సర్వ లఘుకందములు గలవు

క అడిగెదనని కడువడిఁజను
నడిగినఁదనుమగుడనుడుగఁడని నెడ నుడుగున్
వెడవెడ చిడిముడిఁతడఁబడ
నడుగిడు నడుగిడదు జడుమనడుగిడు నెడలన్ 9—10

5 పోతన తెలుఁగు పదరచనలో, దేశి పదములు ప్రాంతీయములునుండవు
6 పోతన రచనలయందు ఛందో వైవిధ్యముగానుపింపదు
దండకములు రెండు భాగవతమున గలవు
ఒకటి విదుర మైత్రేయ సంవాదమున నున్నయది 3 స్క— 203
రెండవది అక్రూర దండకము ప్రసిద్ధినందినది 10 స్క 1—1233
తరల — పంచ చారము — భుజంగ ప్రయాతము — మత్త కోకిల — సకృత్తుగా నుపయుక్త మైనవి

7 పోతన చిన్న కంద పద్యమునందైన పెద్ద భావమును సూచించును క్షీరసాగర మథన ఘట్టమున మోహిని యమృత భాండముతో వచ్చునపుడు, పోతనయొక్క కంద పద్యములోనేనామె లోకోత్తర సౌందర్యము ప్రదర్శించినాఁడు పద్యమిది —

క శ్రోణీభర, కుచయుగభర
వేణీ భరములను డస్సి వివిధా భరణ
శ్రాణయయి యువిద వచ్చెను
పాణి సరోజమున నమృత భాండముఁగొనుచున్ — 8 313

ఇచట 'భర' శబ్దము మూడు పరియాయములు వచ్చినది స్త్రీ సౌందర్యమునకు మూడు "భరము"లుండుట శాస్త్రీయమైన విషయము అవి "కచభార కుచభార, నితంబభారము"లు వీనిలోనేయొక్క భారములోపించిన నది సౌందర్య లోపమే దేవతా స్త్రీ వర్ణనమునుబాదమునుండి శిరస్సు వఱకు క్రమముగా వర్ణించు సంప్రదాయమునననుసరించి, పోతన, మొదట శ్రోణీభరము— నితంబము ఆపై కుచభరము, ఆపై వేణీ — కచ భరమును వర్ణించెను ఇది యెంతేని యుచితముగ నున్నది వేఱొక కవియైన యీ ఘట్టమున నధమమొక సీస పద్యమైన వ్రాసి యుండును

8 దశమస్కంధమున శ్రీ కృష్ణుని బాల్య వర్ణనలో యశోద శ్రీ కృష్ణుని "మన్ను దింటివి నోరు తెఱువు" మని దండింప బోవు సమయమున, శ్రీ కృష్ణుడు నోరు తెఱచెను అప్పుడామెకు సమస్త బ్రహ్మాండమును నందగపడెను ఇచటను నొక కంద పద్యమే పోతన వ్రాసెను —

క ఆ లలితాంగిగనుంగొనె
బాలుని ముఖమందు జలధి పర్వత వన భూ
గోళ శిఖి తరణి శశిది
క్పాలాది కరండమైన బ్రహ్మాండంబున్ 10 1 340

ఈ పట్టున పోతన కవితా దృష్టి యెంత సూక్ష్మమైనదో పరిశీలింపుడు శ్రీ కృష్ణుం డొక్కమారే నోరుఁదెఱచినాడు వెంటనే యశోద బ్రహ్మాండ దృశ్యము గోచరమైనది కృష్ణుఁడెంత సేపు నోరు తెఱచుకొని యుండఁగలఁడు? కృష్ణుని మాట యేల, మనము మాత్రమెంత కాలము నోరు తెఱచికొని యుండఁగలము ? ఒక త్రుటికాలము మాత్రమే ఆ యల్పాల్ప కాలములో గాన వచ్చిన దృశ్యమును, ఒక్క క్షణ కాలము మాత్రమే కాంచిన దృశ్యమును, నొక చిన్న కందములో పోతన యిమిడ్చెను నిదానముగా చూచిన వస్తువైన గదా, పెద్ద పెద్ద వృత్త ములతో, వచనములతో సావధానముగా, చిత్రించుట కనుకూలపడును? నేటి చలన చిత్రములందు వలె, నొక్క మెఱపువలె, కృష్ణుని నోటియందు బ్రహ్మాండ గోళము కన్పించినది "మించెను కరిము కురంబును బంచాక్షరిలో శివప్రపంచముభంగిన్" అను రీతిని కృష్ణుని యాస్యదర్పణమునఁ బ్రతి బింబితమైన బ్రహ్మాండమును పోతన కందమను చిన్ని పద్దెపుటద్దమునఁ బ్రతిబింబింప జేసినాడు అద్దమున నీడ యెంత సేపు నిలుచునో, దానిని గూర్చి చెప్పు మాటకంతకన్న హెచ్చు కాలమెట్లు పట్టును? కావుననే కంద పద్య రచనము

పోతన భాగవతమును చంపూ పద్ధతిని కవిత్రయమతానుసారియై రచియించినను, నన్నయ తిక్కన యెఱ్ఱనల కవిత్వమునకు, పోతన కవిత్వమునకు శైలియందు భేదములు గాన్పించుచున్నవి

| కవిత్రయము | పోతన |
|---|---|
| 1 వ్యాకరణ ప్రయోగ ప్రౌఢిమ | సుకుమార పద రచన |
| 2 అన్వయ కాఠిన్యము | అన్వయ సౌలభ్యము |
| 3 ఆంధ్ర పద బాహుళ్యము | సంస్కృత పద బాహుళ్యము |
| 4 అర్థాలంకార విశేషములు | శబ్దాలంకార రచన<br>అనుప్రాస ప్రాధాన్యము |
| 5 యతిప్రాస స్థలములలో సంధి గతములు, పదమధ్యాక్షరములు గలిగి చదువుటకు ననువుగాక ప్రౌఢమై యుండుట | పాదాంతమున విశ్రమ స్థానంబులు పదములు ముగియుచు చదువ సులభములై సరళములై యుండుట |
| 6 పద వాక్య సౌష్టవము | రసోచిత రచనా వైఖరి |
| 7 అర్థ సారస్యము | రస సౌభాగ్యము |

## ఛందస్సు-యతులు-(ఉ-వు) యతి

భాగవతమునఁబెక్కు చోట్ల హల్లైన 'వు' కారమునకు, అచ్చు ఉకారముతోను, తన్మిత్రముల తోను యతి కలదు ఈ యతులు ప్రాచీన కవులును, మధ్య కాలపుఁగవులునుపయోగించినను అప్ప కవీయమున నీ యతి లేని కారణమున, భాగవతము నందన్ని చోట్ల పాఠములు మార్పఁబడినవి కాని తాళపత్ర ప్రతులలో నట్లే నిలిచి యున్నవి

1 ద్వితీయస్కంధము — క నభిమత మొప్పఁగ నాసప్త తంతువుమ గావింపన్ 97 ప
అచ్చు నభిమతమొప్పఁగ నా సప్త తంతువొగి గావింపన్

2 తృతీయస్కంధము —
చ నెట్టివారిమే
లొదవఁగగానవచ్చు గురువుల్ ప్రియ శిష్యులు గొల్వ — 255 ప
అచ్చు చ నెట్టివారిమేల్
వదలక కానవచ్చు గురులం బ్రియ శిష్యులు గొల్వ

ఈ పాఠమున నన్వయము కుదురక పోవుటచేఁగాఁబోలు — 'వదలక కానవచ్చు, అను చోట? అని ప్రశ్నార్థకచిహ్నముతో పరిష్కరించిరి కాని పై ఉ వు యతిపాఠమా సందేహముఁ గీర్చఁజేసినది

2 కా—వున నీ వేళన త్రుంపు సజ్జన హితో — ద్యోగానురక్తుండవై 669 ప
అచ్చు — కా — వున నీ వేళన త్రుంపు సజ్జన హిత ప్రోద్యానుర్తుండవై

3 చతుర్థ స్కంధము —
క హాహాధ్వని యొదవగ నిట్లనిరి మానవులు త్రిదశులునీ
అచ్చు — హాహాధ్వని పొదలుగ నిట్లనిరి మానవులు
కొన్ని ముద్రణలలో 'పొదలఁగ'

4 ఉజ్జ్వలంబుఁ శతయోజనంబులు పొడ—వును పంచసప్తతి యోజనములు 137 ప
అచ్చు — పొడవొగి పంచ సప్తతి యోజనములు

5 కావున సలుపుణ్య తీర్థముల నొప్ప— 931 ప
అచ్చు కావున పుణ్య తీర్థములబోల — ఇచ్చట ఉ వు యతి నివారణ కొరకు పాఠమే మార్పు చెందినది

## దశమ స్కంధము - ఉత్తర భాగము

1 కావునదగ నర్జునుండు పవనోద్భవుండున్ — 714 పద్యము
అచ్చు — కావున విజయుండునుంబవన పుత్రుండు

2 మహోగ్రుండై పట్టితెచ్చె సాల్వుండు గడగి — 899
అచ్చులో — చిత్రముగ నిది మార్పు లేకయే యున్నది

3 ఒనరింపమీరి నవ్వుటయుఁ — 1153
ఈ పట్టున మార్పు లేకయే యున్నది

మీది పాఠముల నన్నింటిని మార్చు చేసిన పరిష్కర్తలీ రెండింటినెట్లు విడిచిరో తెలియుట లేదు

ఈ ఉ వు యతి విచారణమొక్క పెర భేదము విషయమే కాదు, మరి యొక ముఖ్యాంశమునకు భాగవత శ్రైధిల్య విమర్శకుల కాధారమైనది ఏమనగా, నిట్టి యతులు వారయు కవిత్వములోనే గలవనియు, పోతరాజుగారట్టి యతులను నుపయోగింపరనియు వారి యభిప్రాయము కాని యిట్టి యతిని పోతనకు ముందు వెనుక నున్న కవులందఱును నుపయోగించియే యున్నారు చూడుడు —

1 పాల్కురికి సోమనాథుడు —
దేవునకు నమంగువాడనని యుత్సుకతన్ వృషాధిప శతకము 98 ప

2 గౌరన నవ నాథచరిత్ర —
ఒక్కనిడించి పోవుటయు భీతిల్లి — 92 పుట
ఉండంగఁదగిన తావులను 177 పుట
3 పిడుపర్తి సోమన — పద్య బసవ పురాణము
నిత్యుండని కూర్పుండఁజేయుచుత్సవ యుతులై — (1—152)

4 తిమ్మ కవి ద్విపద భారతము —
ఓజమై జరయు చావుకు దేవుల్లని 21 పుట
ఉడిపి కోటాని పోవుచునుండి 41 పుట

ఇట్టివింకను చాలగా గలవు (వూడూడు అప్పకవీయము పంచమ ముద్రణ పీఠిక వావిళ్ల ప్రకటితము 1951)

అను ప్రాసలు —

పోతనగారిదేయని యుండఅంగీకరించు సప్తమ స్కంధమున నొక యనుప్రాసమిట్లు గలదు

క సురరాజవైరి లోఁబడె
పరిభావిత సాధు భక్త పటలాంహునకున్
నరసింహునకు నుదంచ
త్కరతర జిహ్వునకునుగ్రతర రంహునకున్ (7—293)

ఇచట — లాంహునకు, సింహునకు, జిహ్వునకు — రంహునకు అని యనుప్రాస — కాని జిహ్వునకు అను చోట యనుప్రాసము తప్పినది యని పరిష్కర్తల భావము కాని

యచట యతిప్రాస తప్పు రేదు జిహ్వానకు లను చోట 'జింహ్వానకు' అనియే పోతన ప్రయోగించి యుండెను కాని ఇట్టి యుచ్చారణ పామర జనులదే యని యనుకొన నక్కఱ లేదు పండితకవులుపయోగించినారు

తాళ్లపాక పెద తిరుమలయ్యగారు తమ సుదర్శన గడలో నీ ప్రాసను వాడియున్నారు

''విస్ఫారితపరక వీరము చక్రము —
సైంహికేయగళ సంహార చక్రము''

# 8. పోతన ప్రతిపాదించిన భక్తిరీతులు

## 1 భక్తిశృంగారము

భాగవతమున పోతన, భక్తి తత్త్వము నతి లోకోత్తరముగ బ్రదర్శించి, యా తత్త్వమును సాహిత్యమున సుప్రతిష్ఠితము గావించినాఁడు భక్తి తత్త్వముతో కావ్య రసముల యందు రసరాజ మనిపించుకొన్న శృంగారమును సమ్మేళనము చేసి యున్నాఁడు కావున పోతన ప్రతిపాదించిన శృంగార రసము, ఆలంకారిక రసనిర్వచనములకన్నభిన్నమై, "భక్తి శృంగారము" అనునొక నూతన సాంకేతికము దాల్చినది

ఈ భక్తి శృంగారమును, తెనుఁగు సాహిత్యములో తొలుదొలుత ప్రవేశ పెట్టినవాఁడు పాల్కురికి సోమనాథుఁడు ఆతడు భక్తి శృంగారము అనునొక క్రొత్త రీతి శృంగార రసమును తన కావ్యములలో బ్రతిపాదించినాఁడు బసవని పెండ్లి కాలమున నాతని మూర్తిని వర్ణించుచు—

"భక్తి శృంగార మేర్పడఁజూఁగొన్న
భక్తి కళార్ణవు బసవయ్యఁజూచి"

అని యీ పదమునుపయోగించి యున్నాఁడు

"భక్తి శృంగారముల్ భవు భక్తి పరవి
రక్తి భావములఁ నారాధ్య సంపదలు"

అని పండితారాధ్య చరిత్రమున దీనిని వివరించి యున్నాఁడు శైవ గ్రంథ పారాయణుఁడగు పోతన యీ తత్త్వమును పాల్కురికి సోమనాథుని నుండియే గ్రహించి యున్నాఁడు సోమనాథుఁడు బసవన భక్తి భావమును వర్ణించుచుఁజెప్పిన

ద్వి "వడిఁబాఱు జలమున కొడలెల్లఁగాళ్లు
వడిఁగాలు చిచ్చున కొడలెల్ల నోళ్లు
వడి వీచు గాడ్పున కొడలెల్లదలలు
వడిఁజేయు బసవన కొడలెల్ల భక్తి"

అను భక్తి రస ప్లుతములగు పలుకులు, పోతనకు నన్వయించును పోతన యాపాద మస్తకము భక్తి స్వరూపమే

ద్వి 'శివా' యనఁగ చిన్న పాపలఁ బడదే?
పశులకు నైనను బ్రాపించదే భక్తి
శివా యనఁగ చిన్న పాపఁ బొందదే?
పసి బాలురకు నైన నొసఁగదే భక్తి

అను సోమన పలుకులను సమన్వయించిన —

పోతన యనఁగనే, మనకు భక్తియే పూర్ణముగా భాసించును

కాని శివ భక్తి రసమును ప్రపంచించిన పాల్కురికి కృతులలో శృంగార రస మంగమ్మైన కాదు అవి యామూలాగ్రముగ భక్తి రస ప్రధానములు నన్నె చోడ మహా కవి కుమార సంభవమున శృంగారరసమే ప్రధానమ్మైనది అది కావ్యము అందు భక్తి ప్రపంచితము కాలేదు కవిత్రయము వారి కవితారచన యందలి రసనిరూపకత్వము వేఱు నన్నయ నాదరసజ్ఞుడు తిక్కన నాటక విహార రసికుఁడు, కావ్య రససిద్ధి యందద్వైతానందామృతమును చూపిన మహాకవి — ఎఱ్ఱన యన్న రసవాదియయ్యు శంభుదాసుఁడు దాసుఁడైనను నాతఁడు భావుకుఁడు, సంయమనశీలి ఎఱ్ఱన భక్తిరసానుభవము పరిణత బుద్ధులగు పండితులకు మాత్రమే అనుభవైక వేద్యము సాహిత్య రసపోషణ సంవిధాన చక్రవర్తి యగు నాచన సోమన రచనలో శృంగార రసమంగ మ్మైనను నందు భక్తి రసము మృగ్యము శ్రీనాథ మహాకవి రచనలలో శృంగార రసము ప్రాధాన్యము వహించినను నందు భక్తి రస మంగికాదు విశుద్ధ ముగ్ధ మోహనమ్మై, విశ్వ జనీనమగు భక్తి రసమును, వినీతి శృంగార తరంగితముగా నొనర్చి సంగాంగీ భావ సమన్వయముతో, గంగా యమునా తరంగిణులవలె సమ్మేళన మొనర్చి, యైహికాముష్మికానందములను నాంధ్ర లోకమునకు ప్రసాదించి, యమృత తత్త్వమును గూర్చినది పోతన భాగవత కవితయే

కావ్యానుభూతితో ప్రత్యక్షానుభూతిని మేళవింపఁజేసిన మహాకవి యగుట చేతనే పోతన భాగవతమును భక్తి రచనా శిల్పమునకు పరమావధిగా సంతరింపగలిగినాఁడు భక్తి రసానుభావముతో ప్రశస్త రచనా సౌందర్యమును సంపుటీకరించుట చేత, భాగవతమున, ప్రతిపదము రసస్నిగ్ధము, ప్రతిపద్యము రసగుళిక, ప్రతిఘట్టము రసమయమునై విరాజిల్లినది

భక్తి రసతత్త్వమును ప్రతిభావ్యుత్పత్తుల చేత గ్రహించుట వేఱు తదనుభవ సాక్షాత్కారము గలిగి యుండుట వేఱు భక్తి రసాస్వాదము చేతనే పోతన భాగవతమున కథా వస్తువున కొక కమనీయ కల్పన, భావసరణుల కొక వ్యాఖ్యానము, భక్తి రసమునకొక యుద్దీప్తత గలిగినది భక్తి శృంగార లహరీ స్నాతుఁడగు పోతన, బహుగరుచి నవరస భరితముగ, నవనవోన్మేషముగ భక్తి రసమును వెలార్చెను వ్యాఖ్యాతల భావ సరణికి వ్యాఖ్యాతయయ్యెను భక్తి రస విద్యోపాధ్యా

యుండగా పోతన, విద్యార్థులలో రస గ్రహణ శక్తిని పెంపొందింపఁ జేయు గురువు వలె, యాపిదాంధ్ర మహాజనుల హృదయములను భక్తిరస స్నాతములుగఁ జేసెను ఆంధ్ర కవితను భక్తి రసస్నిగ్ధముగ నొనర్చిన ప్రథమ కావ్య తీర్థము భాగవతము పోతన భాగవతమాలని యంత రాత్మ పలికినది పలికించిన వాఁడాత్మా రాముఁడు — ఆ సన్నివేశమున నాంధ్ర ప్రకృతి భక్తి పులకితమైనది ప్రకృతిలో లీనమైన ప్రతిభయు సార్వజనీనమై, సర్వాదరణ పాత్రమై, సజీవమై వెలయును సార్వజనీనత్వము, కవితాకళ ఈ రెండును సమ్మేళమును జెందినవి గావున భాగవతమునకు సర్వవ్యాపకత్వము సంఘటించినది

పోతన కవితావిర్భావమునకు మూలకందమాతని భక్తి రస భావనా సమాధి దాని ఫలము భాగవతము కాబట్టియే యా గ్రంథమున రసవంతముగాని పద్యము లేదు మాధుర్యము లేని భావము లేదు మనశ్శాంతినిఁగూర్పని ఘట్టము లేదు

భక్తి శృంగారమునకు పరమావధి యైన దశమస్కంధమున శ్రీ కృష్ణ గోపికా శృంగార లీలా ప్రదర్శనమున పోతన ప్రదర్శించిన లోకోత్తర ప్రతిభ, భక్తి తత్త్వము, వంగ దేశమున చైతన్య స్వామి ప్రతిపాదించిన మధుర భక్తి భావమునకు నాధారమైనది గుజరాతు దేశమున 'పుష్టిమార్గ'' స్థాపకులగు వల్లభాచార్యుల సిద్ధాంతమునకు నిది ప్రాతిపదికయైనది పోతన యీ భక్తి మార్గమున కెట్లు దర్శకుఁడయ్యెనో యిక చదువుగాము

2 నవవిధ భక్తి

భాగవతము సప్తమ స్కంధమున ప్రహ్లాదుఁడు, తండ్రియైన హిరణ్యకశిపునితో భక్తి మార్గము నవ విధములుగానిరూపించి యున్నాఁడు

మ తనుహృద్భాషల సఖ్యమున్, శ్రవణమున్, దాసత్వమున్, వందనా
ర్చనమున్, సేవయు నాత్మలో నెఱుకయున్, సంకీర్తనల్, చింతనం
బనునీ తొమ్మిది భక్తి మార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స
జ్జనుడై యుండుట భద్రమంచుఁదలఁతున్ సత్యంబు దైత్యోత్తమా
7—167 ప

దీని మూల శ్లోకము —

శ్లో శ్రవణం కీర్తనం విష్ణోస్స్మరణం, పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనం
ఇతి పుంసార్పితా విష్ణోభక్తిశ్చే న్నవలక్షణా
క్రియతే భగవత్యద్ధా తన్మన్యే ధీతముత్తమమ్,

మూల శ్లోక క్రమము ననుసరించిన

1 శ్రవణము, 2 కీర్తనము, 3 స్మరణము 4 పాద సేవనము, 5 అర్చనము, 6 వందనము, 7 దాస్యము, 8 సఖ్యము, 9 ఆత్మ నివేదము

తెలుఁగున

1 సఖ్యము, 2 శ్రవణము, 3 దాసత్వము, 4 వందలనము, 5 అర్చనము, 6 సేవ, 7 ఆత్మ జ్ఞానము, 8 సంకీర్తన, 9 చింతన అని క్రమము తప్పినది అయినను మూలార్థము విశదముగా నున్నది

ఈ శరీరమునకు నవ ద్వారములున్నవి కావున నవవిధ భక్తి మార్గములు తత్సాధన ఫల ప్రాప్తి కుపదేశింపఁబడినది — తెనుఁగున దేహమునకు 'తొమ్మిది చిల్లుల బొంది' అని పేరు[1] పోతనయు సంస్కృత నవశబ్దమునకు సరియైన తొమ్మిది శబ్దము నుపయోగించెను — ఈ నవ విధ భక్తికి చారిత్రకముగ నింకొకయర్థము కూడ స్ఫురించుచున్నది

'నవ' యనఁగా నూతనమని యర్థమున్నది చారిత్రకముగనీనవభక్తి విధానము, నూతనమే. ఏలననఁగా భక్తిని నీవిధముగా "నవ విధములు"గా విభజించిన మొదటి గ్రంథము భాగవతమే అందు వలననే భాగవతము భక్తి సిద్ధాంతమునకు పరమ ప్రమాణమైనది ఈ సిద్ధాంతము, తొలుత దేశ భాషలలో, తెలుఁగున దక్షిణ భారతమున గల యాంధ్ర దేశమున భాగవత మూలమున ప్రతి పాదితమై యా వెనుక నార్యావర్తము నాక్రమించినది ఈదృష్టితోఁజూచినను పోతన భాగవతమునకు యావద్భారత దేశమున స్థానము గలదు

పై నవ విధ భక్తి మార్గములలో "దాస్యభక్తి" హెచ్చుగా తెలుఁగు భాగవతమున ప్రతిపాదిత మైనది

3 ఆత్మార్పణము — మధుర భక్తి

దశమస్కంధమున , గోపికా గీతలు — భ్రమర గీతలు — రాసక్రీడ — జలక్రీడ — ఇవి యన్నియు నత్యంతము మధుర భక్తి సంభరితములు. శ్రీ కృష్ణుని యాత్మ గోపికలందఱి యందును స్పందించినది సమస్త విశ్వమును శ్రీకృష్ణమయమైనది అచ్చట నేచాయఁజూచిన కృష్ణ పాదాంకిత స్థలములే! ఏ మూలఁదిలకించిన, కృష్ణ లీలా విలాసములే! ఏ పట్టున నిలిచిన

---

[1] కల్ల నిజంబుగాఁగఁగనుపట్టుచు తొమ్మిది చిల్లి బొందిలో
కల్లడిగా గనించి తమకంబను నీటినీ — తెలుఁగు పొలుపు (మించుపల్లి)

కృష్ణ సన్నిహిత మాధుర్య భావమే! ఏ ధ్వని విన్న కృష్ణుని యాణీయస్తర మధురమైన వేణుని నాదమే ఈ మహోజ్జ్వల భావ సన్నివేశమున, పోతన గోపికలు శ్రీ కృష్ణుని వెదకు పధకముఁ జూడుఁడు

ఉ నల్లనివాఁడు, పద్మ నయనంబులవాఁడు, కృపారసంబుపైఁ
జల్లెడువాఁడు, మౌళి పరిసర్పిత పింఛమువాఁడు, నవ్వురా
జిల్లెడు మోము వాఁడొకఁడు చెల్వల మాన ధనంబుఁ దోచెనో
మల్లియలార! మీ పొదల మాటున లేఁడుగదమ్మ చెప్పరే

ఉ అంగజునైనఁ జూడ హృదయంగముఁడై కరగించువాఁడు శ్రీ
రంగ దురంబువాఁడు, మధురంబగు వేణురవంబువాఁడుమ
మ్మంగజు పువ్వుదూపులకు నగ్గము చేసి లవంగలుంగనా
రంగములార! మీ కడకు రాఁడు గదా! కృపనున్నఁజెప్పరే
10—1—1010—1011

అన్యాపదేశమునకు ప్రశస్తోదాహరణముగా భ్రమర గీతల యందలి యీ క్రింది పద్యము దీసికొనవచ్చును

మ భ్రమరా! దుర్జన మిత్ర! ముట్టకుము మాపాదాబ్జముల్, నాగర
ప్రమదాలీకుచకుంకుమాంకిత లసత్ప్రాణేశదామప్రసూ
నమరందారుణితాననుండవగుటన్, నాధుండుమన్నించుఁగా
క!మమున్నేపుచుఁ బౌరకాంతల శుభాగారంబులన్ నిత్యమున్

శ్రీ కృష్ణ విరహార్తయైన యొక గోపిక ప్రకృతి నే రీతిగవేఁడుకొనుచున్నదో తిలకింపుఁడు—

సీ అదె నందనందనుం డంతరివాతుండయ్యె
పాటలీతరులార! పట్టరమ్మ!
హేలావతుల కృష్ణ! యేల వాసితివవని
య్యైలేయలతలార! యడుగరమ్మ!
వనజాక్షుడిచటికి వచ్చిడాఁగడు గదా!
చూత మంజరులార! చూడరమ్మ!
మానసీమదనుతో మారొక యెఱిఁగించి
మాధవీలతలార! మనుపరమ్మ!

ఆవె జాతినతులఁబాయనీతియే హరికని
జాతులార దిశలజాటరమ్మ!
కదళులార! పోయి కదలించి శిఖి పింఛ
జూటుఁదెచ్చి కరుణఁజూపరమ్మ!

కరుణరసవ్యంజకమగు పై పద్యమును చదివి కరఁగని హృదయము హృదయమే కాదు పోతన మధుర భావన యట్టి లోకోత్తరమైనది

"శ్రీకృష్ణుండాత్మారాముండయ్యును, గోప సతులకు నెందఱెందఱకు నందఱై నిజప్రతిబింబంబులతోడం గ్రీడించు బాలు పోలికం గ్రీడించె" అను వాక్యము మధుర భక్తి భావనకు మహత్తర గంభీర వ్యాఖ్యానము

# 9. శ్రీనాథ పోతనలు-భక్తి మాహాత్మ్య కథనము

పోతన సమకాలీనుఁడగు శ్రీనాథమహాకవి, తన గ్రంథములను, మంత్రులకు, సామంతులకు, మహదైశ్వర్యవంతులకుఁగృతినిచ్చి ప్రాభవముతో, భోగసమృద్ధితో, పల్లకి పదస్థుఁడై, కవి సార్వభౌముఁడై కవితా సామ్రాజ్యము నేలుచుండెడివాఁడు ఇక పోతనయో, సాత్త్విక ప్రవృత్తిచే, భక్తి ప్రపత్తిచే, సహజ కవితా సంపన్నుఁడయ్యు, నైహిక సంపదలను రోసి, కుటుంబ సంరక్షణకు గృహస్థ ధర్మ నిర్వహణమునకు నెంత సరిపోవునో, అంత ధనము మాత్రమే సంపాదించి, జీవయాత్ర సాగించువాఁడు ఆ ధనమైన, నొరులను యాచింపక తాను స్వయముగ పొలము దున్నుకొనుచు, సస్యములను బండింపుచు కాలక్షేపము చేసెడువాఁడు సకలాంధ్ర మహాజన హృదయ క్షేత్రములను కవితాహలముచే దున్ని, భక్తి సస్యములు నపారముగఁ బండించిన పోతన, వ్యవసాయమే వృత్తిగా చేకొనుటలో వింతలేదు

ఇట్లున్నను— శ్రీనాథుఁడు పోతన యొక్క లోకోత్తర కవితా శక్తిని గుఱితించినాఁడు నివురు గప్పిన నిప్పువలె, మసిపాతఁగట్టిన మాణిక్యము రీతి, మహత్తరమగునాతని కవన శక్తి మాఱుమూల పల్లెలో, మాటువడి యుండుట కాతఁడిచ్చగింపలేదు మరియు నట్టి మహాకవి కృషీవలుఁడై యార్థికముగ నొడుదొడుకులఁ బడుచు, పేదఱికమనుభవించుటయు నాతఁడవగాహనము చేసి కొన్నాఁడు తన వలెనే పోతన చేత గూడ కావ్య వ్యాపారము సాగింపఁజేసి, కవితను కాసుల రాశి గావించి యాతని లేమిని, లేమిగాఁజేయఁదలఁచినాఁడు

ఇట్టి యుద్దేశముతో నొకనాఁడు శ్రీనాథుఁడు పల్లకినెక్కి, ప్రయాణించుచు, పోతన దున్నుకొను పొలము వద్దకు వచ్చెను అప్పుడు పోతన కొడుకు మల్లన యేరు పూన్చి, రెండెడ్లతో పొలము దున్నుచుండెను

శ్రీనాథుఁడు తనకు కేవలము కవితా శక్తియే గాక మంత్ర శక్తి యున్నదని చూపుటకోయను నట్లు, తన పల్లకి మోసెడి నలువురు బోయీలలో నిద్దరిని విడిచి పొమ్మనెను పల్లకి యిరువురు బోయీలతో నడచుచుండెను మల్లన యది చూచి విస్మితుఁడై తండ్రికడకేగి, యా వృత్తాంతము నెఱిఁగించెను పోతనయు, తనయునితో కాఁడికిఁగట్టిన యొక యెద్దును విడువుమనెను మల్లన యట్లే చేయఁగ, నాగలి యొక్క యెద్దుతో పని సేయుచుండెను అంత శ్రీనాథుఁడది చూచి, తక్కిన యిద్దరు బోయీలను విడిచి పొమ్మనెను పల్లకి యట్లే నడచుచుండెను పోతనయు, మల్లనను, మిగిలిన యెద్దును విప్పి వేయమనెను యెద్దులు లేక పోయినను భూమిని నాగలి దున్నుచుండెను శ్రీనాథుఁడంత పల్లకిదిగి, పోతనకు సాష్టాంగపడి, తన యపరాధము

మన్నింపుమని వేడుకొనెను. పోతనయు శ్రీ నాథునెంతేని గౌరవాదరపురస్సరముగ లేవనెత్తి కుశల ప్రశ్న గావించెను శ్రీనాథుఁడును, తన మనసులోని యభిప్రాయము వ్యక్త పఱచుటకిదియే యదన నని తలంచి, యీ క్రింది రీతిని పద్య రూపమునదెలిపెను —

క. కమ్మని గ్రంథంబొక్కటి
యిమ్ముగనేనృపతికైనఁ గృతి యిచ్చిన గో
కొమ్మని యీయరె యర్థం
బిమ్మహి దున్నంగ నేల యిట్టి మహాత్మా!

వెంటనే పోతన పై కంద పద్యమునందలి భావమును వ్యాఖ్యానించుచు, శ్రీనాథునికి సూటిగ ప్రత్యుత్తరము నిచ్చువానివలె, యీ క్రింది పద్యముఁజదివెను —

ఉ. బాలరసాలసాల నవపల్లవ కోమల కావ్య కన్యకన్
గూళల కిచ్చి యప్పడుపుకూడు భుజించుట కన్న సత్కవుల్
హాలికులైన నేమి? గహనాంతర సీమల కందమూలకౌ
ద్దాలికులైన నేమి? నిజదార సుతోదర పోషణార్థమై

పోతన ప్రత్యుత్తరమెంత భావ గర్భితముగ నున్నదో చూడుఁడు "కమ్మని గ్రంథము"— అనుటకు "బాల రసాలసాల నవ పల్లవ కోమల కావ్య కన్యక" అని పోతన వ్యాఖ్యానించినాఁడు అయ్యా! నీవు చెప్పినది 'కమ్మని గ్రంథము కాదు' అది 'కావ్య కన్యక' ఆ కన్యకయు, కోమలమైనది—చాల సుకుమారమైనది—ఆ కోమలత్వము, కేవల పల్లవ కోమలము గాదు—నవ పల్లవ కోమలము ఈ నవ పల్లవము రసాల సాలమునకు సంబంధి ఈ రసాలము — బాల రసాల సాలము ఇందలి యంతరార్థమిది బాల రసాల సాలము ప్రకృతి సిద్ధము ప్రకృతి సిద్ధమగు సౌకుమార్య మాధుర్య సౌందర్యము గల బాల రసాలము వంటి కావ్య కన్యకను ప్రకృతికి పతియైన పరమేశ్వరునకే నంకితము కావలయును గాని, తద్భిన్నులును, కేవలము, నృపతులకు—నరపతులకు నసఁగా మానవుల కెంత మాత్రమును గాదు అందును 'కూళలగు' వారి కిచ్చుట పడుపుకూడు నాశించుట వంటిది అట్టికూడు నాశించువారికి నాశనమే వేఱుగతి లేదు ఈ పద్యము ప్రతి పదరసగ్రాహి శ్రీనాథుఁడు కందములో పై పద్యము చెప్పి, వలసిన యర్థము వసుధేశులచేఁబడయవచ్చును దానితో కమ్మని భోజనము, లభించును దారసుత పోషణకై తల్లడిల్ల నవసరము లేదు, అను భావము వ్యక్త పఱచినాఁడు పేదవారికి కడుపు నిండ తిండి 'ప్రియమైన' వస్తువు గదా!

పోతన 'కంద' పద్య మూలమున కమ్మనియాహారములభించునని చెప్పినదానికి, తన ప్రత్యుత్తరములో ఆ 'కంద' మూలములే తన శరీర పోషణకే గాక, దార సుతుల పోషణకుఁజాలునని యుక్తి

యుక్తముగఁజెప్పియున్నాఁడు ఇదియునుగాక కావ్యకన్యక — బాలరసాల సాలము అనగా మా కందము అది పరమేశ్వరార్పితమైనప్పుడు, భుక్తియేగాక, ముక్తిని కూడ లభింపఁజేయునని పోతన యాశయము

శ్రీ నాథుని కంద పద్యమునందలి భావము, పోతన 'ఉత్పలము'లో విప్పారినది ఇఁక నొక విశేషము — శ్రీనాథుఁడు చెప్పినది కందము — కందము — సమవృత్తము గాదు అందు నాలుగు పాదములొకే రీతిగా నుండవు రెండు పాదములొక రీతిగాను, మరి రెండు పాదములొక రీతిగానునుండును ఉత్పలమాల, మొదలగు వాని యందు నాలుగు పాదములొకే రీతిగ నుండును పోతన యుత్పలములో చెప్పఁబడిలో భావమేమనగా — నృపతులకు — రాజులకు, కృతినిచ్చిన యెడల కవి జీవితము, సమవృత్తము గాక విషమ (వి+సమ) వృత్తమగును, అర్థము లభించినను, నది యంతరించిన, వెనుక జీవితము విషమముగాక మరేమియగును? అట్లుగాక, జగత్పతి యగు సర్వేశ్వరునకుఁగృతినిచ్చిన, నాలుగు పాదములు గల సమవృత్తమువలె చతుర్వర్గ ఫల ప్రాప్తిని జీవితమున పొందఁగును, అనుటయే

ఇట్లుత్తర ప్రత్యుత్తరములు జరిగిన వెనుక వారందఱు గలిసి యింటికి వచ్చిరి వచ్చునప్పటికాయింటిలో వంట పదార్థములు లేవు పోతన భార్యయు, తనయుడు గూడ వాని కొఱకు పలు చోట్ల ప్రయత్నించియు విఫల మనోరథులైరి పోతనయు, సరస్వతీ దేవినిఁబ్రార్థించి యామె కృప వలన శ్రీ నాథునికి షడ్రసోపేతముగా భోజనము పెట్టెను తొలుదొలుతఁ యింటి యందే పదార్థములేక, తరువాత నాకస్మికముగా భోజన పదార్థములన్నియు లభ్యమగుట శ్రీనాథుని కాశ్చర్యము గలిగించినది భోజనాంతరమున శ్రీనాథుడు పోతనఁజూచి "మహాకవి శ్రేష్ఠుఁడవగు నీవిట్టి మహాదారిద్ర్యమనుభవింపనేల ? ఏ రాజునకైన నొకగ్రంథము కృతినిచ్చి వలయునంత యర్థము సంపాదించి సుఖవృత్తి నుండుట మేలుగదా! లభ్యమగునో కాదో తెలియని పారలౌకిక సుఖంబు మీది యాశ చేత నిహలోక సౌఖ్యంబు నిరాకరించి యిడుమలఁబడనేల!" అని పెక్కు రీతుల బోధించెను పోతన మనసులో నప్పుడే కొంత చంచల భావముదయింపఁదొడగెను తన భక్తుని పరిస్థితి చూచి భారతి వలవల నేడ్చుచు పోతన యెదుట ప్రత్యక్షమయ్యెను అంత నాతఁడీ క్రింది విధమున వాణి ననునయించెను

ఉ కాటుక కంటి నీరు చనుకట్టుపయింబడనేల యేడ్చెదో!
కైటభదైత్య మర్దనుని గాదిలి కోడల! యోమదంబ! యో
హాటక గర్భురాణి! నిను నాఁకటికిం గొనిపోయి యల్లక
ర్ణాటకిరాటకీచకులకమ్మ త్రిశుద్ధిగ నమ్ము భారతీ!

ఈ పద్య మాంధ్రలోక మానాంటినుండి నేటివరకందఱాఱింగినదియే! అయిన నిందలి యర్థమును విమర్శకులు వివరించినట్లు కానరాదు రాజులకు కృతి నిచ్చి, ధన సంపాదన చేసి, దారిద్ర్యము బాపుకొనమని గదా శ్రీ నాథుని ప్రబోధము శ్రీ నాథుని ప్రబోధమునకు ప్రత్యుత్తరము చెప్పినట్లుగా, భారతీ దేవితో పోతన యిట్లు పల్కినాడు

అంకటి కోలకుఁ గర్ణాట కిరాట కీచకులకు కృతినీయననియుఁ, త్రికరణ శుద్ధిగ నమ్ముమనియు భారతికి హామీ యిచ్చుచున్నాడు పోతన! ఇందు పేర్కొనిన మువ్వురును శ్రీనాథునికి సంబంధించిన వారే!

కర్ణాటరాజు—శ్రీనాథుఁడు కర్ణాట రాజగు ప్రౌఢ దేవరాయల యాస్థానమున, ముత్యాలశాలలో కనకాభిషేక మహాసత్కారమును గాంచినవాఁడు—"కర్ణాట క్షితి నాథ మౌక్తిక సభాగారాంతరాకల్పిత స్వర్ణస్నాన జగత్ప్రసిద్ధ కవిరాట్టు"నని యాతఁడు చెప్పుకొన్నాఁడు

కిరాటులు — కిరాటులనఁగా వైశ్యులు శ్రీ నాథుఁడు, తన హర విలాస ప్రబంధమును, కాంచీ పుర నివాసియు, అవచి దేవయ సెట్టి పుత్రుడగు తిప్పయ సెట్టికిఁగృతినిచ్చియున్నాఁడు

కృతిపతి హరవిలాసములోని సిరియాల చరిత్రకుఁగథానాయకుడగు చిఱుతొండ నంబివంశీయుఁడు ఆ చిఱుతొండ నంబిని వర్ణించుచు శ్రీనాథుఁడు "కోటికిం బడగ యెత్తిన నక్కిరాట వంశ కిరీటాలంకారంబు 2—34" అని చెప్పియున్నాఁడు 'కిరాట' పదము అమర నిఘంటువున లేదు కేశవుని నానార్థార్ణవ సంక్షేపమున నున్నది

కీచకులు — కీచకులనఁగా హీన జాతివారు ఈ పదము వలన శ్రీ నాథుఁడు చెప్పిన పల్నాటి వీర యుద్ధ కథ సూచితమైనది మరియు శ్రీనాథుఁడు పల్లె, గొల్ల, మొదలగు శూద్ర జాతుల వారికి లేక హీన జాతుల వారికి సంబంధించిం

కనిత్వమును జెప్పినట్లు సారస్వత చరిత్రకారులందఱు సంగీకరించియు యున్నారు'' 1

పల్నాటి వీర చరిత్ర ప్రశస్త దేశికృతియే యైనను హీన జాతికి వారి కోరిక పైని రచించినదే కదా ![2]

శ్రీ నాథుడీ విధముగా ముప్పుర వలన, వారికి కృతులనిచ్చి గాని, కవితా సమ్మాన రూపమున గాని ధనము నార్జించినట్లుగా, త్రిశుద్ధిగా తానట్టి పనులుచేయనని పోతన భారతీ దేవితో విన్నవించినాడు మరియు, భారతీ దేవితో పోతన చెప్పుటకుఁ గారణ మేమనగా శ్రీనాథుడును బ్రాహ్మీ దత్త వర ప్రసాదుడు కావున నీ సంగతులన్నియు నామెకు తెలియును. కాఁబట్టియే పోతన శ్రీనాథుడట్లు చేసినను, ''నేను మాత్రమట్లు చేయను నా మాట నమ్ముమమ్మా!'' అని చెప్పి యామె ననునయించినాడు ఈ పద్యము, తల్లితో కుమారుడు మాట్లాడినట్లుగా నత్యంతము స్వాభావికముగా నున్నది శ్రీ నాథ పోతనల చిత్త ప్రవృత్తులను సరిగా తెలుపుచున్నది

శ్రీనాథు డొకనాడు పోతన యింటికి వచ్చి, యాతడు వ్రాసిన యష్టమస్కంధమును జూచి యందున్న

మ. సిరికింజెప్పడు, శంఖు చక్ర యుగముంజేదోయి సంధింపడే
పరివారంబును జీరఁ డభ్రగపతింబన్నింపడా కర్ణికాం
తరధమ్మిల్లము చొక్కనొత్తడు వివాద ప్రోత్థిత శ్రీ కుచో
పరిచేలాంచలమైన వీడఁడు గజ ప్రాణావనోత్సాహియై

''అను పద్యమును విమర్శించుచు పోతనతో నిట్లనెను

---

1 ఇతఁడు (శ్రీనాథుడు) పండితాదరణీయములగు కావ్యములంజెప్పుటయే గాక స్త్రీ శూద్రాదులకున యుక్తములై సులభ శైలిలో నొప్పు పాటలు పద్యములు రచియించెను మన దేశములో పెండ్లి పాటలు మొదలగునవియు, గొల్లలు మొదలగు పాటక జాతి పాడుకొను గొల్ల సుద్దులు మొదలగునవి యును, పగటి వేషగాండ్రు చెప్పెడి కొన్ని కథా కలాపములును శ్రీనాథుని విరచితములేయని ప్రసిద్ధి గలదు కవి జీవితములు—గురుజాడ శ్రీరామ మూర్తి, పుట 244

2 ''పల్నాటి గొల్లల పాట జాతి'' అని గణపవరపు వేంకట కవి యీ జాతి వారిని నిరసించి యున్నాడు

"శ్రీ మహావిష్ణువు తన భార్యతోఁజెప్పఁడు శంఖ చక్రాద్యాయుధములు ధరింపఁడు పరివారమును వెంట రమ్మనఁడు తన వాహనమైన గరుత్మంతుని యాజ్ఞాపింపఁడు ఇట్లే సాధన సంపత్తియు లేక ఊరక గజేంద్రుని రక్షించుటకెట్లు వెడలినాఁడు? ఏమి చేయు తలంపుతో వెడలినాఁడు ? అర్థమగుట లేదు"

ఈ మాటలు విని పోతన యిట్లు పలికెను "భక్తావనుండగు పరమేశ్వరుండట్లు పరితాపంబు పొలగుట భక్తుల యెడఁదనకుండు కారుణ్యముఁజూపుటకే కదా! ఇదియె నాకుఁ దోచిన యర్థము సహేతుకముగా నున్నను గాకున్నను భక్తికింగొదువ యేమి?"

శ్రీనాథుఁడీ మాటలు విని యూరకున్నను, తన పద్యము విమర్శనకు వచ్చినదని మాత్రము పోతన విచారించినాఁడు శ్రీనాథునికి నా పద్యార్థము మఱువకుండునట్లు చేయుటకొక యుక్తి యెన్నినాఁడు శ్రీనాథుని కుమారుని యెచ్చటనో దాచి, యతనితో "నీ కొడుకు అకస్మాత్తుగా నూతిలో పడినాఁడు" అని తెలిపెను శ్రీ నాథుఁడా మాటలు వినిన తత్క్షణమే, కళకళపడి, దిగ్గున లేచి, ఎచ్చట, ఎచ్చట? అని పిచ్చలింపుచు పరువెత్తుచుండెను దానిం జూచి పోతన , యాతనితో నిట్లనియె "ఓహో! ఏమియా పరుగు? ఊరక వెడలితి వేల? నూతిలోఁబడిన బాలుని పైకి దీయుటకు సాధనములైన నిచ్చెన యేది? త్రాడేది? ఏమి చేయఁదలఁచి నీ వచటికిఁబోయెదవు నీవును నూతిలోఁ బడుదువా!" అనుచునాతని కడ్డము వచ్చెను అంత శ్రీనాథుఁడు పోతనతో "నా కుమారుని నా కిమ్ము కన్నారగాంచినచో కొంత వంత యుపశమింప గలదు" అని వేఁడుకొనెను పోతన యాతనితో నిట్లనియె—"ఊరక బడియకుము నీ కుమారునికే యాపదయు లేదు ఆ నాఁడు గజేంద్రుని రక్షించుటకు నార్తావనుండగు శ్రీహరి నీ వలెనే పరితాపంబునొందె నీవసమర్థుండవయ్యు వలసిన పరికరములు లేని వాడవయ్యు మిన్నక చూచినంతనే కార్యము సఫలమగునని తలంచినప్పుడు, అఖిల లోకాధీశ్వరుఁడును,తన కుక్షిలో జగములనిడుకొనిన యా శ్రీహరి యూరక గజేంద్రుఁడున్న చోటికరిగిన కొఱంతయేమైన గలదా" అని చెప్పినప్పటికి శ్రీనాథుడు మిక్కిలి ఖిన్నుఁడై, పోతన భక్తి విశేషమును గ్రహించి వెఱి పోయెను

## పోతన భక్తి మాహాత్మ్యము

పోతన యష్టమస్కంధమున గజేంద్ర మోక్షణ కథను వ్రాయుచు "అల వైకుంఠ పురంబులో నగరిలో నా మూల సౌధంబు" అనునంత వఱకు వ్రాసి, యా పైని యేమి వ్రాయుటకును దోఁచక నెచటికో వెడలెను ఒతఁడింటలేనపుడు శ్రీ కృష్ణుఁడు పోతన వేషముతో వచ్చి, కుమార్తెను బిలిచి, వ్రాయుచున్నతాటియాకులందిమ్మని, అందు "ఆ మూల సౌధంబు" అను దాని వెనుక 'దాపల' అని వ్రాసి తిరిగి వత్తునని వెడలి పోయెను కొంత సేపటికి పోతన వచ్చి, కూఁతురిచే గ్రంథము

దెప్పించి, అందు తాను విడిచి పెట్టిన చోట, "ఆ మూల సౌధంబు దాపల" అని వ్రాసి యుండుట గాంచి, యాశ్చర్య చకితుండై "ఇది యెవ్వరు వ్రాసిరి?" అని యామె నడిగెను ఆమెయు నింతకు ముందు మీరే వచ్చి వ్రాసి, యిప్పుడీ రీతి నడుగుచున్నారని ప్రత్యుత్తరము చెప్పెను పోతనయు నా శ్రీహరియె తన యందలి యవ్యాజ్యానురాగముచే తన రూపము ధరించి, యిట్లు చేసెనని యాతని గీర్తించి తనకు ప్రత్యక్షము గాని శ్రీకృష్ణుఁడు తన తనయకు ప్రత్యక్షమగుటయామె భాగ్యమని కొనియాడెను

పోతన దశమస్కంధమున రుక్మిణీ కల్యాణము వ్రాయుచున్నప్పుడు "దేవకీ సుతు కోర్కె తీగలు వీడంగ" అను పద్యమున రుక్మిణీ యౌవనా విర్భావ వర్ణనము సేయుచు "హరికిఁ బ్రేమ బంధ మధికంబుగాఁగేళ బంధమధికమగుచు బాలకమరె" అని వ్రాయఁగా నంతలో నాతని కూతురు, కుంపటిలోఁ బడి కమరెననియు నంతలోన "పద్మనయనువంక ప్రేమదంబు నిండారె" అని వెంటనే వ్రాయునంతలో నామెకు నయ్యాపద దొలఁగెను

పోతన తృతీయ స్కంధమున యజ్ఞ వరాహావతార ఘట్టము రచించుచుండెను ఆ సమయమున శ్రీ హరి వరాహ రూపమున పోతన యింటి యందు మెలఁగుచుండెను పోతన భాగవత రచన కర్ణాకర్ణిగా విని కర్ణాట రాజొక పరియాయ మా గ్రంధము కృతినిమ్మని కోరెను పోతన యా కోర్కె తృణీకరించెను అంత కర్ణాట రాజు పోతన గృహమునకు భటులతో వచ్చి, ముందర తన భటుల నింటిలోని కంపెను 'అచ్చట వరాహ రూపమున శ్రీహరి వారల నదల్చెను వారు నా వృత్తాంతము రాజునకుఁజెప్పిరి అంత కర్ణాట రాజే స్వయముగా రాగా , వరాహము వాని నడ్డగించెను కాని యాతండు మదోద్రేకముతో వరాహము దండింపబోయెను కాని మిఱుమిట్లు గల కాంతి గల మోముతో, నా వరాహమెదురు నిలువగనే, కర్ణాట రాజుకు కళ్ళు కానరాలేదు పోతన యిది యోచించి, రాజని తెలిసికొని పైకి వచ్చి, చూచునరికి వరహామూర్తి మాయమయ్యెను రాజును పోతన మాహాత్మ్యము నెంతయు గొనియాడెను

సర్వాంధ్ర లోక ప్రసిద్ధమైన —

ఉ. ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములు కొన్ని పుచ్చుకొని సొక్కి శరీరము వాసి, కాలుచే
సమ్మెట వ్రేటులంబడక సమ్మతి శ్రీహరికిచ్చి చెప్పెనీ
బమ్మెర పోతరాజొకఁడు భాగవతంబు జగద్ధితంబు గన్

అను పద్యమును, "కమ్మని గ్రంథంబొక్కటి" అనుదానికి కూడ నన్వయింప వచ్చును పోతన నర స్తుతి విముఖత్వమునకు నీ పద్యమే మూలాధారము

# 10 పోతన యనుసరించిన పూర్వ కవులు

భాగవతావతారికయందు పోతన 'ఆంధ్ర కవితా గౌరవ జన మనోహరి నన్నయ సూరి' అని నన్నయకుఁ గైవారము గావించినాఁడు వీరభద్ర విజయమున— 'ఉన్నత గుణ ధుర్యునన్నపార్యు' అని పేర్కొన్నాఁడు ఆ గ్రంథ ప్రారంభమే — అనగా తన కవితా రచనా ప్రారంభమే నన్నయ కవితానుకరణముతో మొదలు —

శ్రీవాణీ గిరిజాశ్చిరాయ దధతో వక్షోముఖాఙ్గేషు యే
లోకానాం స్థితిమావహన్త్య విహతాం స్త్రీపుంసయోగోద్భవామ్
తే వేదత్రయ మూర్తయ స్త్రిపురుషా స్సంపూజితా వస్సురై
ర్భూయాసుః పురుషోత్తమాంబుజభవ శ్రీకన్ధరా శ్శ్రేయసే

(ఆదిపర్వము—ప్రారంభము)

ఈ శ్లోకమును వీరభద్ర విజయమున నిట్లనువదించినాడు

చ సిరియును వాణి గౌరి యనుజెన్నగు కన్యకు మేను, వాక్కుఁబె
న్నురమును నంకువిచ్చి ముదమొప్పవరించి జగంబులన్నియున్
దిరములు సేయఁ బోఁడుదిఁదీర్పఁగ ద్రష్టయు గేక్షణుండునై
హరి విధి శంభు మూర్తి యగు నాద్యుండు మాకుఁ బసన్నుఁ
డయ్యెడిన్

ఉ శ్రీలలితంపుభూరియును శేష విభూషణమున్ శిరంబుపై
వేలుపు టేఱుఁ, పాపటను వెన్నెల పాపఁడు, మేను గొండరా
మూలియుఁగేల ముమ్మొనల శూలము నీల గళంబుఁగల్గునా
వేలుపు శ్రీ మహానగము వేలుపు మాకుఁ బసన్నుఁడయ్యెడిన్

ఈ వాక్యము "మాకుఁ బసన్నుఁడయ్యెడిన్" లనునది చూడఁగనే నన్నయ భట్టారకుని యుదంక స్తుతి జ్ఞప్తికి రాక మానదు ఇందు నాల్గు పద్యములట్టి యంతముతో నున్నవి

భాగవతము దశమ స్కంధము పూర్వ భాగమున గోపికలు శ్రీ కృష్ణుని వెదకు సందర్భమున నీ క్రింది పద్యము గలదు

సీ పున్నాగ! కానవే పున్నాగవందితుఁ
దిలకంబ! కానవేదిలక నిటలు
ఘనసార! కానవే ఘనసార శోభితు
బంధూక! కానవే బంధు మిత్రు
మన్మథ! కానవే మన్మథాకారుని
వంశంబ! కానవే వంశ ధరుని
చందన! కానవే చందన శీతలుఁ
కుందంబ! కానవే కుందరదను

గీ నింద్రభూజమ! కానవే యింద్ర విభవుఁ
గువల వృక్షమ! కానవే కువల యేశుఁ
బ్రియక పాదప! కానవే ప్రియ విహారు
ననుచుఁ గృష్ణుని వెదకి రయ్యబ్జముఖులు 100 ఉ భా

ఈ పద్యము నన్నయ నలోపాఖ్యానమున దమయంతి నలుని వెదకు ఘట్టమున గల పద్యమున కనుకరణము

సీ సహకార! మత్ప్రియు సహకారు, పున్నాగ!
పున్నాగుఁదిలక! భూ భువన తిలకుఁ
జందన! బుధహరి చందనుఁ, బుష్పితా
శోక! సుహృజ్జన శోకదమను
వకుళ! కులైక దీపకు, విభీతక! భయ
భీతార్తి హరునలుఁ బ్రీతితోడ
కానరే? కానరే? కానలోకోత్తరు
నని ద్రమాని ద్రమానికి నరిగి యరిగి

ఆ యడుగునడుగు వెండవడిఁబురపురఁబొక్కి
నిర్ఝరాంతరముల నిలుచు బొలుచు
దరుల గిరుల యెడల నురు గుహాంతరములు
దొంగితొంగి చూచు తోయజాక్షి (భార ఆర 2—94)

పోతన —

చ తరళ తరంగ వీచి సముదంచిత బిందు సరస్సరస్వతీ
సరిదరవింద తుందిల లసత్తరు తీరనివాససన్మునీ
శ్వర నికరాశ్రమాకలిత సంపదలన్ గనుగొంచు వేడ్కము
ప్పిరి గొనవేగె నాత్మపుట భేదన విస్ఫుట మార్గవర్తియై
తృ 783

నన్నయ —

చ బహువన పాదపాబ్ధికుల పర్వత పూర్ణ సరస్సరస్వతీ
సహిత మహా మహీభర మజస్ర సహస్ర ఫణాలి దాల్చదు
స్సహతర మూర్తికిన్ జలధి శాయికిఁబాయక శయ్యయైనయ
య్యహిపతి దుష్కృతాంతకుఁడనంతుఁడు మాకుఁబ్రసన్నుఁ
డయ్యెడిన్

నన్నయ —

ద్రోణుఁడు ద్రుపదుంజూచి యన్న మాటలు

కం వీరెవ్వరయ్య ద్రుపద మ
హారాజులె? యిట్లు కృపణులై పల్కువడన్
వీరికి వలసెనె? యహహా! మ
హారాజమదాంధకారమది వాసెనొకో! ఆది 6—90

పోతన —

యశోద శ్రీ కృష్ణుని దొంగతనము కనిపెట్టి యన్న మాటలు

కం వీరెవ్వరు? శ్రీ కృష్ణులు
గారా? యెన్నడును వెన్నగానదటకదా!
చోరత్వంబించుకయును
నేరరట! ధరిత్రి నిట్టినియతులు గలరే! 10—374

నన్నయ —

మ లమితాఖ్యానకశాఖలంబొలిచి వేదార్థామలచ్ఛాయమై
సమహద్వర్గ చతుష్క పుష్పవితతిన్ శోభిల్లి కృష్ణార్జునో
త్తమ నానా గుణకీర్తనార్థ ఫలమై ద్వైపాయ నోద్యానజా
తమహాభారత పారిజాతమమరున్ ధాత్రీసురప్రార్థ్యమై
ఆది 1—65

పోతన —

మ. లలితస్కంధము, కృష్ణ మూలము, శుకాలాపాభిరామంబు మం
జులతా శోభితమున్ సువర్ణసుమనస్సుజ్ఞేయమున్, సుందరో
జ్జ్వలవృత్తంబు మహాఫలంబు విమల వ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరువుర్విన్ సద్ద్విజశ్రేయమై

1—22

తిక్కన —

పోతన, తిక్కనను గూర్చి 'హరిహర చరణారవింద వందనాభిలాషిం దిక్కనమనీషిం భూషించి' అని (1—12) చెప్పి యున్నాడు తిక్కన యనుసరణములను జూపుదును

తిక్కన —

ఉ. రాజటె! రాగహీనుఁడటె! రాజిత సుందర మూర్తి యట్టె! వి
భ్రాజిత సంపదున్నత విభాసిత వర్తనుఁడట్టె! కామినీ
రాజ మనోజ్ఞ భంగిచతురత్వధనుండటె! బ్రహ్మచర్యదీ
క్షాజిత మన్మథుండునటె జన్మము లిట్టివి యెందుఁగల్గునే?

శాంతి 2—103

పోతన —

రాజటె ధర్మజుండు! సురరాజ సుతుండటె ధన్వి! శాత్రవో
ద్వేజకమైన గాండివము విల్లటె! సారథి సర్వ భద్ర సం
యోజకుఁడైన చక్రియటె! యుగ్ర గదాధరుఁడైన భీముఁడ
య్యాజికిఁదోడు వచ్చునటె! యాపద గల్గుటిదేమి చోద్యమో

1—211

తిక్కన —

సీ. ప్రాణంబుతోఁగూడ రక్కసి చన్నుఁ
పాలుఁ ద్రావిన ప్రౌఢ బాలుఁడితఁడె
వ్రేల్మిడిఁజాణూరు విడిచి లోకముల మె
చ్చించిన యా జెట్టి యితఁడె
దుర్వృత్తుఁడగుకంసుదునిమి యాతని తండ్రి
పట్టంబుఁగట్టిన ప్రభుఁడితండె
సత్యభామకుఁ బారిజాతంబుపైఁగల
కోర్కిఁదీర్చిన రసికుండితండె

గీ వెన్నలును గోపికా చిత్త వృత్తములును
నరసి మ్రుచ్చిల నేర్చిన హరి యితండె
శ్రుతి శిరోభాగములఁదన సుభగచరణ
నరసి జామోదమునుఁగూర్చు చతురుఁడితఁడె భార ఉద్యో

3 160 ప

పూర్వ కవుల ప్రయోగములలో 'అఁట' కు మాఱుగా 'అట్టె' 'అటె' అను ప్రయోగములు మాత్రమే కాన్పించుచున్నవి

పోతన —

సీ వీఁడటే రక్కసి విగత జీవఁగఁజన్ను
బాలుఁ ద్రావిన మేటి బాలకుండు
వీఁడటే నందుని వెలఁదికి జగమెల్ల
ముఖమందుఁజూపిన ముద్దులాఁడు
వీఁడటే మందలో వెన్నలు దొంగిలి
దర్పించి మెక్కిన దాపరీఁడు
వీఁడటే యలయించి వ్రేతల మానంబు
సూఱలాడిన లోక సుందరుండు

గీ. వీఁడు లేకున్న పుర మటవీస్థలంబు
వీనిఁబొందని జన్మంబు విగత ఫలము
వీనిఁబలుకని వచనంబు విహగరుతము
వీనిఁజూడని చూడ్కులు వృథలు, వృథలు 10—1—1249

తిక్కన —

శా యోధాగ్రేసరుఁడిద్ధతేజుఁడు రణోద్యోగానురక్తుండు
భార విరా 3—25

పోతన —

శా యోధాగ్రేసరుఁడీ హలాయుధుఁడు లోకోత్కృష్ట బాహాబల
భాగ 10—1—1558

తిక్కన —

మ. వికట భ్రూకుటి ఘోరమై కలితస్వేదోద్భవుండు

భార విరా 3—25

పోతన —

మ. వికట భ్రూకుటిఫాలభాగుఁడగుచున్ భాగ 2—167

తిక్కన —

సీ. సకల స్థావర జంగమంబులు భవత్సాన్నిధ్య మాత్రంబునన్

భార ఉద్యో 1—186

పోతన —

మ. సకల స్థావర జంగమ ప్రతతికిం జర్చింప దానాఢ్యుఁడై

భాగ 3—1019

ఆంధ్ర కవిత్రయమున మూఁడవ కవి, ఎఱ్ఱన ఈతఁడు 'శంభుదాసుఁ'డయ్యును, 'గోవింద గుణాదర సంభృత సౌమనస్కుఁడు'' ఎఱ్ఱన కృతులలో పోతనను హెచ్చుగా నాకర్షించినది యాతని నృసింహ పురాణము ప్రహ్లాద కథ యందున్నది ఎఱ్ఱన నృసింహ పురాణములోని పద్యములు, పోతన భాగవతమున భక్తి రస విస్ఫూర్తిం బొందినవి ఈ క్రింది సంవాదములను పరిశీలింపుఁడు

ఎఱ్ఱన —

క. ఏనును బెద్దలచే విని
వీనుల కలరఁ దరతరంబ విన్న విధమునన్
మానసమున నున్న తెఱఁగుఁ
గానుపునం గన్న క్రమముఁ గథన మొనర్తున్ నృసిం 1—24

ఆ.వె. భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు
శూలికైన దమ్మిచూలికైన
విబుధ జనుల వలన విన్నంత గన్నంత
తెలియ వచ్చినంత తేట పఱతు భాగ 1—19

ఆ.వె. కుడిచినపుడు నిద్రగూరిన యప్పుడు
మేలుకొనిన యపుడు మెలఁగినపుడు
విష్ణు కీర్తనంబు విష్ణు చింతయు కాని
పలుకఁడొండు బుద్ధిఁదలఁపఁడొండు నృసిం 3—150

శా. పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్ భాషించుచున్ హాసలీ
లానిద్రాదులు సేయుచుందిరుగుచున్ లక్షించుచున్ సంతత
శ్రీ నారాయణ పాదపద్మ యుగళీ చింతామృతా స్వాదసం
ధానుండై మఱచెన్ సురారి సుతుఁడేతద్విశ్వమున్ భూవరా!
భాగ 7—123

ఉ. ఊషర బీజముల్ భసిత యోగ్య ఘృతంబులు షండకన్యకా
న్వేషణముల్ పయోధిగత వృష్టితతుల్ మృగ తృష్ణికాంబుగం
డూషలు దుర్గ కానన కరోరిత ఐంద్రిక లేడ మూకస
ద్భాషలు విష్ణుమంగళ కథా విముఖాత్ముల కష్ట జన్మముల్
నృసిం 5—24

శా. అంధేందూదయముల్, మహాబధిర శంఖారావముల్, మూకసత్
గ్రంథాఖ్యాపనముల్, నపుంసక వధూ కాంక్షల్, కృతఘ్నావళీ
బంధుత్వంబులు, భస్మహవ్యములు లుబ్ధద్రవ్యముల్ క్రోడసద్
గంధంబుల్ హరిభక్తి వర్జితుల రిక్తవ్యర్థ సంసారముల్
భాగ 7—168

సీ. వాసుదేవుని పాదవనరుహంబుల భక్తి
తగదను తండ్రియుఁదండ్రికాఁడు
వేదచోదితమైన విష్ణు ధర్మమునకున్
గోపించు గురుఁడును గురుఁడుగాఁడు
భవ దుఃఖముల మాన్పఁ బ్రభువైన హరి సేవ
నెడలించు హితుఁడును హితుఁడుగాఁడు
వరయోగమతమగు వైష్ణవ జ్ఞానంబు
వదలిన చదువును చదువు గాదు

తే కేశవాకార లీలలు గీలుకొనిము
దింబుగాఁ బొందని తలఁపును దలఁపుగాదు
మాధవ స్తోత్ర ఘన సుధా మధుర రుచులఁ
జిలుకకుండెడు జిహ్వయు జిహ్వగాదు నృసి 5—22

సీ కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీ నాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకునిఁ జూచు చూడ్కులు చూడ్కులు
శేష శాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు
మధు వైరిఁ దగిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు
పురుషోత్తముని మీఁది బుద్ధి బుద్ధి

తే దేవదేవునిఁ జింతించు దినము దినము
చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడు గురుఁడు గురుఁడు
తండ్రి! హరిఁజేరుమనియెడి తండ్రి తండ్రి భాగ 7—169

సీ కలఁడు మేదినియందుఁ గలఁ డుదకంబుల
గలఁడు వాయువునందు గలఁడు వహ్నిఁ
గలఁడు భానుని యందు గలఁడు సోముని యందుఁ
గలఁ డంబరంబునఁ గలఁడు దిశలఁ
గలఁడు చరంబులఁ గలఁ డచరంబులఁ
గలఁడు బాహ్యంబునఁ గలుడు లోన
గలఁడు సారంబులఁ గలఁడు కాలంబులఁ
గలఁడు ధర్మంబులఁ గలఁడు క్రియలఁ

గీ గలఁడు, కలవాని యందును గలఁడు లేని
వానియందును గలఁడెల్ల వాని యందు
నింక వేయును నేల సర్వేశ్వరుండు
గలఁడు నీ యందు నాయందుఁ గలఁడు గలఁడు నృసిం 5— 78

మ కలఁడంబోధిగలండు, గాలిఁగలఁడాకాశంబునన్ గుంభినిన్
గలఁడగ్నిన్ దిశలన్ బగళ్ల నిశలన్ ఖద్యోత చంద్రాత్మలన్
గలఁడోంకారమునన్ ద్రిమూర్తులఁ ద్రిలింగ వ్యక్తులందంతటన్
గలఁడీశుండు గలండు తండ్రి వెదకంగా నేల నీయాయెడన్

భాగ 7—274

ఎఱ్ఱన —

మ అమలాంభోజదళాక్షుఁడక్షత ఘన శ్యామాంగుఁడాజానుదీ
ర్ఘమహాభాగుఁడు, సంహతోరుకఠినోరస్కుండు, సింహోరువి
క్రమణుండుద్ధత శౌర్య ధుర్యకలనా కల్పుండు కల్యాణధీ
రమణీయుండు వెలింగె రాముఁడు గుణారాముండు భూమండలిన్

హరి పూ 4—36

పోతన —

మ అమరేంద్రాశకుఁబూర్ణ చంద్రుఁడుదితంబైనట్లు నారాయణాం
శమునం బుట్టె మదాంధ రావణ శిరస్సంఘాత సంభేదన
క్రమణోద్దాముడు రాముఁడాగరితకున్ గౌసల్యకున్ సన్నుతా
సమనైర్మల్యకతుల్య కంచిత జనుస్సంసార సాఫల్యకున్

భాగ 9

ఎఱ్ఱన —

శా ఈ వానం బడిపీడనొందు పశులన్వీక్షించి రక్షార్థినై
వేవేయిద్ధరణీంధ్రముంబెరికితిన్ విస్తీర్ణ మీక్రింద మీ
రేవారెచ్చటనుండఁగోరితిరి మీరెల్లం బశుశ్రేణితో
భావంబున్భయ ముజ్జగించి చనుఁడీ భవ్యాద్రి చాటందఱున్

హరి పూ ఆ 6

శా బాలుండీతఁడు కొండ దొడ్డది మహా భారంబు సైరింపగాఁ
జాలండోయని దీని క్రింద నిలువన్ శంకింపఁగాఁబోలదీ
శైలాంభోనిధి జంతు సంయుత ధరా చక్రంబు పైఁబడ్డనా
కేలల్లాడదు బంధులార నిలుఁడీ! క్రిందం బ్రమోదంబునన్

భాగ — 10—1—920

ఉ ఆడుగఁబోయినప్పుడసురాత్మజాఁడంబుబనాభునవ్యయుం
బాడుద మాది దేవు పదపంకజ పూజలు చేసి భక్తి మ్మై
నాడుద మచ్యుతైక శరణాగతులంగని కర్మబంధముల్
వీడుదమంచుబల్కుకడు విస్మయమందగఁదోడి బాలకుల్

నృసిం 3—149

క ఆడుదము మనము హరి రతిఁ
బాడుదమే ప్రొద్దు విష్ణు భద్రయశంబుల్
వీడుదము దనుజ సంగతి
గూడుదము ముకుంద భక్త కోటిన్ నూటిన్

భాగ 7—248

పద్యముల యెత్తుగడలలోను సంవాదములు గలవు

క హరి భక్తుల జపము జపము నృసిం 2—33

క హరి భక్తుల తపము తపము భాగ 9

సీ ఆ అంబుజోదర ధ్యానతత్పరత యొకటికాని బాలకుండు

నృసిం 3—147

సీ ఆ అంబుజోదర దివ్య పాదారవింద
చింతనామృత పాన విశేషమత్త
చిత్తము భాగ 7—122—150

ఇట్లు పద్యముల యందే గాక వచనములందును, సంవాదములు చూపట్టుచున్నవి

వ హిరణ్య కశిపు ప్రహ్లాద విషయనిగ్రహాను గ్రహావేశ వ్యతి కర విషమ సంరంభ దుర్వార గర్వారంభ భీషణాభిరూప సంస్థానంబును నృసిం 5—62

వ ప్రహ్లాద హిరణ్య కశిపు రంజన భంజన నిమిత్తాంతరంగ బహిరంగ జేగీయమాన కరుణా వీరరసంయుతుండును భాగ 7—285

శివకవులు —

పండితారాధ్యులు శివ తత్త్వసారమున

క. జ్ఞానియగువాఁడు భక్తివి
హీనుండగునేని ముక్తి కెయిదఁడు

'భక్తి వలననే ముక్తి కలుగును గాని కేవల జ్ఞానము వలన కలుగదు' అని స్పష్ట పఱచి యున్నాఁడు

ఈ రీతిగనే పోతనయుఁజెప్పియున్నాఁడు

ధర్మతత్త్వధీ
పరిణతి సాధనంబగు స్వభావముఁదాల్చిన యట్టి మర్త్యులు
తదంఘ్రిపం
కరుహములర్థిమై గొలువగానమిఁబొందరు తత్పదంబునన్
భాగ 3 509

నన్నెచోడమహాకవి —

వీరభద్ర విజయమును గూర్చి వ్రాసిన సందర్భమున నన్నెచోడమహాకవి కుమార సంభవము నెట్లనుసరించినదియు దెలిపితిని ఇందు మరి కొన్ని చూపుచున్నాను

నన్నెచోడుఁడు —

తే. ఉగ్రభానుకరాహతి కోడిపాఱి
వచ్చి తరువన దుర్గంబు సొచ్చి యున్న
తిమిర పటలంబునాఁగాననమునఁగలయు
నిండి ఘూర్ణిల్లు చుండె వేదండ ఘటలు

పోతన —

గీ. అంధకారమెల్ల నద్రిగుహాంతర
వీథులందుఁబఱచి వెఱచి దాఁగి
వెడరువేచి సంధ్య నినుఁడు వ్యర్థతనున్న
వెడలెననఁగ గుహలు వెడలెగరులు భాగ. 8—27

పాల్కురికి సోమనాథుని యనుసరణము

సోమనాథుని బసవ పురాణమునఁదృతీయాశ్వాసమున బిజ్జలునితో మంత్రి వర్గము బసవనిపై కొండెములు చెప్పు సందర్భమున నీ క్రింది ద్విపద పంక్తులు గలవు

ద్వి క్షీరాబ్ధి లోపలఁగ్రీడించు హంస
గోరునే పడియల నీరు ద్రావంగఁ?
జూత ఫలంబులఁజుంబించు చిలుక
బ్రాతి బూరుగు మ్రాని పండ్లు గన్గొనునె?
రాకామల జ్యోత్స్నఁద్రావు చకోర
మాకాంక్ష సేయునే చీకటిఁద్రావ?
విరిదమ్మి వాసన విహరించుఁదేఁటి
పరిగొని సుడియునే ప్రబ్బలి విరుల ? 3—82 పుట

పై ద్విపదలోనున్న భావములకు మందార మకరంద మాధుర్యము గల్పించి, పోతన యీ క్రింది సీసము సంతరించెను —

సీ మందార మకరంద మాధుర్యమును గ్రోలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మల మందాకినీ వీచికలఁదూఁగు
రాయంచ చనునె తరంగిణులకు ?
లలిత రసాల పల్లవ ఖాదియై చొక్కు
కోయిల చేరునే కుటజములకు?
పూర్ణేందు చంద్రికాస్ఫురిత చకోరక
మరుగునే సాంద్ర నీహారములక?

గీ నంబుజోదర దివ్య పాదారవింద
చింతనామృత పాన విశేషమత్త
చిత్తమే రీతి నితరంబుఁజేర నేర్చు?
వినుత గుణశీల! మాటలు వేయునేల? 7—150

సోమనాథుని బసవపురాణము 1927 లో ప్రకటితమగువఱకు పై విషయము విమర్శకు లెవ్వరెఱుఁగరుగాని పోతన పద్యము ప్రజా సామాన్యమంతయు నెఱుంగును

బసవ పురాణమునందే కాక సోమనాథుని చతుర్వేద సారమున కూడ పై భావములు గల సీస పద్యమున్నది

సీ రాకామల జ్యోత్స్నఁ ద్రావనిచ్చలు గొన్న
నాచకోరంబుల కరుచి యగునె?
సహకార పల్లవ చయములు దొరకిన
జగతి కోయిలకును చప్పనగునె?
క్షీరాబ్ధిలోపలఁ గ్రీడింపఁగలిగిన
భువిరాజహంసకుఁబుల్లనగునె?
విరిదమ్మి వాసన వెల్లి మునిచిన గ్రోలు
షట్పదములకు నాస్వాదమగునె?

ఆ వె బహుళ తరదయార్ద్ర భావ ప్రభావన
మహిమఁదనరు జంగమంబు రాగ
సతుల భక్తి పరుల కావశ్యకంబగు!
పరిహృతాఖిభంగ బసవ లింగ! 153 పద్యము.

భాస్కరుఁడు —

పోతన కాలము నాఁటికి భాస్కర రామాయణము బహుళ ప్రచారమై వ్యాప్తిలో నున్నది "భాస్కరుఁడు బదరెను గాని రామాయణము బండ్లెక్కింపనా?" అని పోతన సవాలు రామ భక్తి సంపన్నుఁడగు పోతన యట్లు చెప్పుటలో నాశ్చర్యము లేదు భాస్కరాదులు ప్రశస్త కవులైనను భక్తులు కారు ఏమైనను పోతన భాస్కర రామాయణమును బాగుగఁజదివినట్లు స్పష్టము

భాస్కరుఁడు —

క రాముఁడు, మేచక జలద
శ్యాముఁడు సుగుణ ప్రభావ సంయమి వినుత
స్తోముఁడు గిరిజాధిపనుత
నాముఁడు వ్రాకుచ్చె కుశిక నందనుతోడన్ — బాల. 353
(మల్లికార్జున భట్టు)

పోతన —

రామున్, మేచక జలద
శ్యామున్, సుగుణాభి రాము సద్వైభవసు
త్రామున్, దుష్ట నిశాటవి
రామున్ బొమ్మనియె పంక్తిరథుఁడడవులకున్ 2—160

పోతన —

మ సవరక్షార్థము తండ్రిఁబంప జని విశ్వామిత్రుఁడుండోడరా
సవలీలం దునుమాడె రాముఁడదయుండై బాలుఁడై కుంతల
చ్ఛవి సంపజ్జిత హాటకంగపట భాషా విస్ఫురన్నాటకన్
జవభిన్నార్యమ ఘోటకంగర విరాజత్ ఖేటకందాటకన్ 9—260

భాస్కరుడు —

ఉ పాటితదుష్టసత్త్వవనవాటిక, సిద్ధబలావరుద్ధశృం
గాటక, గ్రంధిల భృకుటిగాఢలలాటక, గ్రూర తారకా
నాటక, నాంత్రకాంచపరిణద్ధశవ ప్రపతత్క్రిమిచ్ఛటా
కీటక, రక్తసిక్త పటుఖేటకఁదాటకఁగాంచిరయ్యెడన్

బాల 261

భాస్కరుఁడు —

ఉ పుణ్యచరిత్రుఁడత్రి ముని పుంగవు వీడ్కొని రాముఁడంచితా
గణ్యగుణాభిరాముఁడుపకంఠమునంజని కాంచె దండకా
రణ్యము సిద్ధ సంయమివిరాజిత చారు తపోనుజాతస
త్పుణ్యము నిర్మలాంబువర పుష్కర పూర్ణ సరోవరేణ్యమున్

ఆ 6—2

పోతన —

ఉ పుణ్యుఁడు రామచంద్రుఁడటుబోయి ముదంబునఁగాంచె దండకా
రణ్యము తాపసోత్తమ శరణ్యము నుద్ధత బర్హిబర్హాలా
వణ్యము గౌతమీ విమలవాః కణ పర్యటన ప్రభూత సా
ద్గుణ్యము నుల్లసత్తర నికుంజవరేణ్యము నగ్రగణ్యమున్

9—268

భాస్కరుఁడు

ఉ. సింధురవైరి విక్రమణశీలి యతండు పరిభ్రమించు సౌ
గంధిక సంగబంధురిత గంధ సమీరణశాలియై మరు
త్సింధు మనోజ్ఞ శీకర వశీకరణా చరణాభిరాముఁడై
గంధవహుండు వీచెనెసకంబున నాత్మజు మీఁద మెల్పునన్
యుద్ధ 1724

పోతన —

ఉ సింధురవైరి విక్రముఁడు శీత మయూఖ మరాళికాపయ
స్సింధు పటీర నిర్మల విశేష యశో విభవుండు శౌర్యద
ర్పాంధదిపృక్షితీశనికరాంధ తమః పటలార్కుఁడీ జరా
సంధునిఁజూడు మాగధుని సత్‌బృహదశ్వ సుతుందలోదరీ! 10—2—349

భాస్కరుఁడు —

శా బాహుద్వంద్వము మీఁదికెత్తి కడఁకంబంచాగ్నితప్తుండు మా
సాహారుండు జితేంద్రియుండు నతి నిష్ఠాయత్త చిత్తుండు న
వ్యాహార ప్రవణుండునై బహు సహస్రాబ్దంబు లేకచ్ఛల
గ్రాహిత్వంబమరన్ మహా తపము గోకర్ణంబునన్ జేయఁగన్ బాల 456

పోతన —

శా పాద ద్వంద్వమునేల మోపి పవనుంబంధించి పంచేంద్రియో
న్మాదంబున్మఱగించి బుద్ధిలతకున్మాఱాకుహత్తించి నిః
భేద బ్రహ్మ పదావలంబునిఁగతిం గ్రీడించు యోగీంద్రుమ
ర్యాదన్నక్రము విక్రమించె హరి పాదాక్రాంతనిర్వక్రమై భాగ ? స్క

భాస్కరుఁడు —

సీ కుప్పించు నురవడిఁ గుంభిని వడిఁగ్రుంగి
సర్వాధిపతితలల్ సదియ నదుమ
వెగయు నూఁకున మీఁది కెత్తి పాలిన తరు
శ్రేణులు చుక్కలు జెదర నడువ
నెఱికలు జాడించు నేపున గడలెత్తి
యేడు వారాసులు నెడముతొత్తఁ
బఱచు బల్విడి నభ్రపంక్తులు సుడిగొంచు
వలయంపుఁగొండ యవ్వలికిఁదూలి

ఆ వె    బర్వతములు వడఁక బ్రహ్మాండ కోటర
మదువ గగన వీధి నరుగుదెంచె
రఘుకులేంద్ర బంధ విఘటనత్వరితాంత
రంగుఁడగుచు నవ్విహంగ విభుఁడు    యుద్ధ 627

పోతన పై పద్యము యెత్తుగడ, నమతనుగ్రహించి భీష్మస్తవమున నందఱకును సుపరిచితమగు నీ క్రింది సీస పద్యము వ్రాసినాఁడు

సీ    కుప్పించి యెగసిన కుండలంబుల కాంతి
        గగన భాగంబెల్ల గప్పికొనఁగ
ఉరికిన నోర్వక యుదరంబులోనున్న
        జగముల వ్రేగున జగతిఁ గదల
జక్రంబు చేఁబట్టి చనుదెంచు రయమున
        పైనున్న పచ్చని పటము జాఱ
నమ్మితి నాలావు నగు బాటు సేయకు
        మన్నింపుమని క్రీడి మఱల దిగువఁ

గీ    కరికి లంఘించు సింహంబు కరణి మెఱసి
నేడు భీష్ముని జంపుదు నిన్నుఁగాతు
విడువు మర్జున యంచుమద్విశిఖ వృష్టి
తెరలి చనుదెంచు దేవుండె దిక్కు నాకు

భాస్కరుఁడు —

మ    హయరింఖాపుట కోటి పాటిత ధరోద్యద్రేణు జాలంబులన్    యుద్ధ 1206

పోతన —

మ    హయరింఖాముఖ ధూళి ధూసర పరిన్యస్తాలకోపేతమై    భాగ 1—119

భాస్కరుఁడు —

ఉ    సాలకదంబ నింబకుటజకింశుక నారికేళత
క్కోల జటాజటాల వటకుంజ విశాల రసాల తాళహిం
తాల తమాలలోల దళదాడిమమంజుల వంజులార్జు నో
త్తాల మధూక తిందుక వితాన వికాసిత కాననంబులన్

భాస్క సం. 60

ఏకమాసము — చివర తెలుఁగు ప్రత్యయము

పోతన —

ఉ మానిత సౌరభ ప్రసవ మంజుల పక్వఫల ప్రవాళ భా
రానత చూతపోత విటపాగ్రనికేతన రాజకీరవ
మ్మాని సుఖానులాపపరిమండితకర్ణ మతాపసాశ్రయో
ద్యాన వన ప్రదేశ కమలాకర తీరనికుంజ పుంజముల్ భాగ 3—1044

నాచన సోమన

సంస్కృత మూలమున లేని శ్రీ కృష్ణ సత్యభామా నరకాసుర యుద్ధ ఘట్టము, హరి వంశము నుండి పోతన గ్రహించెనని ముందు తెలిపి యుంటిని ఆ సన్నివేశమున యుత్తర హరి వంశము నందలి నాచన సోముని నవనవోన్మేషిత కవితా నైపుణ్యమును పోతన యిట్లనుకరించి యున్నాడు

సోమన —

మ అరిఁజూచున్ హరిఁజూచు సూచకములై యందందమందారకే
సరమాలా మకరంద బిందు సలిల స్యందంబులందంబులై
దొరగంబయ్యెద కొంగొకింత దొలఁగం దోర్దోశరాసారమున్
దరహాసామృత సారమున్ గురియుచున్ దన్వంగికేళీగతిన్ ఉ హరి 1 అ

పోతన —

మ పరుఁజూచున్ పరుఁజూచునొంప నలరింపన్ రోషరాగోదయా
విరత భ్రూకుటి మందహాసములతో వీరంబు శృంగారమున్
జరగం గన్నులఁగెంపుసొంపు బరగం జండాస్త్ర సందోహమున్
పరపాలోక సమూహమున్ నెఱపుచున్ జంద్రాస్యహేలాగతిన్ భాగ 10

సోముని యూర్వశి నరకాసుర సంభాషణమున నున్న యీ క్రింది పద్యమున మొదటి పాద మిట్లున్నది

చ చతురవచో విలాస గుణసాగర సాగరమే ఖలావనీ పతి — 1—30

దీని ననుసరించి పోతన చతుర్థస్కంధాంతమున నిట్లు వ్రాసి యున్నాడు

చ సరసవచో విలాస గుణ సాగర సాగరమేఖలా మహాభరణ ధురంధర
భాగ దశ 974

సోమన —

సీ. తంత్రీ వినోదంబు తడవుసైపని వ్రేళ్ల
గౌనయంబు తెగలపైఁ గోరిగనుట
సద్దంబు పిడిముట్టు నలయుపాణితలంబు
లస్త్రకం బిటియించు లావు కలిమి
చెలికత్తె నొత్తిలి చేరలేని యెలుంగు
సింహనాదంబుచేఁ జెదరకునికి
ప్రమద నర్తన కేళిఁబంతగింపనిపదం
బైదు ఠాణంబులనంతఁబడమి

గీ. సోయగపుఁజిత్ర రూపంబుఁ జూచు చోట
వేషరుచిలోకనంబులు వికృత దైత్య
లక్ష్యవీక్షించుటలు మొక్కలంపు గెలువు
గైకొనియె సత్యభామ సంగ్రామ సీమ ఉ హరి ఆ 1

పోతన —

సీ. వేణిఁజక్కఁగఁ బట్ట వెఱవెఱుంగని లేమ
బాణాసనంబెట్లు పట్ట నేర్చె
మ్రాఁకున దీగఁ గూర్పంగనేరని లేమ
గుణమునే క్రియధనుష్కోటిఁగూర్చె
సరని ముత్యము గ్రువ్వఁ జాలనియబలయే
నిపుణత సంధించె నిశితశరముఁ
జిలుకకుఁబద్యంబుఁ జెప్ప నేరని తన్వి
యస్త్ర అంత్రము లెన్నడభ్యసించెఁ

ఆ వె బిఱుకు మనినఁ బెక్కు పలుకని ముగుదయె
గతి నొనర్చె సింహ గర్జనంబు
ననఁగ మొఱచెఁ ద్రిజగదభిరామ గుణధామ
చారు సత్య సీమ సత్యభామ భాగ 10 స్క.

శ్రీనాథుఁడు —

శ్రీనాథుఁడును పోతనయు సమ కాలీనులు శ్రీ నాథుని కృతులలోను భాగవతమునను గల సమాన భాగముల నుదహరించుచున్నాను

శ్రీనాథుఁడు —

సీ. శరదాగమారంభ సంపూర్ణ పూర్ణిమా
విమల చంద్రికలతో వియ్యమంది నైష 1

పోతన —

సీ. శరదా గమారంభ సంపూర్ణ పూర్ణిమా
చంద్రసాంద్రాతపోజ్జ్వలితమగుచు 3 — 118

శ్రీనాథుఁడు —

సీ. నిర్మల నిజకథానిమిష కల్లోలినీ
క్షాళితాఖిల జగత్కల్మషుండు నైష 1

పోతన —

సీ. క్షాళితాఖిల కల్మష వ్రజామరనదీ
జనక కోమల పదాబ్జములవాని 2 — 231

శ్రీనాథుఁడు —

సీ. శితికంధరునకు నెచ్చెలిగాఁడు కాఁడొకో
యటమటీఁడైన నీ యక్ష భర్త?
యహికంకణునకు మూఁడవ కన్నుగాఁడొకో
ప్రాల్మాలినట్టి యీ పావకుండు?
పురవైరికవతంస పుష్పంబు గాఁడొకో
నిర్భాగ్యుఁడైన యీ నీరజారి?
గంగాధరునకు లెంకల లెంకగాఁడొకో
పెనుగూళయైన యీ యనిమిషేంద్రుఁ?

గీ. డేమిగుడువంగ వచ్చి నారిండ్ల విడిచి
హరుని వెలి పెట్టినట్టి యీ యాగమునకుఁ
బంచవదనుని కను జేవురించెనేని
తక్షణంబున తమ యాంద్రడ్త్రాళ్లు తెగవె కాశీ ఖండము 7—60

పోతన —

సీ. నీలకంఠునకును నెచ్చెలిగాఁడొకో
యటమటీఁడైన నీయంబుజాక్షుఁ
డహి కంకణునకు మూఁడవ కన్నుగాఁడొకో
ప్రోలుమాలిన యట్టి పావకుండు
గంగాధరునకు సంగడికాఁడు కాఁడొకో
పెనుకూళ్లమారైన యనిమిషపతి
పురవైరికిని తల పువ్వంబుఁగాఁడొకో
నిర్భాగ్యుఁడైన యీ నీరజారి

గీ. యేమి కుడువంగ వచ్చితి రిందు మీరు
తాము పాలించు నట్టి లోకములు విడిచి
పంచవదనుని కను జేవురించెనేని
తక్షణంబున తమ యాంధ్ర త్రాళ్ల తెగవె వీరభద్ర విజయము 4—47

## పోతననుసరించిన కవులు

పోతన తన ముందు వారిననుసరించి కవితా రచనఁగావించినను, పోతన ననుకరించి యాతని వలె కవిత్వము చెప్పిన వారు నభూతోనభవిష్యతి అయినను వాఙ్మయమునచ్చటచ్చట పోతన పద్య పాదముల యనుసరణముగానవచ్చుచున్నది

భాగవత సప్తమస్కంధమందలి ప్రసిద్ధ పద్యము

సీ. కంజాక్షునకుఁగాని కాయంబు కాయమే ?
పవన కుంభిత చర్మ భస్త్రిగాక
వైకుంఠుఁ బొగడని వక్త్రంబు వక్త్రమే ?
ఢమ ఢమ ధ్వనితోడి ఢక్కఁగాక
హరి పూజనము లేని హస్తంబు హస్తమే ?
తరుశాఖ నిర్మిత దర్విఁగాక
కమలేశుఁ జూడని కన్నులు కన్నులే ?
తనుకుడ్యజాల రంధ్రములు గాక

ఆ వె   చక్రి చింత లేని జన్మంబు జన్మమే ?
తరళ సలిల బుద్బుదంబు గాక
విష్ణు భక్తి లేని విబుధుండు విబుధుఁడే
పాదయుగముతోడి పశువు గాక   7—70

ఈ సీస పద్యములను రంగనాథ రామాయణమున వ్రాత ప్రతులలో సులోచన కథ వ్రాసిన కవి ద్విపదలలో పాదిగినాఁడు

ద్వి   పతి కౌఁగలింపని పణతి కాయంబు
పవనకుంభిత చర్మ భస్త్రిగాకేమి ?
సవినయంబుగ రస సల్లాపములను
సమరంగఁబతితోడ నాడని నోరు
ఢమఢమ ధ్వనితోడి ఢక్కగాకేమి?
పురుషు వీక్షింపని పొలఁతి నేత్రములు
ధరతమకుడ్య రంధ్రములు గాకేమి?
వరుసేవ సేయని వర పదాబ్జంబు
తరసౌష్ఠ నిర్మిత దర్విగాకేమి ?

పోతన ననుసరించిన కవులలో అనంతామాత్యుఁ డొకడు లనంతుని భోజరాజీయమున పోతన భాగవత పద్యానుసరణలున్నవి

పోతన —

సీ   కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వజిహ్వ
సుర రక్షకునిఁ జూచు చూడ్కులు చూడ్కులు
మధువైరిఁ దగిలిన మనము మనము
విష్ణు నాకర్ణించు వీనులు, వీనులు —

అనంతుఁడు —

ఉ   చూపులు విష్ణుమూర్తులకు సొమ్ముగ, జిహ్వలు విష్ణు మూర్తియా
లాపసుఖంబుఁజెందఁగఁదలంపులు విష్ణు మహాత్మ్య చింతకుం
బైపడుచుండ —   భోజ 2—26

పోతన —

సీ ఇది నాకు నెలవని యేరీతిఁ బలుకుదు
నొకచోటనక నెందు నుండ నేర్తు
నెవ్వని వాఁడనం చేమని నుడువుదు
నాయంతవాఁడనై నడవ నేర్తు
నీ నడవడి యని యెట్లు వక్కాణింతుఁ
బూని ముప్పోకలఁ బోవ నేర్తు
నదినేర్తు నిదినేర్తునని యేల చెప్పంగ
నీ రూపులన్నియు నేన నేర్తు

ఆ నొరులు గారు నాకు నొరులకు నేనాదు
నొంటివాఁడఁజుట్ట మొకరు లేరు
సిరియుఁదొల్లిగలదు చెప్పెద నావెంకి
సుజనులందుఁదగిలి సొచ్చియుందు 8—552

అనంతుఁడు —

సీ ఒక చోటఁగాదు నా యునికి నెచ్చటనైన
నుండుదుఁజమ్మనాథుండ నేను
ననుఁబ్రీతి నిందు రమ్మని పట్టె డశనంబుఁ
బెట్టు ధర్మ ప్రాణిఁబుట్టునొక్కొ
నని యెందుజరియింతు భోజ 6—188

పోతన —

ఉ అట్టి యనంత శక్తి జగదాత్ముని నాభి సరోజమందు — భాగ 2—93

అనంతుఁడు

ఉ ఆదికినాదియైన పరమాత్ముని నాభిసరోజమందు భోజ 1—150

పోతన —

మ కనియెం దాపస పుంగవుండఖిల లోక ఖ్యాత వర్ధిష్ణు— భాగ 4—18

అనంతుఁడు —

మ కనియెన్విప్రుఁడు సర్వలోక హిత విఖ్యాతన్ జగన్మాత భోజ 2—11

కొఱవి గోపరాజు, "సింహాసన ద్వాత్రింశిక" యందు పోతన ననుసరించియున్నాఁడు గోప రాజు పోతనకుఁ జివర దినములలో సమకాలికుఁడు

పోతన —

మ కనియెన్ దాపస పుంగవుఁడధిక లోకఖ్యాత వర్ధిష్ణు, శో
భన భాస్వత్పరిపూర్ణ యౌవన కళాభ్రాజిష్ణు, యోగేంద్ర హృ
ద్వనజాతైక చరిష్ణుఁ గౌస్తుభ ముఖోద్యద్భూషణాలంకరి
ష్ణు నిలింపాహిత జిష్ణు విష్ణుఁబ్రభవావిష్ణుంగ్రసిష్ణు రోచిష్ణునిన్ 4—20

గోపరాజు —

మ(స కనియెన్ భూపుత్ర జిష్ణున్, ఘన దురిత మహాఖండనా విర్భవిష్ణున్
వనమాలాలంకరిష్ణున్, వ్రజ వన విహారద్వల్లవీకేళి తృష్ణున్
దనుజేంద్రైకాసహిష్ణున్ దరళ మణిమయద్వార కాబద్ధ దృష్ణున్—9—268

పోతన —

ఉ పుణ్యుఁడు రామచంద్రుఁడట బోయి ముదంబునఁ గాంచె దండకా
రణ్యము, తాపసోత్తమ శరణ్యము, నుద్ధత బర్హిబర్హలా
వణ్యము, గౌతమీ విమలవాఃకణ పర్యటన ప్రభూత సా
ద్గుణ్యము నుల్లసత్తరు నికుంజవరేణ్యము నగ్రగణ్యమున్ 5—53

గోపరాజు —

ఉ పుణ్యపథంబు భంగి భయ భంగము నొందక సొచ్చె దండ కా
రణ్యము, శైలగర్భిత హిరణ్యము, తాపస చిత్త నిత్య కా
గణ్యము గంధ బంధుర సరోజరజోవనరాజ లక్ష్మణా
గణ్యము వత్ర పుష్ప ఫల గణ్యముఁ బుణ్యజనానుగుణ్యమున్ 5—53

పోతన —

మ నిరయంబైన, నిబంధమైన, ధరణీ నిర్మూలనంబైన దు
ర్మరణంబైన, కులాంతమైన నిజమున్ రానిమ్ము కానిమ్ము పో
హరియైనన్ హరుఁడైన నీరజభవుండ భాగ్యతుండైన నౌ
దిరుగన్నేరదు నాదు జిహ్వ వినుమా! ధీవర్యవేయేటికిన్ భాగ 8—597

గోపరాజు —

ఉ మేరువు సంచలించిన, సమీరుఁడు నిల్చిన, భూమి క్రుంగినన్
దారక లెల్లడుల్లిన సుధాకరుఁడగ్ని కణంబులొల్కినన్
వారిధులింకినన్నభము వ్రాలిన భానుఁడు చల్లనైననం
భోరుహనాభిదప్పినను బొంకుదునే మునుపాడి క్రమ్మఱన్ 5—199

పోతన —

మ లలితోద్యాన వనాంత సంచరణ లీలాలోల హంసాళికో
కిల పారావత చక్రవాక శుకకేకి వ్యూహముంచత్ప్రము
త్కలికం గృత్రిమ పక్షులన్ నిజవిహంగ శ్రేణి యంచుం గుతూ
హలియై పల్కుచునాడుచుండు ప్రతి శాఖారోహణవ్యాప్తులన్ 3—810

కృష్ణరాయలు ఆముక్తమాల్యదలో

మ లలితోద్యాన పరంపరాశుకపికాలాపాభిరామంబు ఆము

పై రెండును పట్టణ వర్ణనములోనివి

పోతన —

ఉ కాటుక కంటినీరుచనుకట్టు పయింబడనేల యేడ్చెదో
కైటభదైత్యమర్దనుని గాదిలి కోడల చాటువు

వెన్నెలకంటి సూరన —

ఉ కాటుక కంటి నీరుఁజనుగట్టునబాసిన చీర కొంగు వి పు 8—98

పోతన —

చ నగు మొగమున్ సుమధ్యమును, నల్లని మేనునులచ్చికాటప
ట్టగునురమున్ మహా భుజములంచిత కుండల కర్ణముల్ మదే
భగతియు నీలవేణియుఁ గృపార సదృష్టియు గల్గువెన్నుఁడి
మ్ముగఁ బొడసూపుఁగాత కనుమూసిన యప్పుడు విచ్చినప్పుడున్ 9—732

శేషము రఘునాథార్యుఁడు — కులశేఖర మహీపాల చరిత్రము

చ నగు మొగమున్ విశాల నయనమ్ములు చక్కని చెక్కుదోయిచె
న్నగునరులున్న పెన్నురముదంచిత బాహు యుగంబు ముత్తెపున్
జిగిఁదళుకొత్తుపల్వరుస చిన్ని యొయారపు చెయ్యులొప్పసొం
పగు పురుషుండు నాదుకల వాదరమేర్పడ గోచరించినన్ 1—15

పోతన —

సీ కంజాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ

అను పద్యము ననుసరించి

కోట శివరామ కవి సానందోపాఖ్యానమున—

సీ శివునపేక్షించిన చిత్తంబు చిత్తంబు
భవు కథ లాలించు చెవులు చెవులు
కటికంఠుఁబూజించు కరములు కరములు
శ్రీ శంభు వర్ణించు జిహ్వ జిహ్వ
గౌరీశుఁజూడగను కన్నులు కన్నులు
మదన వైరికి మ్రొక్కు నుదురు నుదురు
హరు మందిరము మెట్టు నడుగులు నడుగులు
సర్వేశు జపియించు జపము జపము

తే గీ భర్గుఁగొనియాడ నేర్చిన భక్తి భక్తి
చిన్మయాత్ముని సేవించు సేవ సేవ
నీలకంధరుఁదల పోయు నేర్పు నేర్పు
శర్వు మహిమంబుఁ జెప్పిన చదువు చదువు

పదునాఱవ శతాబ్ది యందున్న ఫణి భట్టు అను కవి "పరతత్త్వ రసాయనము" అను గ్రంథమున పోతనను హెచ్చుగా ననుకరించినాఁడు

పోతన — "శ్రీ కైవల్య పదంబుఁజేరుటకునై — చింతించెదన్
ఫణి భట్టు— శ్రీ కైవల్య రమా వివాహమునకో — చిత్రంపు భూషాళిగా

పోతన —

క పలికెడిది భాగవతమట!
పలికించెడు వాఁడు రామభద్రుండట! నే
పలికిన భవహరమగునట
పలికెద వేఱొండు గాథ పలుకఁగ నేలా? భాగ 1—18

ఫణిభట్టు —

క చిలుకను బంజరమున నిడి
పలికింపఁగ రామ కథలు పలికిన యట్లోఁ
బలికెదఁ బరతత్త్వార్థపుఁ
బలుకులఁ బలుకులు గురుండు పలుకై యుండన్ 1—24

పోతన —

సీ కంజాక్షునకుఁగాని కాయంబు కాయమే?
పవన గుంభిత చర్మ భస్త్రి గాక
వైకుంఠుఁ బొగడని వక్త్రంబు వక్త్రమే?
ఢమ ఢమ ధ్వని తోడి ఢక్క గాక
హరి పూజనము లేని హస్తంబు హస్తమే?
తరుశాఖ నిర్మిత దర్విగాక
కమలేశుఁ జూడని కన్నులు కన్నులే?
తనుకుడ్య జాల రంధ్రములు గాక

ఆ వె చక్రి చింత లేని జన్మంబు జన్మమే
తరళ సలిల బుద్బుదంబు గాక
విష్ణు భక్తి లేని విబుధుండు విబుధుఁడే
పాదయుగము తోడి పశువు గాక భాగ 7—170

ఫణిభట్టు —

సీ కమలాక్షు మూర్తి నాకాంతు జింతింపదే
మనము గాదది దుఃఖ వనము గాని
పరమాత్ము చర్యలా దరణిఁ గీర్తింపదే
నాల్కగాదది చెడు ముల్కిగాని
భువనేశు పూజలేప్రొద్దాచరింపదే
గరము గాదది భవా కరముగాని
కేశవార్పిత విధి క్రియలందు బడలదే
మూర్తిగాదది రుజామ్ఫూర్తిగాని

గీ పరమ పురుషావలోకన పారవశ్యుఁ
డగుచు సర్వేంద్రియ వ్యవహారములను
హరి పరాయత్తుఁడై యుండఁడయ్యేని
నరవరుఁడుగాఁడు వాఁడు వానరవరుండు 1—55

పోతన —

సీ సంసార జీమూత సంఘంబు లిచ్చునే
చక్రిదాస్య ప్రభంజనము లేక
తాపత్రయా భీలదావాగ్నులాఱునే
విష్ణు సేవామృతవృష్టి లేక
సర్వంకషాఘౌఘజలరాసులింకునే
హరిమనీషా బడబాగ్ని లేక
ఘనవిపద్గాఢాంధకారంబులడఁగునే
పద్మాక్షనుతిరవిప్రభలు లేక

ఆ వె నిరుపమాన పురావృత్తి నిష్కలంక
ముక్తి నిధిగాన వచ్చునే ముఖ్యమైన
శార్ఙ్గకోదండ చింతనామృతము చేత
తామరసగర్భునికి నైన దానవేంద్ర ! భాగ 7—171

ఫణిభట్టు

సీ. హరినామ కథన ఝుంఝూనిలోద్ధతి చేత ।
దూలదే ఘోరాఘతూల సమితి
కంజాక్ష వర్ణనా కర్ణనార్కుని చేతఁ
బాఱదే మాయాంధకారపటలి
విష్ణు సేవామృత వృష్టి ధారల చేత
నాఱదే కర్మతాపానలంబు
కమలేశ్వర ధ్యాన గారుడాస్త్రముచేత
విరియదే విషయాహి విషభయంబు

గీ. జన్మలయ వేగమగు దుర్నివార వారి
పూరదుర్వార కామాది ఘోర నక్ర
చార సంసార వారాశి నమసి పోదె
పంకజోదర పదభక్తి బాడబమున 3—284

పోతన —

సీ. మందార మకరంద మాధుర్యమునదేలు
మధుపంబు వోవునే మదనములకు

అను పద్యమునను సరించి

ఫణిభట్టు —

సీ. కర్ణరంధ్రంబులా ఘనునిపల్కాలించు
చవినంది యొక వంక జరుగవెపుడు
చూపులా విభుని లోఁజూచు వేడుకనంటి
యితర రూపుల పొంతకేగ వెపుడు

గీ. కరములా పుణ్య పదసేవ మరిగి లోక
కృతుల నొల్లవు మనసలకీర్తనీయు
ధ్యానరతి నొంది యితరంబు దలపఁదెపుడు
నాదు సర్వేంద్రియములాత్మనాథుఁబొంది

ఏక విషయమును భంగ్యంతరమునఁ జెప్పుటచేఁ బోతన పద్యముల స్వారస్యమీకవిపద్యములయందుఁ గానరాదు

పోతన —

మ. పరుఁడై యీశ్వరుఁడై, మహామహిముఁడై, ప్రాదుర్భవ స్థానసం
హరణ క్రీడనుఁడై, త్రిశక్తియుతుఁడై యంతర్గత జ్యోతియై
పరమేష్ఠి ప్రముఖామరాధిపులకుం బ్రాపింప రాకుండుదు
నరఁ మార్గంబుందేజరిల్లు హరికిం దత్త్వార్థినై మ్రొక్కెదన్ 3—58

ఫణిభట్టు —

మ. చిరమై, నిర్మలమై, మహా విభవమై, చిన్మాత్రమై సత్యమై
పరమై సంతత సంయమీశ్వర మనః ప్రత్యక్షమై నిత్యమై
దురితారణ్య దవార్చియై మదిని భక్తుల్గోరు నర్థంబునై
స్థిర భావంబునఁ దోచు బ్రహ్మము మదిన్ సేవింతుఁదత్త్వార్థినై
1—132

ఈ పరతత్త్వ రసాయనము, మదరాసు విశ్వ విద్యాలయము వారిచేఁ బ్రకటితమైనది 1941

# 11. ఇతర కవికృత స్కంధములు

## పంచమ స్కంధము

## బొప్పరాజు గంగన

పంచమస్కంధము చిన్నదియైనను తత్కర్తయగు గంగనచే రెండాశ్వాసములుగా విభక్తమై యున్నది ప్రథమాశ్వాసమున 176, ద్వితీయాశ్వాసమున 160, మొత్తము మీద 336 గద్యపద్యములు గలవు ఈ స్కంధము పూర్తిగా గంగన కృతమేయైనను నాతఁడు సింగనవలె కృత్యాది పద్యములు వ్రాయలేదు ప్రథమాశ్వాసారంభమున —

క శ్రీకర! కరుణా సాగర!
ప్రాకట లక్ష్మీ కళత్ర! భవ్యచరిత్రా
లోకాతీత గుణాశ్రయ!
గోకుల విస్తార! నంద గోప కుమారా''

అని కృష్ణ సంబోధన కలదు ఆశ్వాసాంతమునను కృష్ణ సంబోధనయే కలదు ద్వితీయాశ్వాసాద్యంతముల నిట్లే యున్నది తరువాత కథా ప్రారంభము

గంగన తన విషయ మేమియు గద్యయందును తెలుపలేదు ''ఇది సకల సుకవి జనానందకర బొప్పనామాత్య పుత్ర గంగనార్య ప్రణీతంబైన శ్రీమహాభాగవత పురాణంబునందు పంచమ స్కంధము'' అని మాత్రమే కలదు

భాగవతమున ప్రత్యేక స్కంధములు రచించినవారిలో సింగన యొక్కఁడుమాత్రమే షష్ఠస్కంధమున బమ్మెర పోతనను నుతించెను వెలిగందల నారయ గద్యలలో, ''పోతనామాత్య ప్రియ శిష్య'' అని చెప్పికొని యున్నాఁడు గంగన మాత్ర మట్టి విషయ మేమియుఁ దెలుపలేదు ఇందు నొక విశేషముగలదు

షష్ఠస్కంధము నలువురు కవులును, ఏకాదశ ద్వాదశ స్కంధము లార్వురు కవులును తెలిగించి నట్లు వెనుక వివరించియున్నాను కాని పంచమస్కంధమును మఱియే కవియుఁ దెలిగింపలేదు పంచమస్కంధము గంగన కృతముగా భాగవత ప్రతులన్నింటియందున్నది ఇది నిర్వివాదమైన విషయము సింగన షష్ఠస్కంధ రచనా ప్రారంభమునాటికే గంగన తెనిగింపు వెలసి యుండ

వలెను ఆదియును సంపూర్ణముగ నున్నది కావున వేఱొకరు తెలిగింపవలసిన యావశ్యకతలేదు
మూలము "ఇతి తేషాంవృషలానాం రజస్తమ ప్రకృతీనాం ధన మదరజ ఉత్పిత్తమనసాం కర్మాతిదారుణం యద్బ్రహ్మ భూతస్య సాక్షాద్బ్రహ్మర్షిసుతస్య, నిర్వైరస్య, సర్వభూత సుహృదః సూనాయా మప్యనుజ్ఞాతాయా మనభిమత మాలంభనం తదుపలభ్య బ్రహ్మతేజసాతి దుర్విష హేణ దందహ్యామానేన, వ్రపషసహసోచ్చ చాలస్తైవ దేవీ భద్రకాళీ 16

భృషమమర్షరోషావేశ రభస విలసిత భృకుటీ విటప కుటిల దంష్ట్రారుణేక్షణాటోపాతి భయా నకవదనాహంతు కామే వేదం మహాట్ట హాసమతి సంరంభేణ విముంచంతీ, తతఉత్పత్య పాపీయసా మతి దృష్టానాం తేనైవాసి నావృక్ణ శీర్ణాంగళాత్ ప్రస్రవంత మసృగా సవ మత్యుష్ణం సహగణేన నిపీయాతి పానమద విహ్వలోచ్చైస్తరాం స్వపార్ష దైస్సహజ గౌనసర్త విజహార సచశిర్ష కందుకలీలయా 17 పంచ నవమాధ్యాయము

తెనుఁగు

సీ. సర్వ భూతములకు సఖుఁడును బ్రహ్మభూ
తాత్ముఁడు నిర్వైరుఁడైన బ్రహ్మ
సుతుని తేజంబంతఁజూడ దుస్సహమైన
భయమంది వడకుచు భద్రకాళి
క్రోధంబు ముమ్మడిఁ గొనఁగ హుంకారంబు
సలుపుచు నట్టహాసంబు చేసి
పాపాత్ములును దుష్ట పరులును రాజస
తామస కర్మ సంధాను లగుచు

గీ. విప్రవరునట్లు హింసించువృషలపతిని
భృత్యవర్గమ్ముతోఁ దలఁద్రుత్తిఁగూల్చి
యవుడు వృషలాధిపుని శరమందిలీలఁ
బాడియాడుచు నందంద క్రీడ సలిపె (1—134)

తెనుఁగు సేఁతలో మూలముకంటె రసపూర్తిమిక్కిలి తక్కువ మూలార్థ మెల్ల గంగన మృదువుగా నొక్కి సీస పద్యమున నిమిడించి యున్నాఁడు ఇక తక్త్వ ఘట్టమును దీసికొందము గంగనకూడ పోతన వలె నీ ఘట్టములయందు శ్రీధరీయ వ్యాఖ్యానము ననుసరించి యద్వైత పరముగా రచియించి యున్నాఁడు కాబట్టియే పోతన రచిత చతుర్థ స్కంధముతో నిది పొత్తు సంపాదించుకొనినది దీని కొక యుదాహరణ —

మూలము

శ్లో॥ యావన్మనోరజసా పూరుషస్య
సత్త్వేనవా తమసావానురుద్ధం
చేతోభిరాకూతిభిరాతనోతి
నిరంకుశం కుశలం చేతరంవా
సహసనాత్మా విషయోపరక్తో
గుణప్రవాహో వికృతషోడశాత్మా

వ్యాఖ్యానము

"పురుషస్య కుశలం — ధర్మమితర మధర్మం వా — ఆత నోతిక్తై:
చేతోన్ భిజ్ఞానేంద్రియై: ఆకూతిభి: కర్మేంద్రియైశ్చ॥
తతశ్చ ధర్మాధర్మ వాసనాయుక్తం, తదేవానేకదేహాది
వైచిత్ర్యం కరోతీత్యాహ" స ఇతి — తన్మన ఇత్యర్థ: వాసనా
యుక్తం ఆత్మోపాధిత్వా దాత్మా (5-11-4)

తెనుఁగు

సీ॥ పురుషుని
చిత్తంబు గుణములఁ జెంది యెంత

తే॥ కాలముండును మఱి యంతకాలమందు
నరయ విజ్ఞాన కర్మేంద్రియముల చేత
మరగి ధర్మంబు మఱియధర్మంబు నట్లు
తగిలి పుట్టించుచుండు నత్యంత మహిమ

ఏ॥ మఱియు ధర్మాధర్మ వాసనా యుక్తంబు చిత్తంబు (1—154)

ఇంకను సద్వైత మతానుసారులగు వాక్యములిందుగలవు

ఆ॥ పరగఁబెద్ద లీ ప్రపంచ మంతయుఁ దథ్య మనరు (1—155)

వ॥ మనోవృత్తుల నతిక్రమించిన జీవుండు పరం
జ్యోతియైన నారాయణ స్వరూపంబుగా నెఱుంగుము
ఈశ్వరుండు సర్వభూతాంతర్యామి యగుచు జీవా
త్మ స్వరూపంబున నుండు (1—155)

వ  బ్రహ్మం బొక్కటియె సత్యంబు, జగత్తసత్యంబు (1—155)

షష్ఠస్కంధ, ఏకాదశ, ద్వాదశ స్కంధముల విషయ మట్లు గాదు వానిని పలువురు తెని గించుటకుఁ గారణము లాయా ఘట్టముల నిరూపింప నున్నాను ప్రస్తుతము పంచమస్కంధ భాషాంతరీకరణము గూర్చినది

ఇతఁడు పెక్కుచోట్ల మూలార్థములను సంగ్రహముగా వ్రాసి యున్నాఁడు

## పంచమ స్కంధము - ద్వితీయాధ్యాయము

మూలము

శ్లో  బాణావిమౌ భగవత శ్శతపత్ర పత్రౌ
కాంతావపుంఖరుచిరావతి తిగ్మదంతౌ
కస్మైయుయుంక్షసి వనే విహర స్నవిద్మః
క్షేమాయనోజడధియాం తవ విక్రమోస్తు

తెనుఁగు

క  పొలుపగుచున్న విలాసం
బులనంగజ బాణములను బోలెడు నీచం
చలసత్కటాక్ష వీక్షణ
ముల నెవ్వని యింతి! చిత్తమునఁగలఁచెదవే ? (1—29)

ఈ తెనుగు సేఁతలో మూలమునందలి విశేషణాదులు పెక్కులు లేవు

మూలము

శ్లో  శిష్యాయిమే భగవతః పరితః పఠంతి
గాయంతి సామసరహస్య మజాస్రమీశ !
యుష్మచ్ఛిఖా విలులితాస్సుమనోభివృష్టిః
సర్వే భజంత్యృషిగణా ఇవ వేదశాఖాః

తెనుఁగు

చ  చెదరఁగ వేదముల్ చదువు శిష్యులపైఁబడగఁజుష్పవృష్టి స
మ్మదమున వంతలోఁగురియు మాడ్కిని మన్మథ సామగానముల్
చదివెడు శిష్యులోయనఁగ షట్పదపంక్తులు మ్రోయఁగా వడిం
బడపడి మీఁదరాలుఁ గచభారమునందుల జాజు క్రొవ్విరుల్ (1—30)

ఇందు మూలార్థరీతి కానిపింపదు స్వకపోలకల్పితములు గానరావు కవిత్వమున మృదుత్వమున్నది

ఈతని కవితా శ్రీలినిఁదెలియుటకై రెండు పద్యముల నుదాహరించుచున్నాను ఇవి రెండును పంచమస్కంధమున ప్రసిద్ధమైన జడభరతోపాఖ్యానము నందలివి

ఉ అక్కట ! తల్లిఁబాసి హరిణార్భక మాప్తులు లేమిఁజేసి యే
దిక్కును లేక యున్న నిటఁదెచ్చితి నాయెడ నీ మృగార్భకం
బెక్కుడు ప్రేమఁ జేసి చరియించుచు నున్నది నాథు సన్నిధిన్
మక్కువఁజేసి దీనిఁ గడు మన్నన లందగఁ బ్రోతు నెంతయున్ (1—103)

ఉ రాజులు మేలనంగ సుర రాజ సమానుఁడనై తనూజులన్
రాజులఁ జేసి తాపసులు రాజ ఋషీంద్రుఁడటంచుఁబల్కఁగాఁ
దేజము నొంది యీ హరిణదేహమునందలి ప్రీతిఁజేసి నా
యోజ సెడంగ నేఁజెడితి యోగిజనంబులలోన బేలనై (1—117)

## షష్ఠస్కంధము

భాగవతమున పోతన రచియింపని స్కంధములలో షష్ఠస్కంధము నొకటియనియు, నిది శిథిలమై లోపించిన భాగములోనిది కాదనియు ముందు నిరూపించియుంటిని ఈ స్కంధమును ప్రత్యేకముగను ప్రశస్తముగను తెనుఁగు చేసినవారిలో సింగన ప్రథముఁడు సింగన వెనుక రాచమల్లు కవులు, సర్వన, హరిభట్టు, అనువారలు గూడ ప్రత్యేకముగ దీనిని రచించిరి వానిలో మొదటి యిద్దరి రచనలు సంపూర్ణముగ మనకు లభ్యము కాలేదు మూఁడవది పూర్తిగా లభించుచున్నది

నేఁటి ముద్రిత భాగవత ప్రతులలో సింగన రచిత షష్ఠస్కంధమే మనకు కన్పట్టును తెలుఁగు భాగవతము వ్రాఁత ప్రతులలో నధిక సంఖ్యాకములైన వానిలో సింగన షష్ఠస్కంధమే కానవగును కాని కొన్నింటియందు హరి భట్టారక రచనమగు షష్ఠస్కంధముకూడ కన్పట్టుచున్నది ఇక రాచమల్లు కవుల షష్ఠస్కంధము నేఁడు మనకు లభ్యము గాక పోయినను, నూటయెనుబది యేండ్ల క్రిందకాలమున లభ్యమగుచుండెడిదని లక్షణ గ్రంథముల నుదాహరింపఁబడిన పద్యములను బట్టి చెప్పవచ్చును అట్టి సందర్భమున నా మూడింటిలో సింగన కృతియే భాగవతమునఁజేర్పఁబడుటకు సింగన యాంధ్రీకరణ విధానమును, కవితా రచనమును కారణము లని గ్రహింపవచ్చును దానిని మొదట వివరింతును

సింగన యింటిపేరు ఏర్చూరివారు ఈతఁడాపస్తంభసూత్రుఁడు, శ్రీవత్స గోత్రుఁడు కృత్యాదిసీతఁడొసఁగిన వంశవృక్షము —




తాను మంత్రిశేఖరుఁడనని చెప్పుకొనుటచే నీతఁడాత్వేల నియోగి (6—29)

సింగయ పూర్వులలో సూరన శివభక్తియుక్తుఁడు సింగయ సోదరుఁడు హరిభక్తి పరాయణుఁడు సింగన, శివపూజాపరుఁడైనను విష్ణు భక్తి గలవాఁడు

క. అంబద్రగజుండ శివ పూ
జింద నరిసవాఁడ విష్ణు చరితామృతని
ష్యందిపటువాగ్విలాసా
నందోచిత మానసుండ నయకోవిదుఁడన్ (6—30)

పై వంశ వృత్తాంతముఁ జూచినచో, సింగయ పోతనవలె నియోగి శాఖకుఁజెందిన వాఁడనియు, నాతని వలె శివభక్తి పరుఁడయ్యు, విష్ణు భజనాసక్తుఁడనియుఁదెలియు చున్నది.

పోతన తన తల్లి యగు లక్కమాంబను ప్రత్యేకముగ వర్ణించినట్లుగా నీతఁడును తనతల్లిని వర్ణించియున్నాఁడు. "మానినులీడుగారు బహుమాన నివారిత దీన మానసగ్లానికి" అని పోతన యనుప్రాస విన్యాసముతో చెప్పిన పద్యము ననుసరించి సింగన —

ఉ ఆడదు, భర్తమాట కెదురాడదు, వచ్చినవారి వీడఁగా
నాడదు, పెక్కు భాష లెడనాడదు, వాకిలి వెళ్లి కల్లమా
టాడదు, మిన్నకేని సుగుణావలి కిందిరగాక, సాటి యే
చేడియ లేదు చూరి కులశేఖరు కన్యయముమ్మడమ్మకున్ (6—27)

ఇట్లు వంశ వృత్తాంతము పట్టునవే కాక, కవితా విషయమును పోతనను తూచాతప్పక నను

సరించియున్నాఁడు

| భాగవతకృత్యాది | షష్ఠస్కంధకృత్యాది |
| --- | --- |
| పోతన | సింగన |
| కృష్ణవర్ణనము | అచ్యుత వర్ణనము |
| శివస్తుతి | శివస్తుతి |
| బ్రహ్మస్తుతి | బ్రహ్మస్తుతి |
| గజాననస్తుతి | గజాననస్తుతి |
| భారతీస్తుతి | భారతీస్తుతి |
| దుర్గాస్తుతి | దుర్గా (కాళీ) స్తుతి |
| లక్ష్మిస్తుతి | లక్ష్మిస్తుతి |
| వాల్మీకి, వ్యాస, శుకయోగి స్తుతి | వ్యాసస్తుతి |
| కాళిదాస, బాణమయూర | |
| భారవిమాఘులు — సంస్కృత కవి స్తుతి | |
| తెలుఁగుకవిస్తుతి — నన్నయ తిక్కనలు | |

రెండు పద్యములలోరచియించి సింగన యీ పట్టున నొక పద్యముతో సంస్కృతాంధ్ర కవుల మరికొందఱి నిట్లు వర్ణించియున్నాఁడు

సీ వరకవిత్వోద్రేకి వాల్మీకిఁగొనియాడి
భాగవతార్థ వైభవముఁబలుకు
శుక మంజులాలాపు శుకయోగిఁబ్రార్థించి
బాణ మయూరుల ప్రతిభ నొడివి
భాస సౌమిల్లక భారవి మాఘుల
ఘనసుధా మధుర వాక్యములఁ దలఁచి
కాళిదాసు కవీంద్ర కల్ప వృక్షము గొల్చి
నన్నపాచార్యు వర్ణనలఁ బొగడి

గీ వెలయఁ దిక్కన సోమయాజుల భజించి
యెఱ్ఱనామాత్యు భాస్కరు నిచ్చఁ గొలిచి
సుకవి సోముని నాచన సోమునెఱఁగి
కవి మనోనాథు శ్రీనాథు ఘనత మెచ్చి 6—11

తెలుఁగు కవి స్తుతిలో శ్రీనాథునితోఁబాటు బమ్మెర పోతనను నిట్లు ప్రత్యేక పద్యములోఁ ప్రశంసించినాఁడు

ఉ ఎమ్మెలు సెప్పనేల జగ మెన్నఁగఁబన్నగరాజశాయికిన్
సొమ్ముగ వాక్య సంపదలు సూఱలు చేసినవాని భక్తిలో
నమ్మినవాని భాగవత నైష్ఠికుఁడై తగువానిఁబేర్మితోఁ
బమ్మెర పోతరాజు కవి పట్టపు రాజుఁ దలంచి మ్రొక్కెదన్ 6—12

దీనిని బట్టి సింగయకు పోతనయెడ గల భక్తి తాత్పర్యములు తేటపడఁగలవు

షష్ఠస్కంధ రచనమునకుఁబూర్వము సింగన యెన్నో పర్యాయములు పోతన రచనను పారాయణము గావించి జీర్ణించుకొన్నాఁడు నన్నయ కవితా రచనా రీతుల నెఱ్ఱయ యే రీతిగా నాకళించుకొని నన్నయ కవితవలె, తన రచనను 'తద్రచనయ' కాగా తోఁపింపఁజేసినాఁడో, అట్లే సింగనయు, పోతన కవిత వలె తన కవితను తోఁపింపఁ జేయవలెనని ప్రయత్నించినాఁడు కొన్ని యెడల పోతనకుఁగొంత సమీపముగ వచ్చినాఁడు చాల వఱకుఁ గృతకృత్యుఁ డయ్యెనని కూడ చెప్పఁదగిన రచన సాగించినాఁడు

పోతన ధ్యాన సమాధి నుండ రామభద్రుఁడు ప్రత్యక్షమైనట్లు, సింగనకు స్వప్నమున జగన్మాత ప్రత్యక్షమై, సాధు కవితఁజెప్ప నానతిచ్చెను నాఁటినుండి సింగనకు నారాయణాంకితంబైన కవిత్వ తత్త్వ జ్ఞాన మలవడెను శ్రీ కృష్ణుఁడు నాయకుఁడుగా గ్రంథ మారంభించెను

పోతన —

క పలికెడిది భాగవతమట!
పలికించెడివాఁడు రామభద్రుండట! నే
పలికిన భవహర మగునట
పలికెద వేఱొండు గాథ పలుకఁగ నేలా? 1—18

సింగన —

ఆ వె  పలుకఁగలిగె మొదల భాగవతార్థంబు
భర్త కృష్ణుఁ డయ్యె భాగ్య మొదవె
నమృత రసముగోర నమరు చింతామణి
పాత్ర సంభవించు భంగి నిపుడు  6—22

పోతన —

ఆ వె  భాగవతముఁ దెలిసి పలుకుట చిత్రంబు
శూలికైన తమ్మిచూలికైన
విబుధ జనుల వలన విన్నంతఁ గన్నంత
తెలియవచ్చినంత తేటపఱతు  (1—19)

సింగన —

ఆ వె  భాగవతముఁదేటపఱుప నెవ్వఁడు సాలు
శుకుఁడు దక్క నరుని సఖుఁడు దక్క
బుద్ధిఁ దోచినంత బుధులచే విన్నంత
భక్తి నిగిడినంత పలుకువాఁడ  (6—23)

ఇట్లు భాగవత ప్రశస్తినిఁదెలిపి, పోతన వలె కృష్ణ పరముగా షష్ఠ్యంతములను చెప్పెను పోతన కవితకు సహజమగు నను ప్రాస విన్యాసమును సింగన పుణికి పుచ్చుకొన్నాఁడు

మ  కనియెన్ బ్రాహ్మణుఁడంత్యకాలమున వీఁకన్ రోష విష్ఫూర్తులన్
ఘన పీ నోష్ఠ వికాస వక్త్ర విలసద్గర్వేక్షణోపేతులన్
జన సంత్రాసకరోద్యతాయత సుపాశ శ్రేణికా హేతులన్
హనన వ్యాప్తి విభీతులన్ మువుర నాత్మానేతలన్ దూతలన్  (6—70)

క  మోదంబై, పరిదూషిత
ఖేదంబై, శాబరీద్ధకిలికించిత దృ
గ్భేదంబై, బహు సౌఖ్యా
పాదంబై యొప్పు వింధ్య పాదంబునకున్  (6—211)

క  పుట్టితి వజుతన్నువునఁ జే
పట్టితివి పురాణ పురుషు భజనము పదముల్
మెట్టితివి దిక్కులం దుది
ముట్టితివి మహాప్రబోధమున మునినాథా !  (6—250)

ఉ ధాతకు, దేవతా విభవ ధాతకుఁ, బుణ్యజనానురాగ సం
ధాతకు, సర్వలోక హితదాతకు, వైదిక ధర్మ మార్గని
ర్ణేతకు, మల్లన ద్విభవనేతకు సర్వజగజ్జయాంగజ
త్రాతకుఁ, బుణ్యయోగి జన భాగవిజేతకు మ్రొక్కి రయ్యెడన్ (6—278)

అనుప్రాస రీతినే గాక మరి కొన్ని యనుసరణలు గలవు

శా ఆదిన్ శ్రీసతి కొప్పుపై, దనువుపై, నంసోత్తరీయంబుపై
పాదాబ్జంబులపై, కపోలతటిపైఁ బాలిండ్లపై నూత్నమ
ర్యాదం జెందు కరంబుఁ గ్రిందగుట మీఁదై నాకరంబుంట మే
ల్గాదే, రాజ్యము గీజ్యమున్ సతతమే కాయంబు నాపాయమే (8—90)

శా ఆలీలావతి గండ పాళికలపై, హాస్యప్రసాదంబుపై
నాలోలాలక పంక్తిపై, నళికపై, నాకర్ణ దృగ్దీప్తిపై
హేలాపాది కుచద్వయోరు కటిపై విచ్చల్ విహారింపఁగా
జాలిం బొందుచు నాత్మ గుందుచు మనోజాతానలోపేతుఁడై (6—104)

ఇట్లు పద్యములనే గాక వచనములను ననుసరించి యున్నాఁడు

వ గదలవేయుచు, గాండంబులేయుచు, ముద్గరంబుల నొత్తుచు
ముసలంబుల మొత్తుచు, ఁగలరవాలబులఁ ద్రెంచుచుఁ, జక్రంబులం ద్రుంచుచు దళ ప్రా
కుంతంబులు గ్రుచ్చుచు,ఁ గుఠారంబుల వ్రచ్చుచు, ముసలంబుల
మోదుచు, ముద్గరంబులం బాఁదుచుఁ,జక్రంబులం ద్రుంచుచు సబళంబుల నొంచుచు
6—370

కవితా విషయమ్మునసే గాక, గ్రంథ విషయ వివరణమున గూడ పోతననే సింగన యనుసరించి నాఁడు పోతన వలె షష్ఠస్కంధము నద్వైత పరముగానే తెలిగించియున్నాఁడు శ్రీధరాచార్య వ్యాఖ్యాన మును ననుసరించియే సింగన రచించెనని తెలుపుట కొక ఘట్టము నుదాహరించుచున్నాను

షష్ఠస్కంధము — సంస్కృతము — చతుర్థాధ్యాయము

శ్లో యదోపరామో మనసో నామరూపస్య దృష్టిస్మృతి సంప్రమోషాత్
యఈయతే కేవలయా స్వసంస్థ యాహంసాయ తస్మై శుచి షద్మనేనమః

శ్రీధర వ్యాఖ్య—

యదేతి॥ యదా, మనస ఉపరామః—సమాధిః తదా నామ రూపే రూపే తేయేస తత్త్రథా, తస్య ఉపరమే హేతుః, దృష్ట్యం—దర్శనం, స్మృతిశ్చ, తయో సంప్రమోషాత్, నాశాత్, తదా, యః కేవలేన స్వరూప జా నేన్ప్రతీయతే, తస్మైమహంసాయ, శుద్ధాయ, శుచి—శుద్ధం—మన సద్మ—ప్రతీతిస్థానం—యస్యతస్మైనమః

తెనుఁగు —

"మఱియు ననేక విధ నామ రూప విరూప్యం బగు మనంబునకు దృష్టి స్మృతుల నాశనంబు వలనం గలిగెడు నుపరామంబగు సమాధియందు కేవల స్వరూప జ్ఞానంబునందోచు నిర్మల ప్రతీతి స్థానంబైన హంస స్వరూపికి నమస్కరింతు (6—342)

పోతనవలె నన్యూనముగను నవతి విపులముగాను విశదీకరింపలేక పోయినను, సింగన, శ్రీధరీయ వ్యాఖ్యానుసారముగ నద్వైత పరముగనే గ్రంథము నంతయు ననువదించెను

సింగన కవిత మధురముగను మనోహరముగను నుండును ఈ క్రింది పద్యము తరువాతి ప్రబంధ కవుల యేడ్పు పద్యములకు నాంది కాఁదగును

ఉ. కుంకుమ రాగ రమ్యకుచ కుంభములం గడుఁ గజ్జలంబుతోఁ
బంకిల మైన బాష్పములఁబాల్పడ మజ్జన మాచరించుచున్
గంకణ పాణి పల్లవ యుగంబున వక్షము మోఁదికొంచు నా
పంకరుహాక్షి యేడ్చె, పరిభావిత పంచమ సుస్వరంబునన్ (6—451)

సింగని రచిత షష్ఠస్కంధమే నేటి భాగవత ప్రతులలో నుండుటకు నాతని పోతనానుసరణ మును, ముఖ్యముగా నద్వైతపరముగా రచియింప బడుటయు ప్రధాన కారణములని చెప్పవలసి యున్నది ఈ విషయ మితర షష్ఠస్కంధ రచనలవలన నిశ్చిత మగుచున్నది

## కవులషష్ఠము లేక శృంగారషష్ఠము

క్రీ శ 1560 ప్రాంతమున నున్న ముద్దరాజు రామన మొదలు, క్రీ శ 1760 వఱకు గల లాక్షణికు లందఱు నీ షష్ఠస్కంధము నుదాహరించినారు ఈ గ్రంథములో శృంగార షష్ఠ మని, కవుల షష్ఠమని, రాచమల్లువారి కవుల షష్ఠమని గలవు రాచమల్లువారవఁగా నంది మల్లయ్య, ఘంట సింగయ కవులు వీరిరువురును వరాహ పురాణమును, ప్రబోధ చంద్రోదయ

మును నాంధ్రీకరించిన కవులు. క్రీ. శ. 1480—90 ప్రాంతముల విద్యానగర రాజగు తుళువ నరసరాజు కాలమున నున్నవారు

వీరు భాగవత షష్ఠస్కంధమును రచించి శృంగార నైషధము ననుసరించి శృంగార షష్ఠమని నామ కరణము గావించిరి ఆ గ్రంథము మనకు పూర్తిగ లభించ లేదు గాని లాక్షణికులుదాహరించిన పద్యములను బట్టి చూడఁగా నిందలి కవితా రచన యత్యంత రసోల్లసిత మైనదని చెప్ప వచ్చును వారుదాహరించిన పద్యము లన్నింటిని నిందుతో పఱచుచున్నాను

## కవుల షష్ఠము లేక శృంగార షష్ఠము

శా. శ్రీరామామణి సీత నాథునియురస్సీమన్నిజచ్ఛాయఁ గ
న్నారంగన్గొని యాత్మనన్యవనితేర్ష్యం బూనుదత్కంధరన్
హారంబున్పుచునింకుఁజూడుమనఁదానేటంద్రపంజెందఁజె
ల్వారున్ రాముఁడు ప్రోచుగాక చికలివ్యామ్రధీశుమ్మాధిపున్

మ. అని యీ విద్య గురుప్రసన్నుఁడు ధృడస్వాంతుండునౌ చిత్రకే
తునృపాలాగ్రణికిచ్చి నారదము నీంద్రుం డంగిరోయుక్తుడై
జనియెన్ బంకజ గర్భ గేహమున కాసర్వం సహా భర్తదా
ని నుపాసించి భజించెనేడహములున్ విద్యాధరాధ్యక్షతన్

క. అనుటయుఁగృష్ణద్వైపా
యనతనయుండిట్టులనియె నవహితమతివై
వినుమతి గుహ్యము నారా
యణ కవచము భక్తవాంఛితార్థప్రదమున్

సీ. గీ. వలవదు భయంబు వారెంత వారలైన
వట్టివారలు మన కగ్గమైనవారు
వారు నిరయంబునకుఁగాపువచ్చువార
నుచు బుద్ధిగఁజెప్పె మార్తాండ సుతుఁడు

చ. పెరిగిన యీసునన్నెమలి ఫింఛములంబురివిప్పఁబోలునీ
సరసిరుహాక్షివేనలికి సాటిగ నిల్వఁగ నోడి చొచ్చె నిం
దిరశరణంబుతేఁటిగమి నీలము లింద్రుని పేరుగాంచెఁబె
న్నిరులు గుహాశయంబు గనియెన్ నెఱిగల్గిన వారి నోర్తురే?

క మనుజుల లోపల గర్భం
బొనరుచు వారెల్ల దండ్యులో వారలరోఁ
గనుఁగొన గొందఱె దండ్యులొ
యనవుఁడు హరిభటులకనిరి యప్పార్శ్వచరుల్

సీ గీ తల్లిదండ్రియు దైవంబుఁదలఁప గురుఁడ
కాదెయతఁడేమి చేసినఁగనలనగునె?
నాస్తికాధమ! యోరి! యన్యాయవృత్తి
"నాస్తి తత్త్వం గురోః పరి" మ్మనఁగవినవె

గీ ఇవ్విధంబున మఱియు ననేక గతుల
లలిత శృంగార చేష్టలలాఁచిలాఁచి
చూచుచున్నట్టి ప్రమ్లోచిఁజూచి మునికి
మనసు గురగురమనియెఁజొమ్మనియె నొడలు

ఉ సంతత భక్తియుక్తి గొనసాగక యుండిన నుండనిమ్ము దై
త్యాంతక పాదపద్మముల యందు నొకా నొక యప్పుడే నిజ
స్వాంతముఁదద్గుణాభిరతుఁడై నరుఁడెవ్వడు గీలుకొల్ప వాఁ
డంతకుఁదద్భటాలిఁగలనై నను జూడఁడు భూసురోత్తమా!

ఉ హంస సమాన గామినికి నట్టివినూతన గర్భ శుద్ధికిన్
బుంసవనాది కృత్యములు భూపశిఖామణి యార్య సంపదా
శంసిత కర్మకర్మరత సాంగముగా నొనరింప నన్వయో
త్తంసుఁగుమారునింగనియె దర్పకు నిందిరగన్నకైవడిన్

ఏ గీ ఎసఁగబ్రాతిక నోగిరంబిడక మున్నఁ
యతిరయంబునఁబరి షేచమాచరించుఁ
దత్తరమున నాపోశన మెత్తఁబోయి
భూసురుండెత్తుసుత్తరాపోశనంబు

క ఇంటికిఁజనుటయు మానెన్
నంటొనరింపంగ సాఁగె—నాగరికులతోన్
కుంటెన కాఁడుల గూడెన్
గొంటరియై యతఁడసాధు గో[?]ష్ఠిపరతన్

చ అదలిచి నిల్వవారిఁగని యంతకు కింకరు లెవ్వరయ్య? మీ
రిదెజమునాజ్ఞఁద్రోచితిరి యెచ్చటనుండిటవచ్చినారలె
య్యదిగత మడ్డుపెట్టుటకు నెవ్వరి వార లెఱుంగఁ జెప్పుఁడా
యదితితనూజులో? సురలొ? యక్షులొ సిద్ధులో గాక సాధ్యులో?

శా చండాంశుప్రభ! చిక్క తిమ్మయతనూజా! తిమ్మ! విధ్వస్తపా
షండంబైన త్రిలింగ భాగవత షష్ఠస్కంధ కావ్యంబువి
కుండక్కన్ జతురాననత్వ గుణయుక్తుల్ మీఱ వాణీమహో
భాండారోద్ధృత చూఱకార బిరుద ప్రఖ్యాతి సార్థంబుగన్

శా శ్రీఘ్రంబేఁటికి వచ్చి సంసృతి భవశ్రీ గంధ సౌఖ్యంబెదా
నాఘ్రాణింపని మత్తనూజులదురాత్మాభిక్షులం జేసినన్
శుఘ్రాదివ్యవమగ్నుఁజేసితి కృపా శూన్యుండవై "గోముఖ
వ్యాఘ్రంబింతియ గాక నీవు ఋషివే యాహా! వితర్కింపగన్"

మ తనతో వల్గిన వాణి పాదముల మీదన్ వ్రాలవే నెత్తినా
య్యవ పాశ్చాత్య నిజాన్యతమ్ముఖములందన్యోన్య మొక్కవ్వచుం
బనమల్బంగఁజతుర్ముఖత్వము ఫలింపం జొక్కు పద్మాసనుం
డనవద్యాయురు దీర్ఘఁజేయు చిక తిమ్మాత్మజు తిమ్మాధిపున్

మ పదముల్ ద్రొటిలఁగానుదీగ వెలయింపన్ గేశముల్ దూలఁబ
య్యెదవక్షోరుహపాళిఁజేరఁగనుదోయిన్బాష్పముల్ గ్రమ్మఁగ
ద్గదకంఠంబున వాక్యముల్ దడబడం దద్దేహముం జొచ్చియా
సుదతీ రత్నముఁగాంచె బాలుని మనశ్శోకానలజ్వాలునిన్

క నెరసెనెరసంజ చక్రక
సరసీరుహ విరహభేదసంసూచకమై

. . . . . . . . .

మ గురుబంధుల్ దనుఁజుట్టిరాఁదిగిచి యాక్రోశింప నిశ్చేష్టుఁడై
యొరులందన్ను నెఱుంగ లేక హద్వ్యాధాప్తిమున్ జెందిచూ
పరత న్మోయుచుఁబోవివర్ణతంమెయింబాటిల్లు

. . . . . . . . . . . . . .

క అరిగి సమిత్ ప్రసవ కుశాం
కురవకృఫలోత్కరంబుఁగొని గృహమునకున్
మరలియట వచ్చునప్పుడు
ధరణీసురనందనుండు దనకట్టెదుటన్

ఉ తెక్కలతో సరాగము నెరింబరికింపఁడు వేడ్కఁజెంది యో
యక్కనకాచలంబు విబుధాధ్వమునం బనుదెంచుచున్న

ఉ జాఱుట యుందదూరు యుగ సాంద్రరుచుల్ కటిమీఁదనుండిద్దై
వాఱినఁగాంచి పంచశర పంచశరీ పరికంపితాత్ముఁడై
పాఱుఁడుదా బహుశ్రుతము బర్మియు భావవిశుద్ధి కలియున్
మీఱిన నెమ్మనంబు గడిమిన్ నిలుపోపక లేక లోలతన్

సీ రాయెన తలిసి పేరంటాలి గ్రమ్మద
గలిగించునడుగుచే వెలసినాఁడు

ఈ షష్ఠస్కంధమద్వైతపరముగా నాంధ్రీకరింపఁబడినదో, లేక, విశిష్టాద్వైత పరముగా నాంధ్రీకరింపఁ బడినదో తెలిసికొనుటకు గ్రంథమంతయుఁబూర్తిగ లభింపలేదు నంది మల్లయ్య ఘంట సింగయ కవులిద్దరును నద్వైత సిద్ధాంతమును ప్రతిపాదించు సంస్కృత ప్రబోధ చంద్రోదయ నాటకము తెలుఁగు చేసిరి కావున నీ షష్ఠస్కంధమునునట్లే యద్వైత పరముగా రచియుందు రను నూహ పొడముచున్నది కాని యిది శృంగార షష్ఠమను పేరుతో వెలయుట చేతను, భక్తి వైరాగ్యములను ప్రతిపాదించు తెలుంగు భాగవతము మధ్య నీ శృంగార రసప్రధాన మగు గ్రంథ భాగ మును తరువాతివారు చేర్చియుండరు

మఱియు నింకొక విశేషము చూడుఁడు సింగన షష్ఠస్కంధ కవితయు మనోహరముగ నున్నదని మున్ను చూపితిని కాని, ముద్దరాజు రామన, అప్పకవి, కూచిమంచి తిమ్మకవి, అడిదము సూరకవి మున్నగు లాక్షణికు లెవ్వరును, సింగన షష్ఠస్కంధమునుండి మచ్చున కొక్క పద్యమైన నుదాహరించియుండలేదు శృంగార షష్ఠమునుండి పది పద్యములను క్రీ శ 1740 సంవత్సరమున కూచిమంచి తిమ్మకవి రచించిన సర్వలక్షణ సార సంగ్రహమున నుదాహరించియున్నాఁడు ఆ పద్యములితర లాక్షణికు లుదాహరించిన పద్యములు కావు. కాబట్టి తిమ్మకవి కాలమునాటికి శృంగార షష్ఠము లభ్యమగుచుండెడిదని తెలియుచున్నది తిమ్మకవి నాఁటి కిది భాగవత ప్రతులలోకెక్కిన

యెడల నాతఁడు దీనిని ప్రత్యేక గ్రంథముగా నుదాహరించుట సంభవింపదు లాక్షిణికాస్త్రితమై రమ్యమై యున్నను రస విషయమున భేదముండుట చేత, శృంగార పద్యము భాగవతమున కెక్క లేదనుట పరమార్థము

## సర్వన—షష్ఠస్కంధము

సర్వన కృత షష్ఠస్కంధమునుండి యొక పద్యము 'ప్రబంధ రత్నాకరమున నుదాహృతమైనది' కాని గ్రంథము లభ్యము కాలేదు [1] ఇతరత్ర నిందుండి యాకరములు లభింపలేదు

## హరిభట్టు—షష్ఠస్కంధము

హరిభట్టు, బహు గ్రంథ కర్త మత్స్య, వరాహ పురాణములు, భాగవతమున షష్ఠ, ఏకాదశ, ద్వాదశస్కంధములు—ఉత్తర నారసింహ పురాణముఁ కృత్యాద్యాశ్వా సాద్యంతములు లేక కథా భాగముఁ నీతని కృతులు ఈతఁడు కృష్ణరాయని కాలము వాఁడని, యనగా క్రీశ 1510—20 ప్రాంతమువాఁడని నేను శాసన ప్రమాణమున నిర్ణయించియున్నాను [1] ప్రస్తుతము మనము విమర్శింపవలసినది షష్ఠస్కంధము హరిభట్టు షష్ఠస్కంధముతో గూడ భాగవత తాళపత్ర ప్రతులు గలవని చెప్పితిని[2] ఇది యముద్రితమగుటచే దీని వివరము కొంత దెలుపుచున్నాను

ఇది పురుషోత్తమ క్షేత్రమున లేక నీలాచలమున నెలకొని యున్న జగన్నాథునికిఁగృతి

శా శ్రీ నీలాచలనాథు, నంచిత దయాసింధున్, జగన్నాయకున్
నానా వైభవ సంయుతున్, మునిజనానందాలయున్ సర్వదే
వానీకస్తుత చూడ రత్న రుచిదీప్తాంఘ్రిద్వయీ శోభితున్
నూనాస్త్రప్రభవా యుతున్ హరిని సంసేవింతు నెల్లప్పుడున్

చ ఎడపక విష్ణునిం బొగడుటే గడునొల్లక దుర్మదంబునన్
గడుపులకై నరాధములఁ గావ్య ముఖంబుల సన్నుతింపఁగా
బొడమిన పాప జాలమున బొజ్జఁగఁగన్ పాలియించి ముక్తిఁబొం
దెడు కొఱకై రచింతు కృతి నీలగిరీంద్రుని కర్పితంబుగన్

---

1 చూడుఁడు ప్రబంధ రత్నావళి పుట 6

1 భారతి — కవికాల నిర్ణయము శాసనాధారములు (సం 26 సం 2)

2 R 1069 ప్రా లి పు భాండాగారము మదరాసు

క కృతినాథుఁడు నీలాచల
పతియట! శుకయోగి వదన భాషాసుత
త్కృతి భాగవతంబది యౌట!
మతి దలఁపఁగ నెంత కన్నమాస్ఫలఁగిందే!

శా ప్రస్కన్నామర రాక్షసున్ నిఖిల భూభారాపహర్తన్ మహే
శస్కందాదినుత ప్రభావుఁగమలాసంవాస రాజన్మహో
రస్కున్ విష్ణుఁ దలంచి భాగవత పౌరాణీయమై నట్టి ష
ష్ఠ స్కంధంబుఁదెనుంగు చేసెదను కృష్ణ ప్రీతిగా వేడుకన్

[ఇందలి శైలి దెలియుటకీ క్రింది పద్యములనుదాహరింతును]

ఆ వె శ్రీ సమేత! మిమ్ము సేవింప నొల్లక
మీరి శుభము పొందఁగోరువాఁడు
చెంగలించె శునకలాంగూల ముఖమున
నదిని దాఁట గోరునట్టి వాఁడు

ఆ వె ఎరుసమునకు నినుము బంగారమును నొక్క
విధమునైన యట్లు విశదముగను
శ్వపచుఁడైన విప్రవరుఁడైన శ్రీ విష్ణు
భక్తినొక్క సమను పరిచరింప

చ అరయఁగఁబద్మ సంభవుఁడు నాత్మనివాస సరోజ కర్ణికాం
తరముననుండి తీవ్ర పవన ప్రహితాధిక వీచిమాలికా
పరిమిత ఘోష భీక్షిత విభావ్య మహార్ణవమందు మగ్నుఁడై!
పరువడితో మిముందలఁచిపారము నొందఁడె భక్తవత్సలా

శా ఓరాజీవ దళాభిరామనయనా! యోసత్యసన్మంగళా
యో రాత్రించరకంఠనాళదళనా! యో సర్వ లోకాధిపా
యో రత్నాకర మేఖలా పరివృఢా! యో భక్త కల్పద్రుమా
యోరాకా హరిణేందు రమ్యవదనా! యో పద్మనాభాచ్యుతా!

శా శ్రీవత్సాంకిత మూర్తయే విమల రాజీ వాక్షయుగ్మాయ ల
క్ష్మీనక్రాంబుజ షట్పదాయ వసుధామిత్రాయ సర్వాత్మనే
భావ గ్రాయకృపాకరాయ హరయే భక్తార్థ సంధాయినే
గోవిందాయ సమస్త దైత్య నివహక్రూరాయ తుభ్యంనమః

గద్య

ఇది శ్రీహనుమత్కటాక్షలబ్ధవర ప్రసాద సహజ సారస్వత చంద్ర నామాంకిత విద్వన్మణి అష్టఘంటావధాన పరమేశ్వర హరిభట్టారక ప్రణీతంబైన భాగవత పురాణంబునందు షష్ఠస్కంధము

హరిభట్టును, శృంగార షష్ఠమును రచించిన నంది మల్లయ కవులకు సమకాలీనుడు కాని యీతని భాగవత రచనములన్నియు, విశిష్టాద్వైత మత సంప్రదాయము ననుసరించి రచితము లైనవి కవితా విషయమున నీతఁడు షష్ఠస్కంధ రచయితల కెవ్వరికిఁదీసిపోఁడు అయినను నద్వైత మతాను సారియగు పోతన భాగవతమున , విశిష్టాద్వైత సంప్రదాయికమగు గ్రంథము చేర్చుటవలన పడమి సింగన షష్ఠస్కంధమందుఁజేర్పఁబడినది

పోతన వెనుక సమీప కాలములోనే, షష్ఠస్కందము ముప్వురు కవులచేఁదెలిగింపఁబడుటకు హేతువేమని విమర్శక లోకము శంకించుట కవకాశమున్నది కాని దానికి సమాధానమాస్కంధము నందే యున్నది భాగవతమున కావ్య సాధారణ శృంగార రసము వర్ణించుటకు నీ షష్ఠస్కంధ మందలి కథలే తప్ప, నితర స్కంధమున నట్టివి గానరావు శ్రీకృష్ణ శృంగార లీలాపరమావధి యగు దశమస్కంధము నందలి శృంగారముదాత్తమైన భక్తి శృంగారము భాగవతమున ప్రథమము నుండి పంచమము వఱకుగల స్కంధములు భగవత్తత్త్వ ప్రతిపాదకములు సప్తమమునుండి దశమము వరకుగల స్కంధములు భగవద్భక్తి ప్రతిపాదకములు షష్ఠస్కంధము కథా ప్రధానము ఏకాదశ ద్వాదశస్కంధములు తత్త్వప్రతిపాదకములు భగవద్భక్తితత్త్వ ప్రతిపాదకుఁడగు పోతనామాత్యుఁడు షష్ఠమస్కంధమును రచియింపనే లేదనుటకు పై షష్ఠస్కంధ రచనలు తోడుపడుచున్నవి

## ద్విపద భాగవతము

### దశమస్కంధము

తెలుఁగున పోతన భాగవతము సంపూర్ణముగ రచియించిన నాఁటికే, భాగవతములోని దశమ స్కంధమాంధ్ర భాషలో వెలసినది అది ద్విపద కృతి క్రీ శ 1420 ముందుగానే, మడికి సింగన యను కవి దీనిని రచించెను సింగన కాల నిర్ణయము నిష్కృష్టమగుట చేత, నిది క్రీ శ 1460 ప్రాంతములో సంపూర్ణముగా రచితమయిన పోతన భాగవతముకంటె ముందు కాలమున బుట్టినది

సింగన ద్విపద భాగవతమును నేఁటి పరిశోధకులు సారస్వత చరిత్రకారులు నెఱుఁగరు దాని కొకటియే తాళపత్రప్రతి యుండుటయు, నదియైన తెలుఁగు దేశమునకు సుదూరమున నున్న తంజావూరి సరస్వతీ పుస్తక భండారమునందుటయుఁగారణములుగా నది వ్యాప్తము కాలేదు

'పదేండ్ల క్రిందట నీ ద్విపద దశమస్కంధము ముద్రితమైనది [1] గ్రంథము పేరు దశమ స్కంధమే. భాగవత దశమస్కంధమే, కాని సంస్కృతాంధ్ర భాగవతములందువలె, పూర్వోత్తర భాగములుగా విభజింపఁబడి యుండలేదు ఈ గ్రంథమున, కథ, మధురా కాండము, కల్యాణ కాండ, జగదభిరక్ష కాండ, అని మూఁడు విధములుగా విభక్తమైనది ఈ గ్రంథమైన సంపూర్ణ ముగ లేదు గ్రంథమునందటచ్చట పంక్తులు లోపించినవి అక్రూర స్తుతితో ప్రారంభమై, ధర్మరాజు రాజసూయ యాగమున శ్రీ కృష్ణుని వృత్తముతో ముగియుచున్నది ఉపలభ్యమగు నంతవఱకును, నిందలి ద్విపద హృద్యముగ నున్నది మడికి సింగన్న, నన్నయ తిక్కన సంప్రదాయములనే కవితా రచన యందనుసరించినను భాష, శైలి విషయమున శివకవుల విలక్షణ దేశి సంప్రదాయము ననుసరించినాఁడు

సింగన కృతి యందలి మధురాకాండాది విభాగములకు మూలము గర్గ భాగవతము గర్గ భాగవతమున నీ విభాగములు సింగన యనుసరించు కథాకథనము మాత్రము వ్యాస భాగవతము నను సరించి రచియించి యున్నాఁడు

సింగన గద్యలో —

''ఆరూఢమతివయ్యలార్యనందనుఁడు
శృంగార రస కళాశిక్షితవచోధనుఁడు
సింగనామాత్యుఁడు చెలువగ్గలింప
సలలిత రసభావశబ్దగుంభనల
వలనొప్పు శ్రీ భాగవత పురాణమున
మహాసీయమగు దశమస్కంధసరణి''

అని చెప్పుకొనిన రీతిని రచన ధారా వాహికయై, సరళ శైలిలోనున్నది కాని పోతన భాగవత మునకు దీనికిఁ బోలికయే లేదు పోతన దీనిని చూచినట్లు కానరాదు పోతన భాగవతమునకు జీవమై, శృంగార భక్తిరస సమ్మేళమునకు శ్రీ నిలయమైన దశమస్కంధము ప్రచారములోనికి వచ్చిన వెనుక, నీ రచనకు స్థానము లేకుండ పోయినదని మన మూహించుట సరియగు పద్ధతి వస్తు విషయమునఁ బ్రాధాన్యము లేకున్నను, సింగన కృత్యంతరముల యందు గనుపట్టని భాషా సంప్ర దాయ విశేషములీ ద్విపద కృతియందు గాన వచ్చుట చేత దీనికి నొక విధమగు విశిష్టత యున్నదని గ్రహింప వలెను దీని నింకను జాగరూకతతో విమర్శకులు చదివినట్లు కానరాదు

---

1 తంజావూరు సరస్వతీ మహలు లైబ్రరీ వారు ప్రకటించిరి 1950

## ఏకాదశ ద్వాదశ స్కంధములు

ప్రస్తుత ముద్రిత భాగవతమున నేకాదశద్వాదశ స్కంధములు వెలిగందల నారయ కృతముగా నున్నవి నారయ పోతన ప్రియ శిష్యుఁడైనట్లు గ్రంథాంత గద్యవలనఁ దెలియుచున్నది "ఇది శ్రీ పరమేశ్వర కరుణా కలిత కవితా విచిత్ర, కేసన మంత్రి పుత్ర సహజ పాండిత్య పోతనామాత్య ప్రియ శిష్య వెలిగందల నారయ నామధేయ ప్రణీతంబైన భాగవత పురాణమున ద్వాదశస్కంధము"

తాళపత్ర ప్రతులలో నారయ రచనతోఁబాటు హరిభట్టు రచితమైన యేకాదశ ద్వాదశ స్కంధములును గనుపట్టుచున్నవి నారయ, హరిభట్టు రచనముల కెన్నియో పోలికలున్నవి వానిని తరువాతఁ జర్చించెదను

ప్రత్యేకముగా షష్ఠస్కంధముగా రచనమై వెనుక కవులను హెచ్చుగా నాకర్షించినవి యేకాదశ ద్వాదశ స్కంధములని చెప్పవగును

మీద తెలిసిన —

1. నారయ

2 హరిభట్టులు కాక

3 పంజీవరాయకవి ఏకాదశస్కంధమును రచియించెను 2, 3 గ్రంథములముద్రితములు ఇక కడచిన శతాబ్ది చివరను నీ శతాబ్దిలోను నేకాదశ ద్వాదశములు రచితములైనవి

4 కోవూరి పట్టాభిరామయ్యగారు (క్రీ శ 1850—1915)
వీరు బ్రహ్మవేత్తలు కోవూరు ప్రబుద్ధాశ్రమ నిర్మాతలు వీరు ఏకాదశస్కంధమును గద్యపద్యాత్మకముగ మూలానుసారముగ నాంధ్రీకరించిరి

5. సంపన్ముడుంబ పింగరాచార్యులు గారు (క్రీ శ 1860—1930)
వీ రేకాదశ ద్వాదశస్కంధములనే గాక భాగవత ప్రథమ, ద్వితీయ, పంచమ, దశమ స్కంధములను దెలింగించిరి

6 మిన్నికంటి గురునాథశర్మగారు — సజీవులు — వేదాంత విద్యా పారీణులు
క్రీ శ 1952 లో నేకాదశ ద్వాదశ స్కంధములను సంపూర్ణముగఁ దెలిగించినారు ఇవి ముద్రితమైనవి

తొలుత నారయ రచనను గూర్చి తెలిసికొందము

నారయ ఏకాదశ ద్వాదశ స్కంధ రచనము మూలమునకంటె చాల చోట్ల న్యూనముగను కొన్నియెడల మూలాభిప్రాయమునకు విరుద్ధముగను నున్నది దీని కొకటి రెండుదాహరణముల జూపుచున్నాను

మూలము —

శ్లో ఇంద్రియార్థ భ్రమోజాగ్రత్స్వప్నోంతఃకరణ భ్రమః
సుప్తంతద్వాసనా బీజం తుర్యామూర్తిస్తదన్వితః

తెలిగింపు

వ ఇంద్రియార్థ భ్రమణంబు సేసెడు దుర్మతులకు
సుషుప్త్యాద్యవస్థలు వరుసన కలుగుటం జేసి పరమేశ్వరుని
బొందరామి యను నాలుగవ యవస్థయుం గలుగు

శ్లో తంచోపనీయ సదసి పరిమ్లానముఖశ్రియః
రాజ్ఞ ఆవేదయాంచక్రు స్సర్వయాదవ సన్నిధౌ
తం చూర్ణయిత్వా ముసలం యదురాజస్స ఆహుకః
సముద్ర సలిలే ప్రాస్యల్లోహంచాస్యావశేషితం
కశ్చిన్మత్స్యో గ్రసీల్లోహమ్

వ దానిం గొనిచని దేవకీ నందన సన్నిధానంబునం బెట్టి యెఱింగించిన నతం డాత్మ కల్పిత మాయా రూపంబగుట యెఱింగియు నెఱుంగని తెఱంగున వారలం జూచి యిట్లనియె సముద్ర తీరంబున నొక్క మహా పర్వతంబున్నది అందునుండు నత్యుచ్ఛ్రయ విశాల భీషణంబగు పాషాణంబున మీ భుజాబలంబు చేత నీ ముసలంబుం దివిచి దీని చూర్ణంబు సింధుక బంధంబులం గలిపి రండు పొండని జగద్విభుండైన కృష్ణుండాన తిచ్చిన వారు నట్లు చేసి తత్క్రీలితంబైన లోహ ఖండంబును నరకుగొనక సాగరంబున బడవైచిన యొక్క ఝషంబు గ్రసించిన

మూలమున "రాజ్ఞే," "యదురాజస్స ఆహుక " అనునవి యుగ్రసేనుని నిర్దేశించుచుండఁగా తెనుఁగున "దేవకీ నందనుండైన" "జగద్విభుండైన కృష్ణుండు" అని యున్నది తెలుఁగున మరి కొన్ని వాక్యములకు సంస్కృత మూలము లేదు

కొన్నియెడల యొకటి రెండధ్యాయములే తెనిగింపబడలేదు ఏకాదశ స్కంధమునఁ ద్రయోదశాధ్యాయమున శ్రీకృష్ణుఁడు హంస రూపియై చేసిన తత్త్వోపదేశము

"వస్తు నోయదనానాత్వమాత్మనః ప్రశ్న ఈశ్వరః" అను శ్లోకము మొదలుగాఁ బదియేడు శ్లోకములఁ జెప్పఁబడియున్నది వానికెల్లఁదెనుఁగున యయిదాఱు పంక్తులు మాత్రమే గలవు. అవియు మూలానుసారులు కావు

శ్లో॥ మనసావచసా దృష్ట్యా దృశ్యతేన్యైరపీంద్రియైః
అహమేవ నమత్తోన్యదితి బుధ్యధ్వమంజసా

అనునది "పంచేంద్రియములకు దృష్టంబైన పదార్థం బనిత్యంబు అది నిత్య దృష్టిని బ్రహ్మంబని తెలియవలయు" అని తెనిగింపఁబడియున్నది కవి పదునాలుగవ యధ్యాయమునఁ జెప్పఁబడిన భక్తి పారమ్యధ్యాన యోగములను బది బంతులలో నఱగొఱగాఁదెనిఁగించి, షోడశమునందలి విభూతు లను జెప్పి యవ్వలి మూఁడధ్యాయముల విషయమును మూఁడు బంతులతో సూచించి పంద్రెండవ యధ్యాయమునకు మఱలి , యందుఁగల

శ్లో॥ తస్మాత్త్వముద్ధవోత్సృజ్య చోదనాప్రతి చోదనామ్
ప్రవృత్తించ నివృత్తించ శ్రోతవ్యం శ్రుతమేవచ
మామేకమేవ శరణ మాత్మానం సర్వ దేహినామ్
యాహి సర్వాత్మభావేన మయాస్యాహ్యకుతోభయ

ఈ శ్లోకములకే "సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ' అని నాలుగు పంక్తులు చెప్పి, పిదప పందొమ్మిదవ యధ్యాయమునందలి శిష్టాంశమును గొంతయు, నిరువది నాలుగవదాని యందలి సాంఖ్య విధియు, సప్తవింశమునందలి యర్చనా ప్రకారంబునఁ గొంతయుఁదెనిగించి, యిరువది తొమ్మిదవదానియందు గల

శ్లో॥ గచ్ఛోద్ధవ! మయాదిష్టో బదర్యాఖ్యంమమాశ్రమమ్

అను మొదలుగా నవ్వలి రెండధ్యాయంబులను దెనిగించియున్నాఁడు ఈ స్కంధంబున గల భిక్షు గీతాదులు తెనుఁగున లేవు దీనిని బట్టి ఏకాదశస్కంధము మూలముకంటె తెనుఁగున నాఁ గింట నొకపాలు మాత్రమే యున్నది ద్వాదశ స్కంధమున నధ్యాయములే పూర్తిగా వదలిపెట్టఁ బడకున్నను, నా స్కంధమున మూలముకంటె తక్కువగను, భిన్నముగను నున్న రచనలు చాలఁ గలవు నారయ రచనమున విశేష మేమనఁగా నది విశిష్టాద్వైత సంప్రదాయానుసారియై యున్నది

శ్లో॥ మామేకమేవ శరణ మాత్మానం సర్వ దేహినామ్"

అను శ్లోకమునకు "సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" యను నుపనిషత్తుల్యంబగు గీతా వచన ప్రకారంబున" అని యీ శ్లోకమునకు విశిష్టా ద్వైతులవలె, కవి మిక్కిలి ప్రాధాన్యమును జూపి యున్నాఁడు

మఱియు "జీవాత్మ భేదంబు" మొదలైనవి యెఱింగించి, "విజ్ఞానవంతునిగా జేసి మన్నించితి" (ద్వా వ 2) అను వాక్యమును,

"దేవతాంతరమంత్రాంతర సాధనాంతరంబులు వర్జించియుండెనేని వైకుంఠంబున వసియించు (ద్వా వ 39) అను వాక్యమును వీర వైష్ణవ సూచకములు

నారయ రచితమైన యేకాదశ ద్వాదశ స్కంధము లిట్లు మూలమునకు భిన్నముగా నుండి, పోతన గ్రంథముతో పొత్తు కలుగకపోవుట చేతనే, యానాఁటినుండి నేఁటివఱకు నీ రెండు స్కంధములను నయిదారుగురు కవులు తెలిగింపవలసిన యావశ్యకత కల్గినది

వెలిగందల నారయకు సమీపకాలముననే హరిభట్టారకుఁడు షష్ఠస్కంధముతోఁబాటు నీ యేకాదశ ద్వాదశ స్కంధములను తెలిగించెను షష్ఠస్కంధము సింగనది సమగ్రముగా నున్నది కావున లేఖకులు దాని జోలికిఁబోలేదు ఇక నారయ రచనము మూలమునకు భిన్నముగా నుండుట జూచి, సంస్కారముగల లేఖకులు హరిభట్టారకుని యేకాదశ ద్వాదశ స్కంధములను భాగవతమునఁ గూర్చుకొని దానికి సంపూర్ణత్వము నాపాదింపఁ జేసిరి

భాగవత ప్రతులు కొన్నింటిలో హరి భట్టారకుని రచనలుండుట కిదియే కారణము మఱియు, నారయ కృత స్కంధములు రెండును నే కారణముననో శిథిలములైనవి హరి భట్టు రచనమును నారయ రచనమును, మార్పు చేసిన పట్టులు తాళపత్ర పరిశోధనము వలనఁదెలియుచున్నది కావున భాగవత శిథిల పూరణ కథలకు నీ నారయ రెండు స్కంధములు కారణమని నే నూహించితిని [1]

ఏకాదశ ద్వాదశ స్కంధములలో వెలిగందల నారయ రచనమునకు హరిభట్టు రచనమునకుఁ బెక్కు పోలిక లగుపడుచున్నవి పద్యములట్లనే కొంచెము మార్పులతో నున్నవి

నారయ     మ   విదితుండై సకలామరుల్ గొలువ నుర్వీభారమున్ మాన్పి దు
ర్మదసంయుక్త వసుంధరాధిపతులన్ మర్దించి కంసాదులన్
దుదముట్టన్ వధియించి కృష్ణుఁడతిసంతుష్టాత్ముఁడై యున్నచో
యదువంశ్యంబులు భూమి మోవఁగ నసహ్యం బయ్యె నత్యుగ్రమై
(11—6)

---

[1] భాగవతము 1948 ముద్రణము — పీఠిక 102 పుట

హరిభట్టు మ  విదితుండై సకలామరుల్ పొగడ నుర్వీభారము న్మాన్పి దు
ర్మద సంయుక్త వసుంధరాధిపతుల న్మర్దించి కంసాసురున్
దుదముట్ట న్వధియించి కృష్ణుఁడతి సంతుష్టాత్ముఁడై యున్నచో
యదు సైన్యంబును భూమిపై నవిషహ్యం బయ్యె నత్యుగ్రతన్

కొన్ని పట్టుల నారయ వచనములుగా వ్రాసినదానిని హరి భట్టు పద్యములుగా వ్రాసెను ఒక యుదాహరణ

నారయ వ  అట్లుగావున గృహ క్షేత్ర పుత్ర కళత్ర ధన ధాన్యాదులందు మోహితుండై
ముక్తిమార్గంబు ప్రత్యక్షంబని నిందించువాఁడును, హరి భక్తి విరహి
తుండును దుర్గతిం గూలుదురు (75)

హరిభట్టు

శా  అప్రత్యమ్ము విముక్త మార్గమని విద్యాగర్వ సంపన్నులై
విప్రుల్ గొందరు దారపుత్ర సమితిన్ వీక్షించి విత్తార్థులై
అప్రామాణ్య పదంబునన్ దిరుగుదుర్ యజ్ఞాన గుప్తోల్లస
త్సుప్రజ్ఞారహితాత్ములై నిలుతు రస్తోకాగతిన్ మాధవా !

25 పద్యము

హరిభట్టు —

హరిభట్టీ రెండు స్కంధములను సంపూర్ణముగా నాంధ్రీకరించియున్నాడు ఇవి రెండును ముద్రితములైనవి ఏకాదశ స్కంధమున 319 గద్యపద్యములు గలవు

హరిభట్టు రచనము ధారాశుద్ధి గలిగి మనోహరమై యుండును

మ  గురు సంసార మహార్ణ వాంతర నిమగ్నుండై, దురాశాపరం
పరచే నష్ట విలోచనుండగుచు నాపత్పంకసంలిప్తుడై
వరుసన్ గాల మహాహిజిహ్వాతుదప్పై వర్తించు నీ జీవునిన్
హరిదక్కన్ బరులెవ్వరోపుదురు సత్యాచార! రక్షింపఁగన్

క  శ్రీహరిపైఁ దనుజాత
స్నేహం బొనరించి వర్ణనీయంబగు మీ
దేహములు శుద్ధిఁబొందెడు
నాహారాలింగనోజ్జ్వలాలాపములన్

ఇందొక దండకము గలదు

హరిభట్టు కవితలో "ఋభువు లప్సరసలు రుద్రులు సాధ్యులు" 11—148 అనుయుతులు "పుడమి భారము మాన్ప" 11—153 అను సమాసములు, ఉత్పల ఉదయించె 11—160 అను తత్సమ రూపములు కన్పట్టుచున్నవి [2]

## సంజీవరాయకవి - ఏకాదశస్కంధము

ఈ కవి యుదంతము తెలియలేదు ఈతని ఏకాదశస్కంధము ముద్రితము అదియైన సమగ్రముగ లేదు మొదటి యాశ్వాసము సంపూర్ణముగను, రెండవ యాశ్వాసము కొంతదాకను గలదు

గద్య

ఇది శ్రీనివాస కృపాకలిత కటాక్ష వీక్షాసమాసాదిత సంస్కృతాంధ్ర కవితా విలాస, నందవర వంశ ముక్తాఫల కృష్ణయామాత్యతనూభవ సజ్జన విధేయ సంజీవ నామధేయ ప్రణీతంబైన శ్రీ మహాభాగవతైకాదశస్కంధంబునందు ప్రథమాశ్వాసము

లభ్యమైనంతవఱకుఁ నిది చూడ సంజీవరాయ రచన మూలానుసారియై మనోహరమై యున్నది మచ్చునకు రెండు పద్యములు

మ    సరసావార్యవగాహశీతలములై, సంపుల్ల సూనచ్ఛటాం
తర రేణూత్కర పశ్యలోహరములై, నానాలతాలాసికా
చరణ న్యాస నిధాన దేశికములై, సంచారమున్ సల్పె మం
థరవాతంబులు సంయమీంద్ర! తనునైదాఘాంబువుల్ డిందగన్

చ    కటకట! మందభాగ్యులము కాలము గడువంగవచ్చునె
యిటు చనుదెంచి సాధుజన హేళన మే మొనరించుచుంగదా!
పటుతరమైన శాపమున భంగము వచ్చె గులంబులెల్ల నా
రట మెద సంభవిల్లె మన రాజికనేమనువాడ దీనికిన్ [3]

---

[2] ఇవి ముద్రితములైనవి — ఆంధ్ర సాహిత్య పరిషత్తు కాకినాడ

[3] మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము R 670
ఈ గ్రంథ మెచ్చటను నీ వరకు పరిజ్ఞాతము గాదు

## మిన్నికంటి గురునాథశర్మ

### ఏకాదశ ద్వాదశ స్కంధములు

ఈ గ్రంథకర్త వేదాంత విద్యా పారీణుఁడు పరమ భాగవతోత్తముఁడు ప్రశస్త కవి ఈ గ్రంథము పూర్వపువాని వలె, యాశ్వాస విభాజ్యముగాక, సంస్కృతము నున్న యధ్యాయములను బట్టి యాంధ్రీకరింపఁబడియున్నది ఏకాదశ స్కంధమున మూలమున ముప్పదియొక్క యధ్యాయములు — 1373 శ్లోకములు గలవు ద్వాదశస్కంధమున పదమూఁడధ్యాయములు 566 శ్లోకములు గలవు నారయు, 123+53=176 గద్య పద్యముల సంగ్రహించిన దానిని ప్రస్తుత గ్రంథకర్త మూలానుసారముగ నెంతయో విపులీకరించెను

కృత్యాది 155 పద్యములుగాక నేకాదశస్కంధమున 1767 గద్యపద్యములు, ద్వాదశ స్కంధమున 713 గద్యపద్యములు మొత్తము 2480 గద్యపద్యములున్నవి కావున నేకాదశ ద్వాదశముల కిది సంపూర్ణానువాదమని చెప్పవలయును గ్రంథకర్త యీ పరిశ్రమకభినందనీయుఁడు గ్రంథశైలి సరసము గ్రంథము ముద్రిత మగుటచేత పద్యములు దాహరింపలేదు [4]

---

[4] Published by the Orient Power Press, Tenali 1952

# 12. భాగవతాదర్శము - ఉపాఖ్యానములు

భాగవతమున నుపాఖ్యానములు భగవద్భక్తి తత్త్వమును, భగవదనుగ్రహమును, ప్రవృత్తి నివృత్తి మార్గమును నిరూపించునవి వీనిలో కొన్ని యుపాఖ్యానములు ప్రత్యేకముగా ప్రబంధములుగా రచితములైనవి

1. వయస్సు, లింగము, వర్ణము — అను భేదములతో పనిలేనిది భగవదనుగ్రహము జీవన్ముక్తుఁ డగు పురుషునకు వయస్సుతోఁబనిలేదు ధ్రువోపాఖ్యానము దీని కుదాహరణము

2 శరీర సంపుటీకరణ విషయ వివరణమును దెలుపునది పురంజనోపాఖ్యానము.

3 కొన్ని జన్మములకైన కర్మ క్షయమై ముక్తి లభించును, అను సూత్రమును జడభరతోపాఖ్యానము వివరించును

4 భగవన్నామోచ్చారణము — భవతారకము — అని అజామిళోపాఖ్యానము దెలుపును

5 జనన మరణ స్వరూపము — పుత్రాది సంబంధము — శివకేశవభేదము కలుగకుండ రాదు అను విషయములను గూర్చి తెలుపునది చిత్రకేతూపాఖ్యానము

6 ప్రియ జన మరణ దుఃఖము దెలుపునది సుయజ్ఞోపాఖ్యానము

7 అహంకారము నణఁపవలెనను నీతిని వ్రతనిష్ఠను దెలుపునది అంబరీషోపాఖ్యానము

8 పూర్వజన్మ దుష్కార్యాచరణము దారిద్ర్య రూపమున కుచేలుని పీడింప నాతఁడు హరి స్మరణమువలన దర్శనమువలన ముక్తిపొందినది తెలుపునది కుచేలోపాఖ్యానము.

తెనుఁగు భాగవతమునకు మూలము వ్యాస మహర్షి ప్రణీత మగు భాగవతము సంస్కృత మూలమున పండ్రెండు స్కంధములు, 332 అధ్యాయములు, 18 వేల శ్లోకములు గలిగియున్నది అయినను సంస్కృత భాగవతము, పోతన కవితాస్పర్శవేదిచే తెలుఁగున బంగార మైనది పట్టినది యెల్ల పైఁడి యైన భంగిని చెప్పినదెల్ల భక్తి రసస్నిగ్ధమైన పద్యమై యుట్టిపడినది ముట్టినది యెల్లమూర్తియైనట్లు, ముముక్షులఁ కందరాని భగవతత్త్వము గ్రంథరూపముఁదాల్చినది కట్టిన కవిత, కవితా సామ్రాజ్యమునకుఁబట్టము గట్టినది

పోతన కవిత భగవత్ ప్రసాదితము కాబట్టియే కఠినమగు సంస్కృత భాషా సమాసములు ప్రసాదత్వమును వహించినవి భగవత్ప్రసాద మెల్లప్పుడు పరమ పవిత్రము ఆంధ్ర భాగవత

మట్టిదిగావున, గంగా ప్రవాహమున నంబువులెట్లన్నియును పవిత్రమునై సేవ్యమానమైనవో, ఆ రీతినే పోతన రచనయందు ప్రతియక్షరము, ప్రతిపదము, ప్రతిపద్యము పవిత్రమై సేవ్యమానమైనది

మూలమున రేఖా మాత్రమైన విషయమును, తెనుఁగున నపూర్వ రూపరేఖా విలాసములచే నద్భుతముగ విస్తృతమైనది పోతన గంటము, లయస్సంబంధమైనను, నయస్కాంతమువలె హృదయము నాకర్షించినది కారణ మాగంటము చిందినవి యక్షరములు కావు అమృత రస వాః కణములు కావుననే ప్రతిపద్యమును రసనిష్యంది యైనది కథా మాత్రమున రసహీనమగు నంశమును, చెఱకుగడవలె రసనాడులతో పసమీఱినది

ఆంధ్ర భాగవత సృష్టికి వ్యాస మూలము నిమిత్త కారణము వ్యాస హృదయా విష్కరణ ముపాదనకారణము పోతన భక్తిరసానుభూతి ప్రధాన కారణము ఇందుచేతనే పోతన కవితతో భగవత్ సత్యము, బాహ్యసౌందర్యము, అంతరంగిక రసభావనాశివత్వము — మూఁడును సమ్మేళనముఁ జెందినవి సంపుటీకరణము గాంచినవి సమైక్యస్థితిని పొందినవి

"ఇంతింతై, వటుఁడింతయై, మఱియుఁ దానింతై, నభోవీధిపై
నంతై తోయదమండలాగ్రభమున కల్లంతై, ప్రభారాశిపై
నంతై, చంద్రునికంతయై ధ్రువునిపైనంతై మహర్వాటిపై
నంతై — వామనమూర్తి బ్రహ్మాండాంత సంవర్ధియైనట్లు

పోతనయు భాగవత రచనచే, నాంధ్ర వాఙ్మయ ప్రపంచ మంతయు నావహించి, నిత్యసత్యమగు బ్రహ్మపదము నలంకరించినాఁడు

లోకసంగ్రహార్థము నాంధ్రభూమి నవతరించిన పోతన —

హరిమయము విశ్వ మంతయు
హరి విశ్వమయుండు సంశయము పనిలే దా
హరిమయము గాని ద్రవ్యము
పరమాణువు లేదు —

అని పరమాణువున హరిని భావించినాఁడు నేఁటి పరమాణుయుగమున అణువునయందలి విశ్వైక వశీకరణశక్తి గుఱ్ఱింపబడినది. కాని యా యణువునందలి హరి తత్త్వము — అనగా నధ్యాత్మిక తత్త్వము గుర్తింపఁబడలేదు పరమాణుయుగమునకు భాగవత మా యాధ్యాత్మిక భక్తితత్త్వ ప్రబోధక జ్యోతి! ఆ జ్యోతినే తలంచుచు పోతనతోఁగూడ

"నీ పాదకమల సేవయు
నీ పాదార్చకులతోడి నెయ్యంబు నితాం
తాపార భూత దయయును
తాపస మందార నాకు దయసేయు గదే"

అని వేడుకొనుచు, లోక కల్యాణమునకుఁ దోడ్పడి జన్మము సాఫల్యము చేసికొందము

# 13. అనుబంధము

## 1 పోతన భాగవత మాహాత్మ్యము

నక్క దోసకాయ యూరుగాయ, గోంగుగూరపచ్చడి, బఱ్ఱె పెరుగు అంతే అంతకంటె నక్కడ యేమి దొరకును? అవే పంచభక్ష్య పరమాన్నములు ఇట్లనుదినము వేళపాళయని లేక కొర్నిపాటి సుబ్బరాజాగా రన్నప్రదాన మాచరించుచుండిరి అన్నము జొన్న యన్నము విస్తరి బొడ్డు మేడియాకు విస్తరి ఉప్పు రాతి యుప్పు నీరు దిగుడు బావి నీరు ఇప్పటి మాటయా, దాదాపు నూఱేండ్ల క్రిందటి మాట! ముప్పది సంవత్సరము లిట్లా బ్రాహ్మణుఁ డన్నప్రదాన మొనర్చె నాఁడు మహానుభావుఁడు నిర్గర్వుఁడు

ఆతని భార్య దుర్గమ్మ ఎందఱతిథులు వచ్చినను వారి కందఱకు బహు పరిశుభ్రముగా వండి, భర్త కుట్టి సిద్ధపరచి యుంచిన యాకులలో వడ్డించి, వారు సంతుష్టిగ భుజించిన తరువాతఁ దాను భుజించును ఇట్లొక్క దినమా? ఒక్క మాసమా? ఒక్క సంవత్సరమా? ముప్ప దేండ్లనుండి చేయుచున్నది

అతిథులకు సాయంకాలము మూఁడు గంటలు కాగానే అనవుఁగాయ దినములలో తంపటి వైచిన యనుప గుగ్గిళ్ళు, లేజొన్న కంకుల దినములలో నూచ బియ్యము, మొక్క జొన్న పొత్తుల కాలములో మొక్క జొన్న పొత్తులు, ఇట్లు నే యే కాలములలో నేది వచ్చునో యది యల్పాహారముగ వారి యెదుటఁబెట్టి, తాను చేగునవమంత గంటము చేత బుచ్చుకొని తాటి యాకుల పై, భాగవతమో, హరివంశమో, మఱేదియో సుబ్బరాజుగారు వ్రాసికొనుచుందురు

ఇట్లాతఁ డెన్నియో గ్రంధములు వ్రాసినాఁడు కవీశ్వరు లాతనికిఁ గన్నులఁ గట్టినట్లుందురు ఆతనికి పోతరాజుగారన్న యపరిమిత భక్తి ప్రపత్తులు గలవు ఒకనాడు తాను భార్యయుఁ బండు కొనియుండఁగా భార్యనిట్లు ప్రశ్నించెను

"దుర్గా! పోతరాజుగా రెట్లుందురని నీ యభిప్రాయము ?"

ఈ ప్రశ్న యెందులకో యామెకు బోధ పడలేదు కాని "పొడుగుగాను నన్నముగాను నుందురని నే ననుకొందును" అని యామె బదులు చెప్పెను

"అలాగునఁ గాదు సుమీ! పొట్టిగా నుండును, తగుమాత్రమైన బొజ్జ గలిగియుండును" అని సుబ్బరాజుగా రనిరి ఔనని, కాదని భార్యాభర్త లిట్లు సంభాషించుకొన్నమీఁదట, భర్త

"దుర్గా! నే నన్నమాటయే నిజమగునెడల — నదిగో — గోడ బల్లపీఁటఁ బెట్టిన మద్దెల యున్నదే, అది గణగణ మ్రోఁగును" అనునరికి యేమి జరిగెనో మనకుఁ దెలియదుగాని మద్దెల గణ గణ మ్రోఁగెను అంత సుబ్బరాజుగారు మహానందమున లేచి మద్దెలను క్రిందికి దింపి దానికిఁ బూజ లొనర్చి "పోతరాజుగారి మద్దెం" యని దానికిఁబేరిడిరి ఆనాటినుండి భాగవతములోని గజేంద్ర మోక్షాది గాథలలోని పద్యము లన్నియుఁగీర్తనముగా పాడుకొనుచు నా మద్దెల వాయించుకొను చుండెడివారు

ఈ కథ జరిగి యానాటి కిరువదేండ్లయినను నతిథులకు సుబ్బరాజుగారు దీనిని తప్పక విని పించుచుండెడివారు ఈ కథ చెప్పి —

క. పలికెడిది భాగవత మఁట!
పలికించెడివాఁడు రామభద్రుండఁట! నేఁ
బలికిన భవహర మగునఁట
పలికెద వేఱొండు గాథ పలుకఁగనేలా!"

అను పద్యమును చదివి "అహా! మహానుభావుఁడు ఎంత మృదులముగా, నెంత లలితముగా, నెంత మనోహరముగాఁ జెప్పినాఁడో? మా తండ్రి పోతరాజుగారిప్పుడెక్కడనుండునో" యని కన్నుల నీరు జలజల రాల్చుచుండును

కాల మొక్కరీతిగాఁగడవదు వర్షములు వెనుకఁబట్టినవి పంటలు తగ్గినవి క్షామము తలచూపినది సుబ్బరాజుగా రతిథుల కట్లే యున్నదానిలో నన్నదానము చేయుచున్నారు క్రమ క్రమముగా కర్పూరమువలె, పాటి పొలము, ఇల్లు, పాత్ర సామగ్రి, నగలు అమ్మిన ద్రవ్యము హరించిపోయినది దుర్గమ్మ మెడలో మంగళసూత్రము, కూతురు మెడలో రూపు మిగిలినవి ఒకనాఁటి మధ్యాహ్నమతిథులు వచ్చినారు ఇంట నేమియు లేదు ఒంటియందు మిగిలిన మంగళసూత్రము నిచ్చి, తాను పసుపు బొందు ధరించి, దుర్గమ్మ మంగళ సూత్రమునమ్మి ఫర్తతెచ్చిన రెండు వరహాలతో నా యతిథులకు నన్నము బెట్టి, మిగిలినది సాయంత్రమునమ్మాయి మెడకు నప్పేబెట్టి, యా రాత్రియే నెవ్వరితోఁజెప్పకుండ యూరు విడిచి పోవుటకు నేర్పాటు చేసినది సుబ్బరాజుగారు నంగీకరించిరి

ఇంతలో నా యూరిలోనున్న సంపన్న గృహస్థుఁడొకఁడీ యంశమును కర్ణాకర్ణిగా విని యాయన వద్దకు నా రాత్రియే వచ్చి, "సుబ్బరాజుగారూ! మీకు దుర్దినములు వచ్చినవి. దరిద్రతకంటె దుస్థితి లేదు మిమ్ము నేను గనిపెట్టుచుందును మీ రెక్కడికినిఁబోవలదు" అని వేఁడుకొనెను ఆ మాటలు విని సుబ్బరాజుగారు, "ఓయబ్బ! దుష్ట దినములు మాత్రము మమ్మేమి చేయఁగల

వయ్యా! దరిద్రము పోతరాజుగా రనుభవింపలేదా? ఆయనకంటె మే మెక్కువవారమా? ధర్మ బుద్ధిచే నౌకరు నాకింత పెట్టఁగా నేను దినువాఁడను కాను పోతరాజుగారిని రక్షించిన యొంటిమిట్ట కోదండరామమూర్తి మమ్మేల రక్షింపకుండును?
అడవులఁబట్టి పోవుదుము

నాయనా! పోతరాజుగారు

"ఒడవి రక్ష లేని యబలుండు వర్ధిల్లు
రక్షితుండు మందిరమునఁ జచ్చు"

నని చెప్పినారు నమ్ముడు పెట్టకుము కాని నాదొక కోరిక యున్నది ఎవ్వరైన నతిథులు వచ్చునెడల నీవు వారిని శక్తిగలనంతవరకు నాదరించుచుండుము పోతరాజుగారు సంతసింతురు" అని చెప్పి యాతని బంపివేసెను

ఇదివఱకుఁ దాను వ్రాసిన తాటియాకు గ్రంథము లన్నియు నటుక మీఁదఁబదిలముగా దాచి, తాను వ్రాసిన పోతరాజుగారి భాగవతమును దేవతార్చనపుఁబెట్టెతోఁగూడ నంగవస్త్రమునఁజుట్టి తలపైఁబెట్టుకొని, పోతరాజుగారి మద్దెల వీపుపై గట్టుకొని, గంటము మొలలో దోపికొని కూతురు నెత్తుకొని, భార్య చేయి పట్టుకొని —

క. శ్రీకంఠ చాప ఖండన
పాకారి ప్రముఖవినుత భండన, విలసత్
కాకుత్స్థ వంశ మండన
రాకేందు యశోవిశాల రామనృపాలా!

అని పఠించుకొనుచు వెడలిపోయెను

అది మహమ్మదీయుల రాజ్యము నవాబుగారు జోడు గుఱ్ఱాల బగ్గీపై తమ ఖాసా తోఁట నుండి నగరునకుఁబోవుచున్నారు వెనుక తరుపు సవార్లు, ముందరగా రవుతులు వచ్చుచున్నారు ఆ దారినే వెడలుచున్న సుబ్బరాజుగా రమాంతముగా నవాబుగారి బగ్గీ గుఱ్ఱముల కళ్లెములను గట్టిగఁబట్టి దాని నాపి వేసినారు నవాబు పరివారమంతయుఁ జుట్టు మూఁగినారు సుబ్బరాజుగారు పట్టిన పట్టు విడువక నవాబుగారితో

"ఓ యబ్బ! నీవేనటయ్యా! ఈ చుట్టు పట్ల పొలాల కంతకును రాజువు? సరే కాని, నా కేమైనను భత్య మేర్పాటు చేసి తాటాకు గ్రాంథాలు వ్రాయించరాదటయ్యా! నాకు జరుగుబాటు

గను మండును  నీకు ఖ్యాతిగాను నుండును  సుఖముగా గూర్చుండి వ్రాయుచుండుము  నీ కచ్చేరీ లోనికి నన్ను రానీయరని నిన్నుఁజూచుటకు నిక్కడకు వచ్చినాను  ఎవరేమి చెప్పుకొందురో విన వచ్చును గదయ్యా! బండి నిమ్మళముగా తోలించుకొనరాదయ్యా!" అని, ఒకే ధారగా, గుక్కవిడువకుండ, నిష్కల్మషముగ, తన మనసులోని మాటలన్నియు వినిపించినాఁడు  నవాబు గారు విని నిశ్చేష్టితులైనారు. కొంతవడిసి తన వైపే చూపులు నిగిడ్చినట్లు సుబ్బరాజుగారు గ్రహించి ఓ యబ్బ! అదేమి చూచెవయ్యా!

శా  కారే రాజులు? రాజ్యముల్ గలుగవే? గర్వోన్నతిం బొందరే?
వారేరీ? సిరిమూటఁ గట్టుకొని పోవంజాలిరే? భూమిపైఁ
పేరైనం గలదే? శిబిప్రముఖులున్ ప్రీతి న్యశఃకాములై
యీరే కోర్కులు వారల న్మఱచిరే? యిక్కాలమున్ భార్గవా?

అని పోతరాజుగారు సెలవిచ్చిరయ్యా! అడుగక యడుగక నరువదేండ్ల కడిగినానయ్యా! ఈ పొలాలన్నియు నూరకే నా కిచ్చిన నక్కర లేదు  వింటివా? నీవిచ్చు భత్యము నా కేమియు నక్కర లేదు  కొలువు చేయించుకోవయ్యా, నీ వేదిచ్చిన దానితోనొక పూట యతిథి కన్నముపెట్టి మిగిలిన గంజితో నా కూతును సంరక్షించుకొందును  మామాట కేమి" — అని గద్దించి యడిగినట్లు చెప్పెను. నవాబుగారు నిలువు గ్రుడ్లు వైచికొని చూచుచుండగా సుబ్బరాజుగారు

"నీతో నాకేమి పోవయ్యా! రాజన్నప్పుడు పోతిరాజుగారే రాజుగాని నీవెక్కడి రాజువయ్యా!" అని పలికి వెడలిపోవుచుండగా, నవాబుగారి భటులాతని నున్నములో కెముక లేకుండ గొట్టి బాధలు పెట్టిరి "రామ రామ" యని వానినన్నింటి సహించి పోబోవుచుండగ, నొక భటుఁడాతని జందెమును త్రెంపఁబోయెను  సుబ్బరాజు గారు నూటిగ వాని నెత్తిపై గంటముతో గొట్టెను  ఒక్క గంటపు పోటుతో వాఁడు గిలగిల కొట్టుకొని పడిపోయెను  సుబ్బరాజుగారిని నవాబుభటులు చెరసాల యందుంచిరి

విషూచి, స్ఫోటకపు వ్యాధులచె నా రాజ్య మత్యంత భయంకరముగ నుండెను  కారాగారమునకు నలువది బారల దూరముననొక కానుగు చెట్టు గలదు.

అపుడు దుర్గమ్మ కూతురుతో కాయకసరు దిని కాలక్షేపము చేయుచుండెను  తాను వానిచె బ్రతికినను పిల్ల బ్రతుకఁగలదా! పిల్ల కొఱకు నొకరి యింట దాసిగా జేరి దుర్గ, తెల్లవారగనే ఎండి కూతురునకు బెట్టి మిగిలినది కారాగారము చెంత భర్తకడ నుంచెడిది  ఇట్లు కొన్ని దినములు జరుగ పిల్లకు స్ఫోటకము వచ్చినది  కానుగ చెట్టు క్రింద యీతాకుల నడుమ దుర్గ, పిల్ల

కొలికు కంటికిమంటికి నేకధారగా నేడ్చుచుండెను  సుబ్బరాజుగారు చెఱసాలలో భీష్మస్తవము పఠించుచున్నారు  కొంతసేపటికి పిల్ల మరణించినది  భార్యను చూచి సుబ్బరాజుగారు దుఃఖము నాపుకొని

''ఓయబ్బ! ప్రపంచ మిట్టిదని యెవ రెఱుఁగరు!
తొందర యేల? ఒంటిమెట్ట కోదండరాముఁ
డిచ్చినాఁడు, ఆయనయే తీసికొన్నాఁడు
ఓయబ్బ తన సొమ్ము తాను తీసికొనఁడేమి?

పోతరాజుగారి మాటయందు నాకున్నట్లే నీకును ప్రమాణ బుద్ధి యున్నది  కావునఁ జెప్పెదను

ఉ  పుచ్చిక వీరికెల్ల బహు మాత్రము చోద్యము! దేహిపుట్టుచుం
డచ్చుచునుండఁజూచెదరు చావక మానెడు వారిభంగి నీ
చచ్చిన వారి కేడ్చెదరు చావున కొల్లకదాఁగ వచ్చునే?
ఎచ్చటఁబుట్టె నచ్చటికి నేగుట నైజము ప్రాణికోటికిన్

అందువలన మన యమ్మ వైకుంఠమున నున్నది  నేనెఱుఁగుదును  రాత్రియె నాకుఁదెలిపి నది'' అని చెప్పి యామె నోదార్చెను

''ఇంతలో స్ఫోటకపు శవమునచ్చట యుంచరాదని చెరసాల భటులు గద్దించిరి  దుర్గమ్మ—అయ్యలారా! నా పిల్లకుఁ దరువాతి కర్మ జరిపించుటకుఁగాసైన లేదు  నేనే నా చేతులతో నీ కర్మ జరిపింపవలెనా, యని గోలుగోలున నేడ్చుచుబోయెను  ఆ యేడ్పునకు భర్త గుండె లేకావు, బ్రహ్మాండమంతయుఁ దల్లడిల్లినది  మకరి పట్టి పీడించి నిర్వీర్యునిగ నొనర్చిన గజేంద్రుని మాడ్కి సుబ్బరాజుగారున్నారు  అట్లే

''శా  లావొక్కింతయు లేదు, ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను, మూర్ఛ వచ్చెఁ దనువుం డస్సెన్, శ్రమంబయ్యెడిన్
నీవేతప్ప నితఃపరం బెఱుంగ మన్నింపందగున్ దీనునిన్
రావే! యీశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా!

యీ పద్యము జదువుకొనుచు శాంతి వడిరి

౬

సుబ్బరాజుగారి గంటపు దెబ్బ తిన్న భటుఁడు మరణించెను  ఖూనీ చేసినందులకు సుబ్బరాజు గారిని భీష్మైకాదశి దినమున విచారణకు దీసికొని రమ్మని నవాబుగారి యాజ్ఞ యైనది  దుర్గమ్మ

కంతకు ముందే భేదులు ప్రారంభమైనవి ఒకనాడామె భర్త వద్దకు దేకురుకొనుచు వచ్చి, తానిక బ్రతుకుట దుర్లభమని కడసారి దర్శనమునకై వచ్చితినసెను ఆమెను చూచి భర్త కొయ్యబారెను ఒక్క నిముసమునకే తెలివి తెచ్చుకొని, యామెను చూచునరికి "శ్రీ రామచంద్ర! మీ పాద సన్నిధినే మరణింపవలెనని యున్నది కాని వ్యాధియు, భటులును నుండ నీయుట లేదు నన్నను గ్రహింపుడు ఇవే నమస్కారములు" అని యామె యనుచు నతి కష్టములో లిరిగి పోవుచుండెను ఆమె యవస్థ చూచి, తన యవస్థం దలంచికొని సుబ్బరాజుగారు —

క కలఁడందురు దీనులయెడఁ
గలఁడందురు పరమ యోగి గణముల పాలం
గలఁడందు రన్ని దిశలను
గలఁడు గలండనిన వాఁడు కలఁడో లేఁడో?"

లని చదువుకొనుచు, ఎట్లు సందేహము గలిగినను వెనువెంటనే ధైర్యమునవలంబించి, నిశ్చల మనస్సుతో

'క నీ పాద కమల సేవయు
నీ పాదార్చకుల తోడి నెయ్యంబు నితాం
తాపార భూత దయయునుఁ
దాపస మందార! నాకు దయసేయఁగదే"

అని ధ్యానించుకొనుచుండెను

నవాబుగారి కచ్చేరి హాలులో సుబ్బరాజుగారు నేరస్థుని స్థానమున నిలువఁబడిరి "నీ గంటము దెబ్బచే మా భటుఁడు చనిపోయినాఁడు కాబట్టి నీకు మరణ దండన యేల విధింపకూడదో చెప్పు కొందువా?" అని నవాబుగారడిగిరి సుబ్బరాజుగారు నిబ్బరముతో "ఓయబ్బ! గంటపు దెబ్బకే చచ్చి పోయినాడయ్యా! గట్టిగా కొట్టనే లేదయ్యా! మా యబ్బ! యెన్ని గ్రంథములు వ్రాసిన గంట మయ్యా! ముందు జన్మమున వాఁడు మంచి కవియై పుట్టును నప్పుడుగు లెందుకు? నీ యిష్టము వచ్చినట్లు చేసికోవయ్యా! అడిగి యడిగి నీ వేమాత్రము చేయగలవయ్యా! పోపో" అని కచ్చేరినుండి పోవ బ్రయత్నింప భటులాతనిఁ బట్టుకొనిరి ఆతని తల నరుక వలెనని నవాబుగారాజ్ఞాపించిరి భటులాతనిని దగ్గరనే యున్న వధ్యస్థానమునకుఁగొని పోయిరి తలారి కత్తిచేతఁబట్టుకొని సుబ్బ రాజుగారి మొగము వంకఁజూడఁగనే యాతని కొకవిధమగు భయము కల్గెను కత్తిపారవైచి తానా

పని చేయఁజాలనని తలారి చెప్పెను. నవాబుగారు భటునితో సుబ్బరాజు తల నరుకకపోయిన, నాతని తలయే నఱికింతుమని బెదరించిరి. చేయునది లేక భటుఁడు చేయెత్తి కత్తితో కంఠముపై నొక వ్రేటు వేసెను. కాని కంఠముపై గాయమైన కాలేదు. తల తెగలేదు. అప్పుడు సుబ్బరాజుగారు, "ఓ యబ్బా, నీవలనఁగాదయ్యా!

పోతన్నగారి భాగవతము నా దలపైనుండగా, తల తెగుననియే యను కొంటివయ్యా! నఱకుటకు నీతరమయ్యా! నన్ను వెనుకకు విఱిచి కట్టిన కట్టు విప్పుము. చేతులను విప్పుము. అప్పుడు నరుకవచ్చును" అనెను.

నవాబు చేతులు విప్పుటకాజ్ఞ చేసిరి. సుబ్బరాజుగారు నెత్తి మీదనున్న పోతన భాగవతము తీసి, కన్నుల నద్దికొని, దానిని క్రింద పెట్టి, ప్రదక్షిణ నమస్కారము లాచరించి, "కోదండరామ ప్రభో" అని యొక్క పెద్ద ధ్వని చేసి, చావ చుట్టఁగబడి ప్రాణములు విడిచెను.

నవాబు గారికి కడుపులో చేయి పెట్టి కలచినట్లాయెనది. వారేడ్చి, యేడ్చి తుదకు రామ భక్తులైరి. పోతన భాగవత మహిమ యట్టిది.

— 'సాక్షి' నుండి సంగ్రహితము

## 2. పోతనను స్తుతించిన కవులు

### గ్రంథోదాహరణములు

క్రీ.శ. 1500 ప్రాంతమున నున్న ప్రసిద్ధ లాక్షణికుఁడు వెల్లంకి తాతంభట్టు, కవి చింతామణి యందు నారాయణ శతకము, భోగినీ దండకము అను పోతన కృతుల రెండింటి నుదాహరించి యున్నాఁడు. ఆ వెనుక కవులు పోతన్నను కవి స్తుతులలో నన్నయ తిక్కనాది కవులతో బాటు పేర్కొనిరి. కొందఱు ప్రత్యేకముగా పోతన నొక పద్యముతో స్తుతించిరి. వాని నీ క్రింద పొందు పఱచుచున్నాను.

1. (క్రీ.శ 1500) సింగన షష్ఠస్కంధము —

ఉ ఎమ్మెలు చెప్పనేల జగమెన్నఁగఁ బన్నగరాజ శాయికిన్
సొమ్ములు వాక్య సంపదలు సూఁబలు సేసిన వాని భక్తితో
నమ్మినవాని భాగవత నైష్ఠికుఁడై తగువానిఁ బేర్మితో
ఎమ్మెర పోతరాజు కవి పట్టపురాజుఁదలంచి మ్రొక్కెదన్

(క్రీ॥ 1509—1530 శ్రీ కృష్ణ దేవరాయల రాజ్యకాలము)

2 చరిగొండ ధర్మన్న — చిత్ర భారతము

సీ గీ నాచనామాత్యు సోము శ్రీనాథుఁబమ్మ
ప్రౌఢి యమరేశు బొమ్మెర పోతరాజు (1—8)

3 భామకవి పంచతంత్రము

సీ తెలుఁగున పాండవేయుల కథఁగూర్చి పెం
పెక్కిన నన్నయఁ దిక్కనార్యు
భాగవతమ్ము నా పద్ధతిఁగావించి
వాలుపొంద బొమ్మెర పోతరాజు (1—11)

4 ఎడపాటి యెఱ్ఱన — మల్హణ చరిత్ర

చ వినుతులొనర్తు నాంధ్ర సుకవిప్రభు నన్నయభట్టు సర్వదే
వుసు భవదూరు, వేము, నలపోతన పిల్లలమఱ్ఱి వీరభద్రుని . . . (1—9)

5 పుత్తేటి రామభద్రకవి — సకల కథాసారసంగ్రహము
"గీ నిత్యసత్కీర్తిఁబోతనామాత్యసుకవి"

(క్రీ॥ 1530 నుండి క్రీ॥ 1600 వఱకు)

6. రేవణూరి వెంకటాచార్యుడు — శకుంతలా పరిణయము

మ పరఁగన్ భారత కల్పనాపరులు శబ్దస్ఫూర్తి సంధింప ని
ర్భరవృత్తిన్ పరమేశ పోతఘను లాలంకారముల్ గూర్పఁజా
పరులై నట్టి పితామహాదులు మతుల్ పాటింపవర్తించు నీ
సరసాంధ్రోక్తి వధూటి కేను సుమన స్సంపూర్తిఁగావించెదన్

7 చరిగొండ హన్నయ — జ్యోతిష రత్నాకరము

సీ. సరవితో బద్దెనామని నన్నయభట్టు
సుగుణాఢ్యు తిక్కన సోమయాజి
తాలల శ్రీరామచంద్ర బమ్మెర పోత
నాఖ్యసత్కవిని శ్రీనాథసుకవి''

8 కావూరి యెల్లయ — బ్రహ్మాండ పురాణము

''సీ. శ్రీ భాగవత సుధా సేవాధిరతుని బమ్మెర
పోతరాజు వర్ణనము చేసి''

9 అయ్యలరాజు రామభద్ర కవి — రామాభ్యుదయము
''ఆంధ్ర సద్భాగవత కర్త నభినుతించి''

10 కంచర్ల అయ్యన — అధ్యాత్మ రామాయణము

సీ గీ ఎవకవీంద్రుల శ్రీనాథకవిసిం బోత
రాజులింగని సూరవరాజు పిల్లి
సాని పెద్దన తిమ్మన ఎరన రామ
లింగకవి రామభద్రుల లీలదలచు

11 ''తెనాలి రామభద్రకవి — ఇందుమతి పరిణయము
''ధీనిధి బమ్మెర పోతనార్యు''

12 తామరపల్లి తిమ్మయ — శివ ధర్మము

క వాగీశాగోచరమగు
భాగవతాగమము రామభద్రుని పేరన్
ధీగరిమందెనుగు చేసిన
భాగవతుంబోతరాజు బ్రణుతింతు మదిన్

13 వేగినాటి కొండయ — వివేక సింధువు, ముక్తి కాంతా పరిణయము
బమ్మెర పోతనార్యు సోము
యశో
ధనుడౌ బమ్మెర పోతరాజు మొదలౌ
ధన్యాత్ములం గొల్చెదన్

పోతన వెనుక యాతని వంశమున కవులు జన్మించిరి వారినిఁ గూర్చి యీ క్రింది వంశ వృక్షము వలన నెఱుఁగఁదగును




పోతన మనుమఁడగు ప్రౌఢ సరస్వతియు, మునిమనుమలగు కేసన మల్లనలును కవులై, కావ్యములు రచియించిరి

## ప్రౌఢ సరస్వతి

ఇతనిఁ గూర్చి కేసన మల్లన లిట్లు చెప్పిరి —

ఉ. చెప్పెఁ గృతుల్ సుధారసము చిప్పిల మీ జనకుండు, రూఢిచే
లొప్పఁగ శబ్దశుద్ధిగ మహోన్నతిఁ బ్రౌఢసరస్వతిం బ్రదుండా
చొప్పన మీరలుం గృతులు చోద్యముగా రచియింప నేర్తుగా
యొప్పడు కేసనత్కవి సమిద్ధ గుణాకరమల్లన త్కవీ!

కాని ప్రౌఢ సరస్వతి కృతులు మనకేమియు లభింపలేదు

## కేసన మల్లనలు

వీరిరువురు జంట కవులు తమ ప్రపితామహుఁడగు పోతన వలె, శివకేశవ భేదము లేనివారు మాహేశ్వరులగు నివటూరి గుర్వారాధ్యుల, ముక్తి నాగేశ్వరారాధ్యుల శిష్యులై సమ విశిష్టాద్వైత సంప్రదాయ ప్రవర్తకులగు తిరుమల తిరువెంగళాచార్యుల వంశ యామత సిద్ధాంతముల నెఱింగిరి.

శైవకృతి యగు "దాక్షాయణీ పరిణయము"ను, వైష్ణవకృతియగు "విష్ణుభజనానందము"ను రచియించిరి. ఈ రెండును అముద్రితములు.

వీరిరువురును దాక్షాయణీ పరిణయమున, పోతన నిట్లు స్తుతించిరి

చ. వెలిగుంటి గన్న సన్నయ మనీషినిదిక్కన శంభుదాసునిన్
ఎరువడి మత్పితామహుని బమ్మెర పోతన[1] భాస్కరాహ్వయున్
ఎఱకవి సార్వభౌముని నవారిత భక్తి నుతింతు మెచ్చఁడున్
గురుకరుణాఢ్యులాంధ్ర కవికుంజరులెం దగ భూతి శోభిలన్

ఈ జంట కవుల సోదరి యెల్లమ. ఈమె భర్త అజ్జరపు పేరయ లింగము. ఈతఁడును ప్రశస్తకవి. ద్రావిడ శైవ వాఙ్మయమున ప్రసిద్ధిఁబడసిన సుందర మూర్తి నయనారు చరిత్రమును "ఒడయనంబి విలాసము" అను పేర నైదాశ్వాసముల పద్య కావ్యమును రచియించినాఁడు. మహానుభావుఁడును, మహాభక్తుఁడు నగు పోతన యొక్క మనుమని కూతురును పెండ్లి యాడిన కారణమున 'ఎల్లమాంబకళత్ర' అని తన భార్య పేరును కృతియందు శాశ్వతము గావించినాఁడు. జయదేవ కవి,గీత గోవిందమున "పద్మావతీ చరణ చారణ చక్రవర్తి" అని చెప్పుకొనినట్లుగా నీ కవియు 'ఎల్లాంబికా సతీపదయుహృదయు, పాదపద్మాప్తమూర్తి నై బరఁగినాఁడ" అని తన కృతియందుఁజెప్పు కొన్నాఁడు. వీరు క్రీ. 1650 ప్రాంతమువారు.

తెలుఁగున జంట కవులలో మొదటివారు, రంగనాథ రామాయణోత్తర భాగమును రచించిన కాచవిభుఁడు, విఠలరాజు అనువారు. రెండవవారు, నందిమల్లయ్య, ఘంట సింగయ కవులు. మూఁడవవారు కేసన మల్లన కవులు[2] పోతన వంశీయుల కవితా విశేషములిందు ప్రస్తుతము గాక పోవుటచే వానిని వివరింప లేము[3]

క్రీ॥ 1700—1960

21 పింగళి యెల్లన — తోభ్యచరిత్ర
"హేమ భీమ కవిని"

---

[1] ఇచ్చట పోతనను తమ పితామహునిగా వర్ణించినను, పైన యిచ్చిన వంశ వృక్షమును బట్టి వారు పోతనకు ముని మనుమలు గాని మనుమలు గారు

[2] సర్వాంధ్రసాహితీ జగత్తున 'తిరుపతి వేంకటేశ్వర' జంట కవుల నామ మజరామర మైనది వేంకటపార్వతీశ్వర కవుల నామములును విశిష్టమై విఖ్యాతినందినవి

[3] 'రాజనీతిరత్నాకరము' అనున ముద్రితగ్రంథమున నేందికృష్ణయామాత్యుడను కవి తాను పోతన వంశీయుడనని చెప్పుకొన్నాడు

22. పెనుమళ్ల సోమకవి — సీమంతినీ పరిణయము

"బమ్మెర పోతన కవీంద్ర శేఖరుకో"

23 కాళ్లకూరి లక్ష్మీపతి — భద్రా కల్యాణము

"మిక్కిలి భక్తితోడఁ బ్రణమిల్లెద భాగవత ప్రబంధకున్"

24 కొక్కొల్లపాటి లింగన — సూర్యతనయా పరిణయము

"బమ్మెర పోతన నభినుతింతు"

25 గరికపాటి తమ్మయ — సిరియాళు చరిత్ర

"పూని కొలిచెద బమ్మెర పోతవిభుని"

26 వెల్లమెట్ల సరస్వతీ సోమయాజి — పృథుచరిత్ర

చ. పరులకసాధ్యమై పరగు భాగవతంబు రహస్యమంతయున్
హరికృపచే నెఱింగి మృదులాంధ్ర వచోరచనాచమత్క్రియా
కరణ మహా ప్రబంధముగా రచియించిన భానుతేజు బ
మ్మెర పుర పోతరాజును నమీకృత తేజు నుతింతునెప్పుడున్

27 బసవరాజు నాగేంద్రకవి — ఆనంద మంజరీ చాతుర్య లీలా విలాసము

ఉ. సమ్మతిగాను భాగవతసారముఁదీసి, తెనుంగుఁజేసి లో
కమ్ములయందు నిర్భికవికాంత సమాజములోన నెక్కుడై
తమ్మిమహాత్ముఁలో దితునిఁదల్చి భజించి మహాత్ముఁడైన యా
బమ్మెర పోతరాజు కవి పాఁయుగంబునకేను మ్రొక్కెదన్

28 తేకుమళ్ల రంగశాయి కవి—ద్విపద భాగవతము

"ద్వి. చతురుల నెంచి వ్యాసప్రోక్త భాగ
వతము తూచా య్మైన వదలి పోనీక
యనవమొప్ప
రసికు బమ్మెర పోతరాజు వర్ణించి"

29 తిరుమలరాజు మూర్తి రాజు—ద్రౌపదీ పరిణయము

"శా. శ్రీనాథార్యుని పోతరాజ కవిఁబేర్మిన్ భీమునిన్ సోమునిన్"

30 వెంకట కవి — కార్తీక మాహాత్మ్యము

గీ. భారతామ్నాయము తెనుంగు పరచినట్టి
యున్న పార్యుని తిక్కన యజ్వఁ దలఁతు
వరుస రామాయణము భాగవతముఁ దెలుఁగు
సలుపు భాస్కర పోతయాఖ్యుల నుతింతు

31 అపంచి భావన — రఘురామవిజయము

"గీ. భారతము, రామ కథయును భాగవతము
తెనుఁగు చేసిన కవులనుద్దీప్తిరవులఁ
దలఁతు"

32 వానపాల తిరుమల రాజా — లక్షణా కల్యాణము

ఉ. తలఁచెద
సూరన పెద్ద పోతనార్యులన్

33 చిదంబర కవి — అంగదరాయబారము ఈ కవి మహారాష్ట్రుఁడు

మ. పదలాలిత్యము, పాకశుద్ధి భగవద్భక్తాగ్ర సంసేవ్యమున్
పదమత్యున్నతమున్ మహాపథదమున్ పద్మోద్భవానందమున్
చిదచిద్రూపవిభాగ భాగవతమున్ చింతింతు నాంధ్రంబుగా
సదయం జెప్పిన పోతరాజ పదముల్ సత్ప్రేమ నే మ్రొక్కెదన్

34 గోటేటి సూరన — కృష్ణాభ్యుదయము

సీ. ... నన్నయకుఁ దిక్క
యజ్వకుఁ బ్రణమిల్లి యాద్యుఁడౌ శ్రీనాథ
బొమ్మెర పోతన ప్రముఖుల కెఱఁగి"

35 సేతుపతి — జాంబవతి పరిణయము

చ. అనఘుని కాళిదాసుని మనంబున నెంచి
నన్నపార్యుని
క్కనల నుతించి భారవికిఁ గక్కన మ్రొక్కులు బెట్టి పోతనా
ర్యుని మదిలోఁ దలంచి కవియోధుల కెల్లను భక్తియుక్తుఁడై"

42 పావనామాత్యుఁడు — సేతుఖండము

సీ. మూర్తిత్రయ్యై వెలుఁగొందె ముఖ్య పేశల శబ్ద
రచనమందగు నన్న సత్కవీంద్రు
డనుపుగా విలసిల్లె నలసోమయాజియుఁ
బటుతరాన్వయు వాలి భాస్కరుండు
పొసఁగఁగట్టిన యట్టి పుట్టంబు పోతన
పింగళి సూరన దంగు వ్రాఁత
అలసాని పెద్దన విలసిదాత్మ స్థితి
శృంగారములు ప్రోవు వెంగళప్ప

గీ. జాతి కవితాప్రవృత్తికి
ననుచు గొనియాడఁదగునట్టి యయ్యాంధ్ర కవుల

43 కాణాదము పెద్దన సోమయాజి—ముకుంద విలాసము

ఉ. నన్నయభట్టు భీమన ననంతు నధర్వణుఁ దిక్క హోత్రి నె
ఱ్ఱన్నను సోము భాస్కరుని నయ్యల నైషధ కావ్య కర్తఁ బో
తన్నను చిన్న వీరనఁ బినన్నను సూరవరామభద్రుఁ బె
ద్దన్ననుఁ దిమ్మనార్యు గరుడాంకుని మూర్తినుకీర్తి వెంచెదన్

44 రాజశేఖర విలాసము — కూచిమంచి తిమ్మకవి

“మ. భువనిన్ నన్నయ భట్టుఁ దిక్కమఖి నెఱ్ఱాప్రెగ్గడన్ భాస్కరున్
క్రమమిం పొందఁగఁ బోతనార్యుని . . . శ్రీనాథ ము
ఖ్య మహాంధ్రాంచిత కావ్య కర్తకుల . . .”

45 చెముడుపల్లి భవానీశ కవి—ధర్మాంగదము

మ. ఎలమిన్ నన్నయ భట్టు దిక్కమఖి భీమేశాఖ్యునిన్ సోమున
ల్లాఖ్యుప్రాభవ పెద్దనార్యమును బోతామాత్య శ్రీనాథు

46 కృష్ణకవి — కేళుంజలా పరిణయము

గీ. . . . శ్రీనాథు భాస్కరు పెద్దనార్యు
పోతనామాత్యు మఱియుఁ బొలుపుఁగాంచు
నాంధ్ర కవితా విశాంతుల నభినుతింతుఁ

47 సర్పపుర మాహాత్మ్యము — కూచిమంచి తిమ్మకవి

ఉ. నామదినెప్పుడుం దలంతు
సోమునిఁ బోతసత్కవిని

48 దంతులూరి బాపిరాజు — మూర్తిత్రయోపాఖ్యానము

ఉ. నన్నయభట్టు భీమకవి నాచన సోముని నెఱ్ఱపెగ్గడన్
సన్నుత భారతార్థములనాదరణన్ దిక్కన సోమయాజి వి
ద్వన్నుమనీయ భాగవత వాక్యులు బమ్మెర పోతధీమణిన్
సన్నుతిచేసి యాధునిక సత్కవి రాజిరాజ సంఘ సేసెదన్

49 కూచిమంచి జగ్గకవి — సుభద్రా పరిణయము

గీ. నన్నపార్యుని దిక్కయ నాచిరాజు
సోము సమరేశు శ్రీనాథు భీమకవిని
రంగనాథుని బోలయ ప్రాజ్ఞవరుని
శంభుదాసుని భాస్కరు సన్నుతింతు

50 కోడూరి వెంకటాచలపతి — శివ రహస్య ఖండము

సీ. గీ. భూరిసత్కావ్యద్విజరాజు బోతరాజు
అచ్యుతైక సమాఖ్యనంచిత పదధారిఁ
ప్రకటించు శ్రీనాథు సుకవి వరుని

51 ఉయ్యందరాజు నారాయణ కవి — హంస వింశతి

ఉ. బమ్మెర పోతరాజు, నా
రన్నను

52. మాతృభూతకవి — అభినయ దర్పణము

గీ. అవని భాగవతోత్తముఁడనఁగఁబరగు
పెంకముగఁజాల బమ్మెర పోతరాజు
పాడిది శ్రీనాథుఁ దిక్కన సోమయాజి
భాస్కరుని సన్నుతించెద బాగుమీఱ

53 చంపూ రామాయణము — ఋగ్వేది వేంకటాచల కవి

సీ గీ ఆంధ్ర భాషా రచిత భారతాది కావ్య
భాగవత ముఖ్యవిఖ్యాత బహు విధప్ర
బంధమకరంద బృంద పుష్పంధయాద్య
మతిచణులునైన కవి శిఖామణులఁదలఁతు 1—12

54 ములుఁగు పాపయారాధ్యులు — సరస హృదయానురంజనము

ఉ భారవి హేమచంద్ర కవి భల్లట బిల్హణ కాళిదాస మా
యూర మురారి చోళనిచు లోద్భటులాధిగ నాద్య భారతీ
పారగులంద్రిలింగ కవి భాస్కర భాస్కర యజ్వపోతరా
ద్ధీరులనూరులంగృతి మతి స్థిర తామతి నాత్మనెన్నెదన్

55 వసిష్ఠ జనక సంవాదము — యాముజాల శేషయ కవి

మ చటులాజ్ఞానతమోర్కు నన్నయను భాస్వత్కుండలీంద్రున్వచః
పటులన్ భాస్కర పోతనాఖ్యుల యశఃపారీణు శ్రీనాథు

56 కొమ్మద్ది సుబ్బరాయ కవి — సూక్ష్మతను విద్యావిలాసము

ఉ సమ్మతమైన భాగవతసార వియద్ధుని సంస్కృతాంతరి
క్షమ్మనుండఁదన్న దివిజయ్యన భూమికిఁదెచ్చి ఘోర పా
పమ్ము లడంపగాఁదెలుఁగుఁబల్కిన మత్కుల పావనుండునౌ
బమ్మెర పోతనార్యుఁడను భవ్యభగీరథు నాశ్రయించెదన్

57 కొమ్మోజు సోమనాథ శిల్పాచార్యుఁడు — విచిత్ర రామాయణము

"గీ తెలుఁగు కవులగు నన్నయ తిక్కయజ్వ
పోతనామాత్యులను"

58 రామయ కవి — సాంబచరిత్రము
"తగిన సత్కవి వరుల పోతన్న నెంచి"

59 పొందూరి అచ్యుతరామ కవి — శ్రీకామాక్షీలీలా విలాసము

మ. సరసన్నాంధ్ర కవిత్వ శాస్త్రవిలసద్వ్యాఖ్యానుసారున్ మహా
సరసోదారునిఁదిక్కనార్యుని యశస్సంపాదు శ్రీనాథు బ
మ్మెర పోతాభిదు భాస్కరున్ బ్రకటనస్మేరాస్యునిన్ యెఱ్ఱనా
వరుసత్కావ్య కళాభి పోషుల మదిన్ వర్ణింతు నశ్రాంతమున్

60 శ్రీధరమల్లె వేంకట స్వామి — బ్రహ్మోత్తర ఖండము

ఉ. • నన్నయభట్టుఁదిక్కఘను నాచన సోముని భీమనాఖ్యునిం
బన్నగశాయి భక్తుఁడగు బమ్మెర పోతన నల్లసాని పె
ద్దన్నను

61 వద్దిపర్తికోన కవి — మహాలక్ష్మి పరిణయము

మ. ధరలో నాంధ్ర కవిత్వ తత్త్వ రచనాధ్యక్షప్రభా భారతీ భా
స్కర పోతాధిప పెద్దనార్యులను

62 యామిజాల వేంకట శాస్త్రి — సకలతీర్థ యాత్రామాహాత్మ్యము

ఉ. నమ్మికతోడ వేఁడితిని నన్నయ భట్టును దిక్కనాధ్వరిన్
బమ్మెర పోతరాజ కవి భాస్కరులన్మహనీయ సూక్తులన్

63 గుఱ్ఱంకొండ భక్తవత్సలుఁడు — కాటమరాజు చరిత్ర

సీ తే. పోతనామాత్యు నర్చించి పుడమి నితర
భూత కవులకుఁబ్రణమిల్లి"

64 తరిగొండ వెంగమాంబ — వేంకటాచల మహాత్మ్యము

సీ. ఆది కవీశ్వరుండైన వాల్మీకికి
వ్యాసమౌనికిఁ గాళిదాస కవికి
నదిగాక వరలబ్ధమన్నమాచార్యున
కాంధ్ర భాషా కవిత్వాఢ్యులకును
మొనయు నన్నయకుఁదిక్కన సోమయాజికిఁ
బోతరాజునకు సునీతులైన కవులకు"

65 పరశురామ పంతుల లింగమూర్తి గురుమూర్తి
సీతారామాంజనేయ సంవాదము
"భాస్కర బమ్మెర పోతరాజులన్"

66 గోపీనాథము వేంకటకవి — రామాయణము

ఉ భారత రామసచ్చరిత భాగవతాది మహాపురాణ ము
లొగ్గిరితెనుంగునన్నిఖిలలోక హితంబుగఁ జేసినట్టియా
ధీరుల నన్నపార్యకవి తిక్కన భాస్కర పోతనాదులన్
సూరివరేణ్యులం బరమశుద్ధులజిత్తమునం దలంచెదన్ 1—13

"భాస్కరాదులొక మర్త్యునిం
గృతిపతిం జేసి రచించిరి —
పోతనామాత్యుండు సీతాపతిం గృతిపతిం జేసి
బాగవతంబు రచించె" 1—39

67 కొక్కొండ వేంకట రత్నము పంతులు — బిల్వేశ్వరీయము

ఆ వె భాగవత వినుతము భాగవతపు సుధ
పోతరాజవీవె పోతరాజ!
విప్రయోగి దుఃఖ విధుఁడు నీచుఁడు వాఁడె
పోతరాజెడలినఁబోతరాజె

68 వావిలికొలను సుబ్బారావు — ఆంధ్ర వాల్మీకి రామాయణము

సీ ఆంధ్రీకరణ శక్తి నతకరించెను జాల
సర్వజ్ఞుఁడనఁబడు సకల కవులఁ
బరమ మధూక్తుల భవ్య కవితఁగూర్చెఁ
గౌదఁదీఱ నమృతంబుఁగూరికూరి
భక్తిరసైక సంపద గర్భితము చేసె
సకల రసావళి శ్లాఘ్యరీతి
హరి వర్ణనా సమయమునను స్వశరీర
విస్మృతి గనఁబడ వెలసినట్టి

గీ పోతనామాత్యు సత్కవిపూగజాత్యు
ధ్వస్తపాతిత్యు రఘుపతి ధ్యాన నిత్యు
సహజ పాండిత్య కృత కృత్యుశస్త్రసత్యు
ధీనురామాత్యుఁ గొలిచెద వాసిఁజెలఁగ 1—15

క తుచ్ఛులు సరిగాదనినను
స్వచ్ఛంపుఁబోతన కవిత్వ సంపద చెడునే
మ్లేచ్ఛ జఋభిదూషించిన
నచ్చ పతివ్రతకుఁ బాపమంటుటగలదే? 1—16

69 జనమంచి శేషాద్రి శర్మ — బ్రహ్మాండ పురాణము

మ వినుతింతుంగవిసార్వభౌమ బిరుదున్ విద్వత్సమారాధ్యుఁబా
వనవాణీ విభవున్ దిగంతర లసత్ప్రఖ్యాతు శ్రీనాథుసిన్
వనజాక్షాంఘ్రి సరోజ సంతతరసస్వాంత ద్విరేపుం గవీ
శుని శాంతాత్మునిఁబోతనార్యుసుకవిస్తోమాదృతున్ ధూర్జటిన్ 1—2

70 మిన్నికంటి గురునాథశర్మ ఏకాదశ ద్వాదశస్కంధములు

ఉ పేదరికంబు కాపురము, పెద్దది దేహియనంగ నాల్కయున్
రాదుమనంబు స్థైర్యమునఁ గాలక గ్రంథము వ్రాయశక్యముం
గాదు గురుండులేఁడు బహు ఘట్టములన్నిగమాంత విద్యయొ
ట్లీదితివయ్య పోతన కవీశ్వర! భాగవతాబ్ధి వీథులన్ 25

ఉ. బమ్మెర పోతనా! సహజ పాండితి! నీకవితా మరందబృం
దమ్మునమందభక్తిమెయిఁద్రావితిఁద్రేపితి మిన్ను సూచితిన్
గ్రమ్మకదుష్ణ బాష్పములు గ్రంథము తావకమిట్లు చిన్నభి
న్నమ్మయి పోవఁగా వలయునా యని యింత విచారమందితిన్

71 నందిరాజు చలపతిరాయకవి — మంగళగిరి మాహాత్మ్యము

ఉ దైవము మానుషాకృతినిఁదాల్చి జగద్ధిత భక్తి నిల్పఁగా
భావమువందలంచి వరభాగవతంబును దెల్గుబాసలో
రీవి ననన్యసాధ్యమగు రేవరచింపఁగఁజేసి లోకసం
భావనమీఱిదావళిలు బమ్మెర పోతన నెంతు సత్కవిన్

72 కల్లూరి వేంకట నారాయణ రావు — అశోక చరిత్రము

సీ. అనువాదమే మూలమునకు మెఱుంగుఁగా
శ్రీనాథు నుద్దివై చేసినావు
గౌతమి యలల చొక్కపు నిగ్గులలమి శ్రీ
గిరికడ భక్తిని గురిసినావు
ఓరుగల్ విప్లవ పారమర్థముఁగూర్చి
యొంటిమిట్టఁ బ్రశాంతి నోడ్చినావు
పల్లెలో వలస దపస్వివై పరతత్త్వ
ఫణితి పద్యాలలో దాచినావు

"గీ. సతత రస సమృద్ధి సుబోధశైలిఁ ఎల్ల
నీవెకద నీకు సాటి కన్నెత్త రాని
శేమిఁబొగులుచు నృపుల నర్గించినావు
పోతన కవీంద్ర! రససుధాపూర్ణ చంద్ర

73 అక్కిరాజు చంద్రమౌళికవి — స్వయంప్రకాశప్రబోధము

గీ. పావనుఁడు, హాలికుఁడు భజత్స్వర్శ వేది
సుగుణముల కుప్ప, విజ్ఞాని సుకవులనెడు
చక్కగమిలోన వెలుగొందు సోముఁడనఁగ
దశదిశలఁ గీర్తిఁగన్న పోతన్న దలుతు 1—14

74 మల్లంపల్లి వీరేశ్వర శర్మ—శ్రీ శంకరారాధ్య చరిత్రము

శా. ఉన్నాఁడాయనిపించెనైజకవితాభ్యున్నత్యహోవాదసం
పన్నుండై నరపాల దర్శనము సంభావింపఁ గాఁబోనియా
మన్నీఁడే కవి లోకమందు నతని న్మారందధారోర్మి, వై
యన్నద్యంబు పవిత్ర మంజుపదుఁబోతన్నం బ్రణామించెదన్
1—26

75 చింతలపల్లి నరసింహ శాస్త్రి — శృంగార కాదంబరి

చ తన కవితా కుమారి కనుతద్ధ ధనంబును న(గహారముల్
గొన మని యిచ్చు భూమి దవకుంజరులున్నను లేమిఁగుందుచున
న్నను హరికిచ్చి రాజులంద్రుణంబుగ నెంచి యశంబు గన్నయా
యనఘునిఁబోతనన్ దలఁతు నాద్రుతి భాగవతోత్తమోత్తమున్ 1—22

76 'పోతన తెలుఁగుల పుణ్యపేటి'
కవిస(మ్రాట్ విశ్వనాధ సత్యనారాయణ

77 క పులకింపఁగ జడదేహముఁ
బలికింపఁగ నంతరాత్మ భాషామృతమున్
చిలికించి భక్తి బీజము
ఒలికించెను పోతరాజు నాం(ధ నలందా ! 74
నిడుదవోలు వేంకటరావు

## ప్రత్యేక పద్యస్తుతులు

| | | |
|---|---|---|
| కప్పగల్లు సంజీవమూర్తి | పోతన (ప్రశంస | ఆం(ధ సాహిత్య పరిషత్ప(త్రిక |
| దీపాల పిచ్చయ్య శాస్త్రి | ,, | ,, |
| వడ్డాది సుబ్బరాయ కవి | ,, | ఆం(ధ ప(త్రిక సంవత్సరాది సంచిక 1923 |
| తుమ్మల సీతారామ మూర్తి | పోతరాజు స్మృతి | ,, |
| శేషాద్రి రమణ కవులు | ,, | ,, |
| పురాణం సూర్య నారాయణ తీర్థులు | | భారతి |
| రాయపోలు సుబ్బారావు | | తెలుగుతల్లి |

## 3. భాగవత పద్యముల నుదాహరించిన

### సంకలన(గంథములు

పోతనను లాక్షణికులు వెల్లంకి తాతంభట్టు తక్కతక్కిన వారుదాహరింపక పోయినను సంకలన (గంథములయందు భాగవత పద్యములనుదాహరించి యున్నారు

క్రీ శ 1550 ప్రాంతమున కూర్పబడిన పెద్దపాటి జగ్గన ప్రబంధ రత్నాకరమున నీ క్రింది పద్యముదాహృతమైనది

సీ విటసేనపై దండు వెడలిన వలతేని
గొల్లెనపై హోమ కుంభమనఁగ
కాముకధృతి వల్లికల ద్రుంప నెత్తిన
శంబరాంతకు చేతి చక్రమనఁగ
మరుఁడు పాంథశ్రేణి మానాటవులుఁ గాల్పఁ
గూర్చిన నిప్పుల కుప్పయనఁగ
విరహి మృగంబులవేఁటాడ మదనుండు
దెచ్చిన మోహన దీపమనఁగ

ఆ వె వీఁకునునుపు గలిగి వృత్తమై యరుణమై
కాంతితోఁ జకోర గణములుబ్బ
బొడుసుకొండచక్కిఁ బొడిచె రాకాచంద్ర
మండలంబు గగన మండలంబు

ఈ పద్యము భాగవతము దశమస్కంధ పూర్వ భాగమున 965 పద్యముగా నున్నది

ప్రబంధ రత్నావళి 156 పుటలో "గ్రంథ నామము, గ్రంథకర్త నామము తెలియ రానివి" అన్న పుటల క్రింద పద్యములలో పై పద్యము గలదు

క్రీ శ 1700 ప్రాంతమున సమకూర్పఁబడిన "ప్రబంధమణి భూషణము" అను గ్రంథమున భాగవతమునుండి యీ క్రింది పద్యము లుదాహరింపఁబడినవి

## ప్రబంధమణిభూషణము

| అవతారిక | | భాగవతము |
|---|---|---|
| 4 ప | ఉ ఆదరమొప్ప మ్రొక్కెడుదు | 1—5 |
| 8 ప | ఉ వాలిన భక్తి మ్రొక్కెద | 1—2 |
| 28 ప | ఉ క్ష్మోణితలంబునన్నుదురు సోఁకఁగ | 1—6 |
| పురవర్ణన | | |
| 50 | ఆ వె వరుణపురముకంటె | |

51 క అకసమ తోడి చూలన
52 శా సాధుద్వారకవాట
53 ఉ ఆయత వ్రజ నీల
74 క బ్రహ్మత్వము లఘువగునని
96 క పురులపగిది

ఋతువర్ణన
214 ఆ వె శంభుకంట నొకటి
216 పొడుపుకొండ మీఁద

హరిదర్శనము
332 ఆ వె కృష్ణ వాసుదేవ కేశవ

చంద్రోదయము
635 సీ విటసేనపై దండు వెడలిన

ప్రత్యూషము
819 మ లలనా యేఁటికిఁదెల్లనారె

సూర్యోదయము
832 సీ పాలోమితన బాలు పాప్పపై 10 1,1303

పై వానిలో ప్రబంధ మణి భూషణము క్రీ శ 1910 లో ప్రాచ్య విద్యా పరిశోధక బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారిచే ప్రకటితము

ప్రబంధ రత్నావళి 1918 లో శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి గారిచే సంపాదితము ప్రకటితము

## శ్రీ భాగవత సారముక్తావళి

అద్యతన కాలమున మహా భాగవతమునుండి పద్య సంకలనము చేయఁబడిన కృతులలో శ్రీ భాగవతసార ముక్తావళి మకుటాయమానమైనది ఇది సుప్రసిద్ధులగు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి తండ్రిగారైన కట్టమంచి సుబ్రహ్మణ్యరెడ్డిగారి వలన సమకూర్పఁబడినది ఇది తొలుత క్రీ శ 1885 సంవత్సరమున ప్రకటితమైనది ఆ వెనుక రెండవతూరి క్రీ శ 1936 లో శ్రీ శేషాద్రి రమణ కవుల పీఠికతోఁబ్రకటితమైనది

భాగవతమునుండి యుత్తమ పద్యముల నేరి శ్రీ సుబ్రహ్మణ్యరెడ్డిగారు వానినైదు ప్రకరణముల క్రింద విభాగించి యున్నారు

1 జగదుత్పత్తి ప్రకరణము
2 సంసార ప్రకరణము
3 సగుణ ప్రకరణము
4 నిర్గుణ ప్రకరణము
5 స్తుతి ప్రకరణము

వీనియందు భక్తి, జ్ఞాన, వైరాగ్యాదులకు సంబంధించిన పద్యములన్నియు నిమిడి యున్నవి

"శ్రీ కైవల్య పదంబుఁ జేరుటకునై" యను భాగవత పద్యముతోనిది ప్రారంభమగును • అవతారిక యను పేర నిష్ట దేవతా కథా సూచనకు సంబంధించిన పద్యములిరువది గలవు జగదుత్పత్తి ప్రకరణమున

| | | | | |
|---|---|---|---|---|
| 1 | మాయ | 49 | పద్యములు | |
| 2 | కాలము | 14 | ,, | |
| 3 | కర్మము | 36 | ,, | 99 |

అను నుప శీర్షికలు గలవు
సంసార ప్రకరణమున

| | | | | |
|---|---|---|---|---|
| 1 | సంసారికధర్మాధర్మము | 61 | | |
| 2 | సంసార విముక్త మార్గము | 85 | | 146 |
| | | | | 245 |

సగుణ ప్రకరణమున

| | | | | |
|---|---|---|---|---|
| 1 | సగుణ తత్త్వము | 85 | పద్యములు | 85 |

నిర్గుణ ప్రకరణమున

| | | | | |
|---|---|---|---|---|
| 1 | జ్ఞాన బోధ | 22 | గద్యములు | |
| 2 | విరక్తి | 43 | పద్యములు | |
| 3 | భక్తి | 86 | పద్యములు | |
| 4 | నిర్గుణ తత్త్వము | 128 | ,, | 279 |

స్తుతి ప్రకరణమున

| | | | | |
|---|---|---|---|---|
| 1 | నారాయణస్తుతి | 73 | ,, | |
| 2 | శివస్తుతి | 16 | ,, | |
| 3 | విష్ణుస్తుతి | 172 | ,, | 261 |
| | | | | 870 |

పదివేల పద్యములు గల భాగవతమునుండి యాధ్యాత్మిక విషయములను నెనిమిది వందల డెబ్బది పద్యములలో నిమిడించిన శ్రీ సుబ్రహ్మణ్య రెడ్డిగారు బ్రహ్మణ్యులని చెప్పదగుదురు పోతన భాగవతమునకు నీ ముక్తావళి సహోకృతి

## 4 భాగవతము: అనువాదములు, అనుసరణములు

పోతన భాగవతమును తెలుఁగున వెలయించిన వెనుక, నా గ్రంథము చంపూ, ద్విపద, వచనాది సారస్వత శాఖల యందన్నింట ప్రవర్తిల్లినది వాని వివరములు —
చంపూపద్ధతి

| | | |
|---|---|---|
| ప్రథమ ద్వితీయ స్కంధములు | 1 | బమ్మెర పోతన |
| | 2 | సంపన్ముడుంబ సింగరాచార్యులు |
| తృతీయ చతుర్థ స్కంధములు | | పోతన |
| పంచమస్కంధము | 1 | బొప్పరాజు గంగన |
| | 2 | సంపన్ముడుంబి సింగరాచార్యులు |
| షష్ఠస్కంధము | 1 | ఏర్చూరి సింగన — సంపూర్ణముగ లభ్యము |
| | 2 | హరిభట్టు |
| | 3 | నంది మల్లయ, ఘంట సింగయ<br>శృంగార షష్ఠము — అలభ్యము |
| | 4 | సర్వన్న (మలయమారుతము) ,, |

సప్తమ, అష్టమ, నవమ
దశమస్కంధములు 1 పోతన 2 సంపన్మండుంబ సింగరాచార్యులు

ఏకాదశస్కంధము
1 వెలిగందలనారయ — ముద్రితము
2 హరిభట్టు — (అముద్రితము)
3 సంజీవరాయకవి — అముద్రితము
4 కోవూరి పట్టాభిరామయ్య
5 సంపన్మండుంబ సింగరాచార్యులు
6 మిన్నికంటి గురునాథ శర్మ (1952)

ద్వాదశస్కంధము
1 వెలిగందల నారయ (ముద్రితము)
2 హరిభట్టు — (అముద్రితము)
3 సంపన్మడంబ సింగరాచార్యులు
4 మిన్నికంటి గురునాథ శర్మ (1952)

ద్విపదలు భాగవత ద్విపదలలో దశమస్కంధము ద్విపద మడికి సింగనచే పోతన కన్న ముందుగా గావింప బడినది కాని యది వ్యాసకృత భాగవతానువాదము గాదు
పండ్రెండు స్కంధములు — సంపూర్ణ ద్విపద — తరిగొండ వేంగమాంబ ఇందలి ద్విపదలు పోతన చంపూరచననుసరించియుండును
ప్రథమ, ద్వితీయ, తృతీయ
చతుర్థ స్కంధములు — తేకుమళ్ల రంగశాయి — అముద్రితము
దశమస్కంధము — రత్నాకరము గోపాలకృష్ణ కవి — అముద్రితము
" చెన్నయ్య "
యక్షగానములు
సప్తమస్కంధము— కురుమద్దాలి వేంకటాచలము — (1897 ముద్రితము)
దశమస్కంధము — ఆలూరి కుప్పన — (క్రీ శ 1740) అముద్రితము
కురుమద్దాలి వేంకటాచలము (1878 ముద్రితము)
చిలకమర్తి నారాయణాచార్యులు అముద్రితము
వచనము ద్వాదశస్కంధములు — కుందుర్తి వేంకటాచల కవి (క్రీ శ 1730) ప్రాంతము గ్రంథము లభ్యము కాలేదు తన కృతియగు మిత్ర విందాపరిణయమున నీ గ్రంధ రచనమును కావించినట్లందు చెప్పుకొని యున్నాడు

ద్వాదశస్కంధముల

1 శతఘంటము వెంకట రంగశాస్త్రి
2 నోరి గురు లింగశాస్త్రి (1897)
3 కేతవరపు వేంకటశాస్త్రి
4 విష్ణుపాద కవి (1904)
5 ద్రోణమరాజు వేంకటాచల పతి శర్మ
మంజువాణి (1902)

దొడ్డ భాగవతము — శ్రీ దొడ్లా వేంకటరామి రెడ్డి (ముద్రితము)

అచ్చతెనుఁగు భాగవతము
అల్లమరాజు రామకృష్ణ కవి — గ్రంథము లభ్యము కాలేదు

## భాగవతప్రతుల వివరణము

భాగవత తాళ పత్ర ప్రతులు చెన్నపురి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున, తంజావూరి సరస్వతిమహాలు పుస్తక భాండాగారమున, ఆంధ్రసాహిత్య పరిషత్కార్యాలయ భాండాగారమున మూఁడు వందలకుఁబైగా ప్రతులున్నవి

ముద్రిత ప్రతులు

| | | |
|---|---|---|
| క్రీ శ | 1840 | వేదము వెంకటాచల శాస్త్రి |
| | 1848 | పురాణం హయగ్రీవశాస్త్రి |
| | 1865 | కరాలపాటి రంగయ్య |
| | 1889 | వేలటూరి వేంకటసుబ్బాశాస్త్రి |
| | 1894 | పసప్పాకం ఆనందచార్యులు |
| | 1905 | వేమూరి వెంటకృష్ణమసెట్టి అండు సన్సు వారు ఆనంద ముద్రణశాల |
| | 1915 | |
| | 1926 | వావిళ్లవారు — (వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండు సన్సు వారు) |
| | 1948 | |

## భాగవత పరిష్కరణము

నేఁడు సుముద్రితములై వ్యాప్తిలో నున్న భారత భాగవత రామాయణాది పురాణములే గాక, శృంగార నైషధాది మహా కావ్యములును, వ్యాకరణ విషయమున బాల వ్యాకరణము ననుసరించియు,

ఛందో విషయమున నన్న కవీయమునను సరించియు, గ్రంథస్థ పాఠములను పండితులు సంస్కరించి రని, సారస్వత విమర్శకు నెల్ల తెలిసిన యంశము భాషోద్ధారకులగు బ్రౌను దొరవారిప్పటికి నూరేండ్లకు ముందే, మన ప్రాచీన కావ్యములను పాఠ భేదములు పరిశీలించి, పూర్వ లాక్షణిక సంప్రదాయమునను సరించి గ్రంథ పరిష్కరణము గావించి వానిని ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున భద్రపరచిరి కాని వారి కాలమునకుఁ దరువాత ప్రాచీన గ్రంథ ముద్రణము గావించినారు, ప్రాయికముగా పూర్వ పూర్వతర ముద్రణములనే యనుసరించి గ్రంథ ప్రకటనము గావించిరి గాని మూల తాళపత్ర ప్రతులను పరిశీలించి ప్రకటించిన వారుకారు ముఖ్యముగా ప్రాచీన భాషా వ్యాకరణ ఛందస్సంప్రదాయము లిట్టి ముద్రణము వలన మఱుఁగు పడినవి శివ కవి కృతులగు నన్నె చోడుని కుమార సంభవము, మల్లికార్జున పండితారాధ్యుని శివ తత్త్వసారము, పాల్కురికి సోమనాథుని బసవ పురాణ, పండితారాధ్య చరిత్రములు, శాస్త్రీయ గ్రంథ పరిష్కరణ విధాన దృష్టితో సుసంస్కృతములై వెలసిన వెనుక, కవిత్రయ మతానుసారులగు కవుల కావ్యము లెట్టి మార్పులకు లోనైనవి విమర్శక లోకమునకు దెలియవచ్చినది

ఈ దృష్టితో పోతన భాగవతమున నెట్టి మార్పులు, కూర్పులు, చేర్పులు గలిగినవో చూపుచున్నాను

అవతారికయందు భారతీస్తుతి రూపకములగు మూఁడు పద్యములున్నవి అందు 9 వ పద్యమగు

"ఉ అంబ! నవాంబుజోజ్జ్వలకరాంబుజ! శారద చంద్ర చంద్రికా
డంబర చారుమూర్తి! ప్రకటస్ఫుట భూషణ రత్నదీపికా
చుంబిత దిగ్విభాగ! శ్రుతిసూక్తి వివిక్త నిజప్రభావ! భా
వాంబర వీథి విశ్రుతవిహారిణి నన్గృపఁజూడు భారతీ!"

అనునది మహాభారతమున నరణ్య పర్వమున నాల్గవ యాశ్వాసమున 216 పద్యముగా నున్నది (ఇది ఎఱ్ఱన కవితలోనిది) కావున భాగవతమునందలి పద్యముకాదు

ఇందు 13 వ పద్యము చాల ప్రసిద్ధమైనది అందరి నాలుకలపై నాడునది.

ఉ ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములు కొన్ని పుచ్చుకొని, చొక్కి శరీరము వాసి, కాలుచే
సమ్మెట వేటులంబడక సమ్మతి శ్రీహరికిచ్చి చెప్పెనీ
బమ్మెర పోతరాజొకడు భాగవతమ్ము జగద్ధితంబుగన్

ఇదియునుఁ బ్రక్షిప్తమే

ఈ పట్టున (12) వచనము (13) యిమ్మనుజేశ్వరాధములు అను పద్యము, ఆ వెనుక 14, 15 పద్యవచనములు గలవు 12 వ వచనము చివర ''భావి కవులను బహూకరించి యుభయ కావ్యదక్షుండనై'' అని యుత్తమ పురుష సమాపక క్రియ యున్నది ఆ వెనుకనే గల ''చెప్పెని బమ్మెర పోతరాజొకండు'' అను ప్రథమ పురుష క్రియగల వాక్యము పై దానితో సమన్వయము చెందుట లేదు ఆ పైని యన్వయము సరిపెట్టుటకైన యింకను శ్రీ రామచంద్రమూర్తి దర్శనము నొసంగుట, భాగవతమును రచింపుమని యాజ్ఞనిచ్చుట మున్నగు విషయములు ముందుండ గానే, భాగవతము చెప్పె, అను భూతకాల క్రియగల వాక్యమెట్లు సార్థకముకాఁగలదు ? కావున నిది వ్రాయసకాండ్రు చేర్చినదేగాని పోతన కూర్పుకాదు పద్యమస్థాన పతితము [1]

భాగవతమున ప్రథమస్కంధము నేడవ పద్యమిట్లు గలదు

''శా పుట్టంబుట్ట శరంబునన్మొలవ నంభోయాన పాత్రంబులన్
నెట్టం గల్గను, కాళిఁగొల్వనుఁబురాణింపందొరంకొంటి'' —

పై పద్యమున ''పుట్టంబుట్ట'' అనఁగా వాల్మీకిని గాననియు 'శరంబునన్మొలవ' అనఁగా స్కందుఁడను కుమారస్వామిని గాననియు, అంభోయాన పాత్రంబులన మెట్టన్, అనఁగా వ్యాసుఁడను గాననియు నర్థము చెప్పుచున్నారు కొందఱీ యర్థము సమంజసముగా లేదనియు, కుమార స్వామిని సాధారణముగా సాహిత్య విద్యా దేవతగాఁ బ్రశంసింపరనియు,దెల్పియున్నారు తాళపత్ర ప్రతులలో

పుట్టం బుట్ట శిరంబునన్మొలవ నంభోయాన పాత్రంబులన్
నెట్టంగల్గను కాళిగొల్వను అను పాఠము గలదు

పుట్టంబుట్ట శిరంబునన్మొలవ — అనగా పుట్ట నా శిరస్సున బుట్టి నట్టి వాల్మీకిని గాను, వ్యాసుఁడను గాను అని దీని యర్థము ఆ పైని కొన్ని పద్యములకు వెనుక వచనములో ''ప్రథమ కవితా విరచన విలాసాతిరేకి వాల్మీకి నుతియించి, హయగ్రీవ దనుజకర పరిమిళిత నిగమనివహ విభాగ నిర్ణయ నిపుణతాసముల్లాసునకు వ్యాసునకు మ్రొక్కి'' అని యుండుటయు పై తాళ పత్రప్రతుల పాఠమున కనుగుణ్యముగ నున్నది

---

1 క్రీ శ 1954 లో ముద్రణమున (రాయల్ లండు కో వారిచేప్రకటితము) పై పద్యము లట్లే నిలిచియున్నవి

పై రీతిగా భాగవతమునకు సుపరిష్కృతమగు ముద్రణ మత్యావశ్యముగాఁగావలసి యున్నది

## విమర్శక వ్యాసములు

1918 బమ్మెర పోతరాజు — కందుకూరి వీరేశలింగము
ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచిక

1919 ఆంధ్ర భాగవత కర్తృత్వము — క్రొత్తపల్లి సూర్యరావు
ఆం సా వ పత్రిక 10 సం సం 2

1923 మహాకవి పోతన — కల్లూరి వేంకటనారాయణ రావు
ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచిక

1924 భాగవత ప్రాశస్త్యము — పె లక్ష్మి నరసయ్య
ఆంధ్ర పత్రిక క్రోధన 169—174 పుటలు

1926 భాగవతము — ముక్త్యాల సరస్వతి — సం 2 సం 10
మీఁగడ తఱకలు — 1949 పునర్ముద్రితము
పోతన భాగవతము — నిడుదవోలు వేంకటరావు
ఆం సా ప వ సం 29 10 సం 1—26 పుటలు

1933 పోతన — దేవరాజు వేంకట సత్యనారాయణ మూర్తి
భారతి 10 సం సం 3 (మార్చి 1933) 357—364
టలు

ఆంధ్ర
మహాభాగవతోపన్యాసములు

1957 1 , పోతన, చరిత్ర స్థల కాలము
శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ — పుటలు 1—18

ఈ గ్రంధము ఆంధ్ర సారస్వత పరిషత్తు హైదరాబాదు వారిచే ప్రకటితమైనది



## వాఙ్మయ సాహితీ విమర్శకుల వాక్యరత్నములు

గురుజాడ శ్రీరామమూర్తి కవి జీవితములు (1893)

పోతన పదశయ్యాదుల యందుఁదిక్కనతో సరిసేయందగువాఁడు ఎచ్చోఁబరిశోధించినను పోతన పాండిత్య విశేషంబుల పూర్వపు కవుల వానితో సమానముగను, కొంచెమధికముగ నుండును గాని న్యూనంబుగ నెన్నండు నుండవు తిక్కన సంగ్రహ శయ్యకును, పోతన యమక కవనంబున కును ప్రసిద్ధులు. తిక్కన రౌద్రబీభత్స రసప్రధానంబులగు నారభటీ వృత్తులును, వీర భయానక

రస ప్రధాన సాత్వతీ వృత్తులను జెప్పెడి స్వభావము గలవాఁడు పోతన శృంగార కరుణా రసంబులచే నొప్పు కౌశికీ వృత్తులును, హాస్య శాంతాద్భుత రస ప్రధాన భారతీ వృత్తులను జెప్పెడి స్వభావము గలవాఁడు తిక్కన ప్రత్యక్ష శయ్యనుడువనుత్సహించు పోతన భక్తి రసమొల్కునట్లు పల్కు సోమయాజి తెలుఁగు పదంబులు ప్రయోగించుట యందు విశేషాసక్తి గలవాఁడు పోతన సంస్కృత పద ప్రయోగ పటిష్ఠుఁడు శృంగార వర్ణనలఁ దొంటి పురాణ కవులలో బోతన కవనంబే మిగుల శ్లాఘనీయంబు

రుక్మిణి కల్యాణము, సత్యభామ యుద్ధము మొదలగు పట్టు హరి వంశంబున నెట్లా పెగడచే వర్ణితంబులయ్యె వానింబరిశోధించిన నీ యిరువురకుంగల తారతమ్యములు గోచరంబులగు శృంగార వర్ణనలు గాని చోట్లను జూచిన బోతన శంభుదాసునకు నీఁడగుననియుఁ గొంచెమతిశయించు ననియుఁదోచు (పుటలు 620—622)

2 తంజనగరము దేవరాజ సుధీమణి (తేవప్పెరుమాళ్లయ) (1905)

"శ్రీరామానుగ్రహ సమాసాదిత సరసకవితా సామ్రాజ్య ధురంధరుఁడగు బమ్మెర పోతనా మాత్యుండు, మృదుమధురాతి సుందర పదసందర్భ సౌభాగ్యంబు దీపింప నవరసభావబంధురంబుగా నమ్మహాగ్రంథంబు నాంధ్రీకరించె

మధురసఝురీమాధురీ ధురీణ నిరుపమాన నిరర్గళ కవిత్వధారా విరాజితుండగు పోతనా మాత్యుండు

అదిరసోచిత చిత్రవిచిత్ర రచనా చమత్కృతియు, నమేయ వర్ణనాచాతురియుఁదత్త్వార్థ పరి జ్ఞానంబును నిరుపమ ప్రతిభావిస్ఫురద దుర్వార కవిత్వ ధారా ప్రవాహంబునుంగల మహాకవికిఁగాక యందఱి కలవిగాదు అట్టి కవి పోతనయే యని యాతని కవిత్వమే చాటుచున్నది

రసవంతము, రచనా వైచిత్రి, వేదాంత విషయ వైదుష్యము, తత్త్వార్థ నిరూపణ నైపుణ్యము, మాధుర్యము, మృదుత్వము పోతన కవితా రీతి యందుఁగలవు

ఇక్కవి కవితా విలాస వైచిత్ర్యంబులు పెక్కులు

ఇట నిరుపమాన కవిత్వాతిశయ ప్రయుక్త నిరంకుశ స్వాతంత్ర్యమున మూలమునందలి పద్ధతి సరిగా ననుసరింపక సందర్భ సముదిత రసావేశ పారవశ్యమున మూలమునకంటె నత్యంత రసోద్దీపకముగా రచియించి యున్నాఁడు

పదలాలిత్యము, ప్రసాద వైభవము, సులలిత సరళధార పోతన కవితా కమనీయతకు ముఖ్య హేతువులు అర్థ సారస్యమున బదవాక్య సౌష్ఠవమున తిక్కన యంత ప్రౌఢముగాదు కాని రసోచిత వైచిత్రి గలదు తిక్కన కర్థ సారస్యమున గన్ను! పోతనకు రస సౌభాగ్యమున దృష్టి

## 3 నాగపూడి కుప్పుస్వామయ్య (1905)

"పోతన కవిత్వము సుకుమార సరస వచన రచనా ధౌరేయము, నాతి కఠినము శబ్దాలంకార శోభితము కోవిద పామర జన హృదయంగమము వీనుల విందు కోమల సురుచిర పద సముదాయ సంకలితము కైశికీవృత్తి ఓజః ప్రసాద మాధుర్యాది కావ్యగుణ సంకలితము పదములతి కోమలములు అలంకారములు మనోజ్ఞములు రచనలు సరసములు పాకము మధురము హరి భక్తి యుగ్గలము పాండిత్యము మిక్కుటము లోకానుభవం బహీనము వేదాంతార్థ చింతన మెండు"

## 4 రాయదుర్గము నరసయ్య శాస్త్రి (1915)

"ఇమ్మహాపురుషుని కవిత్వమతి మృదుల ఘటితంబు గావున కర్ణరసాయనంబై, శబ్దార్థాలంకార భాసమానంబు గావున పండిత పామర జన మనోరంజనంబై, యెల్లవారి హృదయార విందంబుల మందానందంబు నొందించు అర్థమాపాతస్ఫూర్తి గలిగి యుండు సమతా ప్రసాద మాధుర్యాది కావ్యగుణంబులు నెల్లెడలఁజూపట్టు"

## 5 శేషాద్రిరమణకవులు (1922)

"అనితర సాధారణ మృదు మధుర చిత్ర నిసర్గ నిరర్గళ ధారాధోరణి భాసురుఁడు పోతన ఆతని కవితా ధారా ధారా శుద్ధంబై సుకుమార భూయిష్ఠంబై యుండు కవితా విషయమున దాను చేసిన ప్రతిజ్ఞ శ్లాఘనీయముగ నిర్వహించి యజరామరకీర్తి గడించెను"

## 6. శ్రీ ఆంధ్ర శేషగిరి రావు — (పదునాల్గవ సంవత్సరాది సంచిక) (1924)

"పోతన శబ్దార్థముల రెండింటికి సమాన గౌరవములనిచ్చి, సామర్థ్యాతిశయముతో శబ్దార్థాలంకారములుపయోగించెను"

ఆత్మ గౌరము గల కవిసత్తముడు

7 శ్రీ సేవూరి లక్ష్మీనరసయ్య యం ఏ యల్ టి పదునాఅవ సంవత్సరాది సంచిక (1926)

భక్తి రసమున దాంధ్ర వాఙ్మయమునం బ్రథాన పీఠము పోతనదే ఆతని నా పీఠమునుండి తొలగింపఁగల కవి "నభూతో నభవిష్యతి" అని సాహసముతోఁజెప్పవచ్చును నవరసములలో భక్తిరసమొకటి గాక పోయినను దాని నొక రస స్వరూపముగ నిర్ణయించి, సజీవము చేసెను పోతన "రసోవైసః" అను సూక్తి నెఱింగిన వాఁడు

8 శ్రీ కల్లూరి వెంకట నారాయణ రావు (1928) కవిత్వవేది బోధార్థిందులు పోతన యొక్క సందేశము

"భక్తి ప్రధానైకేశ్వరో పాసనాద్వైత తత్త్వ విశిష్టమగు నిష్కామ కర్మయోగము"

9 విద్యారత్న వెంకటరావు (1948)

కవితా శిల్పమున సహజ పాండిత్యుఁడు వశ్యవాక్కుఁడు ఆబాల గోపాలము నాంధ్ర మహా జనుల హృదయములను, మధుర భక్తి భావనచే నుఱ్ఱూతలూఁగించిన మహాకవి మహాప్రవక్త ఆంధ్రుల భక్తిమయ జీవితమున పోతన స్థాన మాకల్పాంతరస్థాయి

10 శ్రీ పుల్లంపల్లి సోమశేఖర శర్మ (1956)

"ఆంధ్ర జాతికి పరమ పూజ్యుఁడైన భక్తావతంసము శ్రీ మదాంధ్ర మహాభాగవత కృతి కర్త పోతన శ్రీ రామచంద్ర కరుణా కటాక్షమును పొంది భాగవతము నాధారముగాఁగొని తెలుఁగువారి మన కేదారములలో భక్తి బీజములు వెదపెట్టిన హాలికుడు పోతన్నగారు"

11 శ్రీ కురుగంటి సీతారామయ్య (1956)

"భక్తి రసమునకు, భక్తి సిద్ధాంతమునకు శ్రీమద్భాగవతము ప్రెరకము అట్టి మహోత్కృష్టమైన గ్రంథమును పోతనామాత్యుఁడు తెలిగించి యాంధ్రులకు మోక్షమార్గము చూపినాడు"

12 శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు (1956)

"ఆంధ్ర సాహిత్యములో నాతఁడొక స్వప్నము వంటివాఁడు కవులెందరో పుట్టిరి పుట్టు దురు పోతనామాత్యునివంటి తపస్వి, ఋషి, కవి పుట్టునని ధైర్యముగఁ జెప్పలేము"

13 శ్రీ వేదాల తిరువేంగళాచార్యులు (1956)

"తెనుగు వారి మీది మిక్కిలి కృపతో పరమ భాగవతోత్తముఁడగు శ్రీ బమ్మెర పోతనా మాత్యుఁడు ఆ భాగవతము తెనుఁగున రచించి, తెనుఁగు లోకమునకంతకును భుక్తి ముక్తులను సమ కూర్చెను" (1941)

14 శ్రీ పింగళి లక్ష్మీకాంతము గారు (1958)

"ఆంధ్ర సాహిత్యాకాశమున తిక్కన పోతన లిరువురు సూర్య చంద్రులవంటి వారు"

## భాగవత పీఠికలు

| | | |
|---|---|---|
| 1848 | పురాణము హయగ్రీవశాస్త్రి | 1—25 పుటలు |
| 1905 | తంజనగరము తేవప్పెరుమాళ్లయ్య (దేవరాజసుధీమణి)<br>నాగపూఁడి కుప్పుస్వామయ్య | |
| 1915 | రాయదుర్గము నరసయ్య శాస్త్రి | 50 పుటలు |
| 1926 | శేషాద్రిరమణ కవులు | 24 పుటలు |
| 1948 | నిడుదవోలు వేంకటరావు | 26 పుటలు |
| 1954 | రాళ్లపల్లి అనంత కృష్ణ శర్మ<br>పుట్టపర్తి నారాయణాచార్యులు | |

— కవుల చరిత్రలు —

1893 గురుజాడ శ్రీరామమూర్తి
కవి జీవితములు — పురాణ కవులు
బమ్మెర పోతరాజు పుటలు 589—647

1917 కందుకూరి వీరేశ లింగము
ఆంధ్ర కవుల చరిత్ర — ప్రథమ భాగము

1924 వంగూరి సుబ్బారావు శతక కవుల చరిత్ర పుటలు 114—140
సంస్కృత పునర్ముద్రణము (1957)

1929 వేటూరి ప్రభాకర శాస్త్రి
శృంగార శ్రీనాథము పోతన ప్రశంస

1948 చాగంటి శేషయ్య — ఆంధ్ర కవి తరంగిణి
ఆఱవ సంపుటము బమ్మెర పోతనామాత్యుఁడు ఇతర కవులు
155—220 పుటలు

— వాఙ్మయ చరిత్రలు —

1920 వంగూరి సుబ్బారావు — ఆంధ్ర వాఙ్మయ చరిత్ర
సంస్కృత పునర్ముద్రణము — (1957)

1929 కవిత్వవేది — కల్లూరి వేంకట నారాయణ రావు ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహము

1941 శ్రీ పింగళి లక్ష్మీకాంతము
ఆంధ్ర వాఙ్మయము — గౌతమ వ్యాసములతో పునర్ముద్రితము

1959 విజ్ఞాన సర్వస్వము — తెలుఁగు సంస్కృతి సంపుటి
(తెలుఁగు భాషా సమితి వారిది)

1 తెలుఁగు వాఙ్మయము — ప్రబంధపూర్వ యుగము
పోతన — శ్రీ పింగళి లక్ష్మీకాంతము

2 బమ్మెర పోతన — అకారాదిసూచిక —
శ్రీ గడియారము వేంకట శేష శాస్త్రి

# BIBLIOGRAPHY

## English


1829 *Biographical Sketches of the Deccan Poets*
by Cavaly Venkata Ramaswamy
(Head Translator and Pandit in the Literary and Antiquarian Department of Royal Asiatic Society, Calcutta)

1839 *Essay on Telugu Language Literature*
by C P Brown

1852 *Bhagavatam* by Bammera Potarazu
Reference under P of C P Brown's English-Telugu Dictionary

1903 *Rukmini Kalyanam* from the 10th Skandha of Bhagavatam Translated into English
by G R Subbaramiah
Complete English Translation
Indian Antiquary Vol 37 pp 376—384

1921 *Potana*—Article in English by P Narasimham, M A, Professor of Philosophy, Presidency College, Madras
Encyclopedia of Madras Presidency and Adjacent States

1927 *Bammera Potanamatya*—Article in English by Prof K Rangachari, M A, B L
Sir Asuthosh Mukherjee Silver Jubilee Volume Orientalia Volume 3 Part 3 pages 180—209

1925 *A Historical Sketch of Telugu Literature*
T Rajagopala Rao, Christian College Magazine, 1924

1930 *Telugu Literature* P Chenchaiah and Bhujanga Rao, Heritage of India Series

1939 *Leaders and Landmarks in Telugu Literature*
Triveni — R Subba Rao

1944 *Telugu Literature*
P T Raju

1959 *Indian Literature — Telugu (pp 48—144)*
Potana — p 78